# గీటు రాయి

గీటు రాయి
గీటు రాయి
గీటు రాయి
గీటు రాయి
గీటు రాయి
గీటు రాయి

| గీటు | రాయి |
| --- | --- |
| జ్ఞానము | అజ్ఞానము |
| సత్యము | అసత్యము |
| దేవుడు | మాయ |

రచయిత: త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త
శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



# గీటు రాయి


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (77) దశ సప్తాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

## ఇందూ జ్ఞానవేదిక

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ప్రథమ ముద్రణ : ఆగష్టు–2016

ప్రతులు : 1000 **వెల : 140 /-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఒక్కడే ఇద్దరు.
75) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
76) దేవుని రాకకు ఇది సమయము కాదా!
77) సాయిబాబా దేవుడా! కాదా?
78) విశ్వ విద్యాలయము
79) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
80) గీటురాయి
**81) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**82) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**83) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**84) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**

**భాషలో పాండిత్యమును వదలి భావములో పాండిత్యమును చూచువాడు నిజమైన జ్ఞాని**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?
7. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-
లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-
మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.

*DVD'S*

57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. దంతము-అంతము.
114. మాయ మర్మము- ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు
చనిపోయాడా? చంపబడ్డాడా?
116. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావు పేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16469

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 7680065963
9704885964, 9848741703.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# గీటు రాయి

## (ప్రార్థన)

దీనిని వ్రాయుటకు ముందుగా నేను దేవున్ని ప్రార్థిస్తున్నానని చెప్పి ఆత్మను ప్రార్థిస్తున్నాను. మీతో దేవున్ని ప్రార్థిస్తున్నానని చెప్పాముగానీ దేవున్ని ప్రార్థించలేదు. ప్రార్థించినది ఆత్మను, ఒక విధముగా మీకు అసత్యమును చెప్పినట్లు కనిపించిన మాట వాస్తవమే. నేను ఇప్పుడే కాదు ఎప్పుడూ దేవున్ని ప్రార్థించలేదు, భవిష్యత్తులో కూడా ఎప్పుడూ ప్రార్థించను. అయినా నేను దేవున్ని ప్రార్థించనని నాకు తెలిసి మీకు అబద్ధమును చెప్పుచున్నాను. అలా అసత్యము చెప్పవలసిన అవసరమేమి వచ్చిందని ఇతరులు అడుగవచ్చును. దానికి నా సమాధానము ఇలా కలదు. నేను ఎప్పుడూ దేవున్ని ప్రార్థించలేదు. ఎప్పుడు ప్రార్థించినా నాలోయున్న, నా ప్రక్కనేయున్న ఆత్మను ప్రార్థించుచుందును. అయితే ఆత్మ అణిగియున్న వాడు, బయట తెలియబడువాడు కాదు. అందువలన నేను ఆయన ధ్యేయానికి వ్యతిరేఖముగా చెప్పకూడదు. జీవాత్మ అయిన నాకు ఆత్మయిన ఆయన తండ్రియగును. ఆత్మయిన ఆయనకు పరమాత్మ తండ్రియగును. ఆత్మయిన ఆయన అనగా నా తండ్రి చేసిన పనులనెల్ల తాను చేసినట్లు చెప్పకుండా తన తండ్రి అయిన దేవుడు చేసినట్లు చెప్పుచుండును. తన తండ్రి చేశాడని చెప్పుకోవడము ఆయనకు ఆనందము. తన తండ్రిని మించినవాడు లేడనీ, అన్ని పనుల కీర్తి తన తండ్రికే దక్కవలెనని నా తండ్రియైన ఆత్మకు ఇష్టము. నా తండ్రి అభీష్టమును తెలిసిన నేను నా తండ్రి చెప్పినట్లే నేనూ ఆయన తండ్రిమీదనే చెప్పుచుందును. అనగా నాకు తాతయైన దేవునిమీద చెప్పుచుందును. ఇదేమిటి దేశములో ఎవరూ చెప్పని విధానమును మీరు చెప్పుచున్నారేమిటి?యని మీరు అడుగవచ్చును.

దానికి నేను ఏమి చెప్పుచున్నానంటే ఇప్పుడిది మీకు క్రొత్తదే అయినా నాకు మాత్రము పాతదే. ఈ వావి వరుసల విషయము భగవద్గీతలోనూ, బైబిలులోనూ, ఖురాన్ గ్రంథములోనూ ముందే చెప్పియున్నారు. ఒకమారు భగవద్గీతలో ఏమి చెప్పారో జ్ఞాపకము చేసుకొందాము. రాజవిద్యా రాజగుహ్య యోగము అను అధ్యాయములో 17వ శ్లోకమును చూద్దాము.

శ్లో॥ పితాహ మస్య జగతో మాతాధాతా పితామహః ।
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవచ ॥

**భావము :- "అఖిల జగతికి తల్లితండ్రులు నేనేయగుదును. అంతేకాక ధాతను, తాతను నేనే. వేద స్వరూపమైన ఓంకారమును నేనే. ఋగ్యజుర్ స్సామ వేదములలోని వాక్కును నేనే."**

ఈ శ్లోకార్థములో 'తండ్రిని నేను' అని చెప్పడమేకాక 'తాతను కూడా నేనే'యని స్వయముగా దేవుడే చెప్పడమైనది. ఇప్పుడు మీకు బాగా అర్థమయి వుంటుంది. నాకు తండ్రి దేవుని అంశ అయిన ఆత్మకాగా, ఆత్మకు తండ్రి స్వయముగా దేవుడే. నేను దేవుని మీద నా ప్రార్థన చేసినట్లు చెప్పినా, అది కొంత అసత్యమయినా, చెప్పవలసిన విధానము అదియే. నా ఆత్మ స్వయముగా పని చేయుచున్నా తాను ఏమీ చేయనట్లు అంతా దేవుడే చేయునట్లు అసత్యమే చెప్పుచున్నది కదా! అందువలన నా తండ్రియైన ఆత్మ చెప్పిన పద్ధతి ప్రకారమే నేను చెప్పవలెను. 'నేను' అనునది నాకుగానీ, నా తండ్రియైన ఆత్మకుగానీ లేవు. ఆధ్యాత్మిక విద్య ప్రకారము ఉండకూడదు. అందువలన ఆత్మ చేసినా దేవుని మీదనే చెప్పవలసి వచ్చినది. ఒక్కమారుగా ఈ విషయములు అర్థము కావు, ఆధ్యాత్మికమును నేర్వంగా నేర్వంగా అసత్యములో సత్యమున్నదని తెలియును.

దీనిని వ్రాయుటకు ముందు నేను దేవున్ని ప్రార్థిస్థున్నానని చెప్పాను కదా! ప్రార్థించినది ఆత్మను, ఆత్మ ఎవరి కోర్కెలు తీర్చదు. ప్రార్థించినా ప్రార్థించకపోయినా జీవుని కర్మనుబట్టి శరీరములో కార్యములు చేయుచుండును. అట్లే కర్మనుబట్టి జీవునికి కష్ట సుఖములు కలుగ జేయుచుండును. కర్మనుబట్టి జీవున్ని అన్ని విధముల నడిపించుచుండును. ఏ జీవుని ఇష్టప్రకారము ఆత్మ పని చేయనప్పుడు ప్రార్థనతో పనే లేదు కదా!యని ఎవరయినా అడుగవచ్చును. దానికి నా సమాధానము ఇలా కలదు. ఆత్మ జీవున్ని కర్మప్రకారమే నడిపించును అనుమాట వాస్తవమే, అయినా ఇక్కడ ప్రపంచ విషయములయితే కర్మప్రకారము ఆత్మ నడుపును. ఏ జీవునికయినా శరీరములో ప్రపంచ సంబంధముగా ఎటువంటి స్వతంత్రము లేదు. ఆత్మ ఆడించినట్లు ఆడవలసిందే. అట్లే ఆత్మ తోలినట్లు నడువవలసిందే. అట్లని ఆత్మ తన ఇష్టప్రకారము జీవున్ని నడుపడము ఉండదు. జీవుని కర్మను అనుసరించి ప్రతీదీ లెక్కాచారము ప్రకారము ఆత్మ చేయుచుండును. మనిషి పుట్టినప్పుడే జీవునితోపాటు ఆత్మ వచ్చి అప్పటినుండి జీవున్ని తన చెప్పుచేతులలో కర్మ లెక్కప్రకారము నడుపుచున్నది. ఆత్మ ఆడించుచుండగా, జీవుడు ఆడుచుండగా, పరమాత్మయనబడు అల్లాహ్ లేక యెహోవా (దేవుడు) చూస్తున్నాడు. దేవుడు ప్రతి శరీరములో సాక్షిగాయుండగా, ఆత్మ పని చేయుచుండగా, జీవుడు అనుభవించుచున్నాడు. ఈ విషయమును అంతిమ దైవ గ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 50, ఆయత్ 21 లో ఇలా వ్రాసియున్నారు. **(50-21) "ప్రతి జీవాత్మ ఒక తోలే వాడితో, మరియొక సాక్ష్యమున్న వాడుతో సహా వస్తుంది."** ఇంకొక గ్రంథములో **(50-21) " ప్రతి వ్యక్తి తన వెంట తనను తీసుకు వచ్చే వాడొకడు, సాక్ష్యమున్నవాడు**

**ఒకడు ఉన్న స్థితిలో హాజరవుతాడు (జన్మకు వస్తాడు).**" అని కలదు. దీనినిబట్టి శరీరములో మొత్తము మూడు ఆత్మలు కలవని తెలియుచున్నది.

ఈ విధముగా మూడు ఆత్మలు శరీరములోయుండి జీవనయాత్రను సాగించుచున్నవి. కర్మలను చేసుకొన్న జీవుని కొరకు మిగతా రెండు ఆత్మలు శరీరములో ఉండవలసియున్నది. ఇది మానవ శరీరములోని నిర్మాణము. మానవ శరీరమును ధరించి దేవుడు భూమిమీదికి వచ్చినా అతని శరీరములో కూడా ఇదే మూడు ఆత్మల విధానమే ఉండును. నేను అనగా జీవుడను ఏదయినా కోరుకోవచ్చును. నేను కోరినది ప్రపంచ సంబంధమైతే ఎవరూ ఏమీ చేయలేరు. అది కర్మనుబట్టి యుండును, దానిని అడిగినా, గట్టిగా కోరినా నెరవేరదు. నెరవేరని దానికి ఎందుకు అడగాలి? ఆ విషయము మనిషికి తెలియదు. నెరవేరునను నమ్మకముతోనే అడుగుచున్నాడు. ఇవన్నీ తెలిసి నీవెందుకు ప్రార్థించావు? అని మీరు అడుగ వచ్చును. దానికి నా జవాబు ఏమనగా! నేను ఆత్మను కోరినది ప్రపంచ విషయము కాదు. ప్రపంచ విషయములో నాకు ఎలాంటి హక్కు, అధికారము లేదని తెలుసు. అయితే పరమాత్మ విషయములో ఏ జీవునికయినా స్వతంత్రము గలదు. కోరుకునే అధికారము గలదు, నెరవేరే అవకాశము గలదు. దేవుని విషయములో సర్వజీవులకు స్వతంత్రత ఇవ్వబడియున్నది. అందువలన మనిషి దేవున్ని దైవికముగా ఏమయినా కోరవచ్చును, ఎంతయినా కోరవచ్చును.

**ప్రశ్న :- అలా అయితే దేవునికున్న అధికారము నాకు కావలెనని మనిషి కోరవచ్చును కదా! అది దైవికమయిన ప్రార్థనే కదా? అలా కోరితే మనిషి కోర్కె నెరవేరుతుందా?**

**జవాబు :-** ఎలా నెరవేరుతుంది? నెరవేరదు. అది మొదటికే దైవికమయిన ప్రార్థనకాదు. ఎందుకనగా! దేవుని అధికారము ప్రపంచము మీదే ఉంటుంది. కావున నీవు ప్రపంచ అధికారమును అడిగినట్లయినది. అందువలన నీ ప్రార్థన ప్రపంచ ప్రార్థన, ప్రపంచ కోర్కె అయినది. దానివలన అది నెరవేరదు. నీవు దేవుని అధికారమును కోరక దేవున్ని కోరవలెను. దేవుని సన్నిధానమును కోరవలెను. దేవునిలోనికి ఐక్యమగు కోర్కెను కోరవలెను. అంతేగానీ నేరుగా దేవుని అధికారమును కోరకూడదు. అది ప్రపంచ సంబంధమైన కోర్కెయగును. దేవుడు తన మీద తనకు అధికారమును ఇతరులకు వదలి, ఇతరుల అధికారమును తాను తీసుకొన్నాడు. వివరముగా చెప్పితే తన మీద అధికారము మనుషుల చేతిలో పెట్టి, మనుషుల మీద అధికారమును తాను కల్గియున్నాడు. అయితే మనుషుల అధికారము దేవునిమీద ఉన్నదని మనుషులకు తెలియదు. దేవుని అధికారము మనుషుల మీద ఉన్నదని దేవునికి బాగా తెలుసు. దేవుని మీద దేవుని జ్ఞానము మీద అధికారమును మనుషులు కల్గియున్నా అది తెలియని దానివలన దేవుని మీద జీవుడు (మనిషి) తన పెత్తనమును చెలాయించలేక పోతున్నాడు. అయితే దేవుని మీద పెత్తనమును చెలాయించ డానికి ముందు అతని చిరునామా (అడ్రస్) మనిషికి అవసరము. దేవుని చిరునామా తెలియవలెనంటే దేవుని జ్ఞానమును తెలియాలి. దేవుని జ్ఞానమును తెలియాలంటే దేవున్ని తెలియాలను శ్రద్ధకావాలి. దానినే **'జ్ఞానము మీద శ్రద్ధ'** అంటారు. జ్ఞానము మీద శ్రద్ధ యున్నప్పుడు జ్ఞానము తెలియును. జ్ఞానమును తెలియగలిగితే దేవుని ఉనికి (అడ్రస్) తెలియును. దేవుని ఉనికిని తెలియగల్గితే మనిషి అనుకొన్నట్లు దేవుని వద్దకు చేరవచ్చును. దేవునికి సంబంధించిన శ్రద్ధ నీ ఇష్టమును బట్టియుండును.

**జ్ఞానము మీద శ్రద్ధ ప్రతి మనిషికి జన్మహక్కులాంటిది.** అయితే మనిషి తన హక్కును వినియోగించుకోవడము లేదు.

ప్రపంచ విషయముల మీద ఏ మనిషికి స్వతంత్రత లేదు, అట్లే ఏ హక్కు లేదు. ఉన్న స్వతంత్రము మీదికి దృష్ఠిని సారించకుండా, ఉన్న హక్కును వదలి లేని హక్కును, లేని స్వాతంత్రమునకు మనిషి ప్రాకులాడు చున్నాడు. లేని హక్కు కొరకు, లేని స్వాతంత్రత కొరకు ఎంతగా పోరాడినా మనిషికి ఏమీ ప్రయోజనము లేదు. అందువలన నేను దేవుని మీద దృష్ఠి కల్గి, దేవుని జ్ఞానము మీద ధ్యాస కల్గియుండి నాకు దేవుని జ్ఞానము ఇంకా బాగా తెలియవలెననీ, నాకు తెలిసిన జ్ఞానమును ఇంకా బాగా ఇతరులకు తెలుపవలెనను కోర్కెను కోరాను. ఈ కోర్కె ఎటు చూచినా ప్రపంచ సంబంధమైనది కాదు. అందువలన నేను నా ప్రార్థనగా దానిని నేను కోరడము సర్వ విధముల సమంజసము. నేను కోరినది నా జన్మ హక్కు. నా కర్మకు సంబంధించినది కాదు, ప్రపంచ సంబంధమైనది కాదు. అందువలన నేను కోరినది కోరినట్లు నెరవేరుచున్నది. నేను దేవుని జ్ఞానమును కోరాను కనుక నాకు దేవుని జ్ఞానము దొరుకుచున్నది. నేను దేవుని జ్ఞానమును ఎంత పుష్కలముగా కోరానో అంత పుష్కలముగా నాకు దొరుకుచున్నది. నాకు ఎంత దొరుకుచున్నదో, అంత నేను ఇతరులకు ఇస్తున్నాను. నేను ఎవరికి ఎంత ఇచ్చినా ఇసుమంత కూడా నావద్ద తగ్గక యున్నది. అందువలన నా ప్రార్థన ప్రకారము నా జ్ఞాన దాహము తీరుచున్నది, అట్లే ఇతరుల దాహము కూడా తీరుచున్నది.

**ప్రశ్న :- మీరు హిందూ మతములో పుట్టారు, కావున మీకు దేవుడు హిందువుల జ్ఞానమును ఇవ్వాలి. మీరు హిందువుల జ్ఞానమును తెలియగల్గితే హిందువులకు హిందూ జ్ఞానమునే చెప్పవచ్చును. అట్లు**

**కాకుండా మీరు మూడు మతముల జ్ఞానమును చెప్పుచున్నారు. మీరు దేవుని జ్ఞానమును అడిగియుందురు గానీ, మూడు మతములలోని దేవుని జ్ఞానమును అడిగియుండరు కదా?**

**జవాబు :-** ప్రపంచమునకంతటికీ ఒకే దేవుడు గలడు. ఆయననే కొందరు 'పరమాత్మ' అంటున్నారు. కొందరు 'ఎహోవా' అంటున్నారు. మరికొందరు 'అల్లాహ్' అని అంటున్నారు. మొత్తానికి అందరూ కలిపి 'దేవుడు' అనే భావముతోనే చెప్పుచున్నారు. అయితే ఇందులో ఈ మధ్య క్రైస్థవ మతము వచ్చిన తరువాత 'ఎహోవా' అను మాట క్రొత్తగా వచ్చినది. సృష్ట్యాదిలో **"పరమాత్మ, సృష్ఠికర్త, అల్లాహ్"** అను మూడు బిరుదులు (పేర్లు) మాత్రము ఉండేవి. ఈ మూడు పదములను, అర్థమును బట్టి, భావ సహితముగా ఆదిలో గల తెలుగు భాషలో చెప్పడమైనది. ఎట్లు చెప్పినా విశ్వము అను సామ్రాజ్య చక్రవర్తి ఒక్కడే, ఆయనే దేవుడు. దేవుడు ఒక మతమునకు సంబంధించినవాడు కాడు. మతములు ఈ మధ్య కాలములో కలియుగములో పుట్టుకొచ్చినవి. దేవుడు ఆదిలోనే తన జ్ఞానమును తెలియజేయడమైనది. దేవుడు ఆదిలో తెలియజేసిన జ్ఞానమును మనుషులు వివిధ యాసలలో, వివిధ భాషలలో చెప్పుకొనుచూ, చివరకు వివిధ మతములుగా చీలిపోయి జ్ఞానమును చీల్చుకొన్నారు. ఉన్నది ఒకే దేవుడే, ఒకే జ్ఞానమే. అయితే మనిషిలోని అజ్ఞానముచేత దేవుడు వేరు, జ్ఞానము వేరుగా ఊహించుకొని ఇది మా జ్ఞానము, ఇది మా దేవుడు అని చెప్పడమే కాక ఇది మా మతము అని అంటున్నారు. నాకు మనుషుల అజ్ఞానము ప్రకారము, తయారయిన మతముల ప్రకారము దేవుడు జ్ఞానమును నాకు అందివ్వలేదు. నాకు అందినది ఒకే దేవునికి సంబంధించిన జ్ఞానము. అదే జ్ఞానమే అన్ని మతములలో యుండుట వలన నాకు మూడు మతముల

జ్ఞానము సులభమైనది. వారు చెప్పుకొను దేవున్నే నేను చెప్పుచున్నాను. వారు చెప్పుకొను జ్ఞానమునే నేను చెప్పుచున్నాను. వారు అజ్ఞానముతో దేవుని జ్ఞానమును అర్థము చేసుకోలేకపోవడము వలన, దేవుని గ్రంథముల లోని వాక్యములకు తప్పు భావమును చెప్పుకోవడము, వ్రాసుకోవడము జరిగినది. నాకు దేవుడు, దేవుని జ్ఞానము తెలిసిన దానివలన ఏ మతము వారు ఎక్కడ పొరపడినది సులభముగా తెలియుచున్నది. వారు పడిన పొరపాటును సరి చేయుచూ మిగతా మతముల వారికి చెప్పడము చేశాము. అందువలన మూడు మతముల జ్ఞానమును, మూడు మతముల వారికి చెప్పడము నాకు సులభమైనది. అయినా నాకు మాత్రము ఒకే దేవుడే, ఒకే జ్ఞానమే, ఒకే మతముగానే అన్ని మతములు కనిపించుచున్నవి. వారి మతములు వారికి వేరువేరుగా యున్నా, నాకు జ్ఞానము వలన ఏకముగా కనిపించుచున్నవి. మా మతము, మీ మతము, మా దేవుడు, మీ దేవుడు అను వారు వారివారి మధ్యలో అసూయలు పెంచుకొని అవకాశము దొరికినప్పుడంతా ఒకరినొకరు హింసించుకొనుచున్నారు. నేడు జరుగుచున్న మత హింస పోవాలంటే **'అందరి జ్ఞానము ఒక్కటే, అందరి దేవుడు ఒక్కడే'**యని అందరూ తెలియాలి. అలా తెలుపడమే నా కర్తవ్యముగా యుండుట వలన నేను మీలాంటి వారికి మూడు మతముల జ్ఞానము చెప్పినట్లు కనిపించుచున్నది. వాస్తవానికి నేను ఒకరకమైన జ్ఞానమునే, ఒక మత జ్ఞానమునే, ఒక దేవుని జ్ఞానమునే చెప్పుచున్నాను.

**ప్రశ్న :- "నేను దేవున్ని ప్రార్థించుచున్నాను. నాకు దేవుని జ్ఞానము కావాలని ప్రార్థించుచున్నాను" అని మీరు చెప్పారు. మాలాగ ప్రపంచ కోర్కెలు కోరకుండా దేవున్ని మాత్రము ప్రార్థించుచున్నారు. ఉదాహరణకు క్రైస్థవుల ప్రార్థనకు, ముస్లీమ్‌ల ప్రార్థనకు ఎంతో తేడా కనిపించుచున్నది.**

**క్రైస్థవుల ప్రార్థనలో ఎక్కువగా కోర్కెలుండును, వారి కోర్కెలను దేవునికి చెప్పుకోవడము వలన దేవుడే నెరవేర్చునని వారి నమ్మకము. అందువలన కూతురు పెళ్ళివద్దనుండి కొడుకు ఉద్యోగము వరకు, తినే ఆహారము నుండి చేసే ఉద్యోగము వరకు, ఉప్పునుండి పప్పు వరకు మొదలగు కోర్కెలన్నీ కోరి చివరిలో "ఆమీన్" అని అందురు. ఆమీన్ అనగా 'నా ప్రార్థన స్వీకరించు' అని కొందరు అర్థము చెప్పగా, కొందరు 'తథాస్తు'యను అర్థమును చెప్పుచుందురు. తథాస్తు అనగా 'అలాగే'యని అర్థము. ఎవరు ఏ అర్థమును చెప్పుకొనినా "ఆమీన్" అను పదమును క్రైస్థవులు ముస్లీమ్‌లు ఇద్దరు ప్రార్థన ముగిసిన తర్వాత చెప్పుచుందురు. ఇప్పుడు ముఖ్యముగా అడుగునది ఏమనగా! ముస్లీమ్‌లు ప్రపంచ కోర్కెలు కోరకుండా ప్రార్థన చేయుచున్నారు. వారి ప్రార్థనలో దేవుని గొప్పతనమును చెప్పుకోవడము లేక పొగడడము తప్ప కోర్కెలు ఏమీ లేవు. మీరు చెప్పినది 'ప్రపంచ సంబంధము కానిది నిజమైన ప్రార్థన' అన్నట్లు. ముస్లీమ్‌లు చేసేది మీరు చేసే ప్రార్థనలాంటిదే కదా! వారు చేసేది సరైన ప్రార్థనే అయినప్పుడు, ప్రపంచ సంబంధము కానప్పుడు ముస్లీమ్‌లకు దేవుడు తన జ్ఞానమునే ఇచ్చియుండును కదా! దీనిప్రకారము మిగతా మతములకంటే మంచి మార్గములో యున్నట్లే కదా! దైవజ్ఞానమును వారికి దేవుడు ఇచ్చినట్లే కదా! మూడు మతములను పరిశీలించి చూస్తే మీరు చెప్పిన భావమునకు ముస్లీమ్‌లు దగ్గరగా యున్నట్లే కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** నేను చెప్పినది దేవుని జ్ఞానము మీద అధికారమును కోరమని చెప్పానుగానీ, దేవున్ని పొగడమని చెప్పలేదు. ప్రపంచ కోర్కెలను లేకుండా చేయమన్నాను. అంతేకాక దేవున్ని తెలియడము కొరకు దేవుని జ్ఞానమును అభ్యర్థించమన్నాను గానీ, దేవున్ని పొగడమని నేను ఎక్కడా చెప్పలేదు.

దేవుడు పొగడ్తలకు లొంగడు. అంతేకాక పొగడ్తలు ఆయనకు సరిపోవు. ఆయనను వశపరచుకొను విధానము ఆయన జ్ఞానమును తెలుసుకోవడము ఒక్కటేయని చెప్పాను. పొగడ్తలు ప్రపంచ సంబంధ కోర్కెలు కాకపోయినా అది ప్రార్థన అనిపించుకోదు. ప్రార్థన యొక్క ముఖ్యమైన అర్థము అర్థించడము, అనగా అడుగుకోవడము. "బిక్షాందేహి" అని అంటే అది అడుగుకొన్నట్లు అవుతుంది. పొగిడితే గొప్పలు చెప్పినట్లవుతుంది. దేవునికి పొగడ్తలు సరిపోవు. ఒకడు పొగడుచున్నాడు అంటే వాడు ఉన్న విషయమును చెప్పేవాడేగానీ దానివలన దేవునికీ ప్రయోజనము లేదు, మనిషికీ ప్రయోజనము లేదు. అడుక్కొనే వాడు తనకు కావలసిన బిక్షమును అడిగినట్లు, మనిషి తనకు కావలసిన జ్ఞానమును అడగాలి. అట్లు కాకుండా అడుక్కోవలసిన వాడు పొగిడితే, వాడు అక్రమంగా ఇతరుల సొమ్మును దోచేసే దానికేనని అర్థమయి వాని పొగడ్తలకు లొంగిపోకూడదని తలచినట్లు దేవుడు కూడా మనిషి పొగడ్తలకు లొంగకూడదనుకొంటాడు. కొందరి మనుషులకు పొగడ్తలు అంటే ఏమాత్రము ఇష్టము లేనివైవుండును. అట్లే దేవునికి కూడా పొగడ్తలు సరిపోవు.

ప్రార్థన విషయములో క్రైస్థవులు దేవునివద్ద లేనిదానిని అడిగితే, ముస్లీమ్‌లు తమకు కావలసిన దానిని అడగకుండా ప్రార్థనే కాని దానిని పొగడడమును ప్రార్థనయని అనుకొంటున్నారు. ముస్లీమ్‌ల ప్రార్థనలో దేవుడు మనుషులకు ఏమి అవసరమో దానిని అడుగలేదు కావున **అడగనిదే దేవుడు కూడా ఇవ్వడు.** **ప్రార్థన** అను పదములో రెండు భాగములు కలవు. ప్ర+అర్థన= ప్రార్థన అవుతుంది. **అర్థించడము** అను పదము నుండి పుట్టినది **అర్థన.** అందువలన అర్థించడమునకు ఏమి అర్థమున్నదో అదే అర్థమే 'అర్థన' అను పదమునకు కూడా గలదు. ప్ర అనగా ముఖ్యమైన

అని అర్థము గలదు. 'ప్రార్థన' అనగా ముఖ్యమైన అర్థన అనియూ, ముఖ్యమైన దానిని అభ్యర్థించడము అనియూ, అన్నిటికంటే గొప్పగా అడుగడము అనియూ అర్థమును చెప్పవచ్చును. క్రైస్థవులు అడుగుచున్నా అది దేవునివద్ద లేనిది, దేవుడు ఇవ్వలేనిదిగా యున్నది. ముస్లీమ్‌లు అడుగుచున్నామనుకొని అడుగవలసిన దానిని అడుగకుండా, సంబంధము లేని విషయమును మాట్లాడినట్లయినది. అందువలన దేవుని వద్ద నుండి వారికి ఏది అవసరమో దానిని పొందలేక పోవుచున్నారు.

గతములో బుద్ధిహీనత గలవాడు అనగా తెలివి తక్కువ వాడు చీమల కొరకు ఆకాశములో అన్వేషణ చేశాడట. చీమలు కావలసివస్తే భూమిలో వెదకాలిగానీ ఆకాశములో వెదకితే ఎప్పటికీ చీమలు దొరకనట్లు క్రైస్థవులకు దేవుని సాన్నిధ్యము దొరకడము లేదు. దేవుని రాజ్యమంటే ఏమిటో తెలియడము లేదు. అలాగే ఉచిత మజ్జిగ కొరకు రైతు ఇంటికి పోయిన కూలివాడు చెంబును దాచివేసి రైతును చూచి ఈ ఊరిలో నీకున్న ఆవులు ఎవరికీ లేవు, నీయంత గొప్ప ధనికుడు ఎవడూ లేడు, భూమి గలవారిలో నీకున్నన్ని ఎకరములు ఎవరికీ లేవు, నీవు పండించు పంటను ఎవరూ పండించలేరు. నీకంటే గొప్ప రైతు ఎవడూ లేడని పొగిడాడట. అప్పుడు ఆ రైతు తనను ఉచితముగా పొగిడించుకోవడము ఇష్టములేక వాడు తనను పొగిడినందుకుగాను వానికి పాతికో, పరకో ఇచ్చి పంపాడట. రైతు దగ్గర పనిచేసే కూలివానికి అవసరమైనది మజ్జిగ, అయితే వానికి లభించినది పాతిక రూపాయల డబ్బు, కసువు ఊడ్చుకొను చీపురు (పరక). వానికి ఏమి అవసరమో అది దొరకలేదు గానీ తనకు అవసరము లేనివి దొరికినట్లు, ముస్లీమ్‌లు తమకు కావలసిన అల్లా సాన్నిధ్యమును వదలి స్వర్గమును పొందుచున్నారు. ప్రార్థన వలన వారికి అంతిమ దైవగ్రంథములో చెప్పినట్లు స్వర్గము లభించుచున్నది.

ఈ విధముగా క్రైస్థవులు, ముస్లీమ్‌లు బోధకుల బోధనల వలన తప్పుదారి పట్టిపోయి, దైవగ్రంథములయిన తమ గ్రంథములలో ఏమున్నదో, దేవుడు ఏమి చెప్పాడో తెలియలేకపోయారు. నిజమైన ప్రార్థనను వదలి పేరుకు మాత్రము ప్రార్థన అయిన దానిని ఆచరించుచున్నారు. క్రైస్థవులలో, ముస్లీమ్‌లలో 'ఒక దేవుడు' అను నమ్మకమున్నది. వారి బోధకులు గ్రంథములోని వాక్యములకు సరైన అర్థమును బోధించకున్నా "దేవుడు ఒక్కడే, ఒక్క దేవున్నే ఆరాధించాలి, అన్యదేవతారాధన చేయకూడదు" అని బోధించి ఎంతో మంచి చేశారు. హిందువులలో ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతా జ్ఞానమును వారి బోధకులు తప్పుగా చెప్పి, దైవమార్గమును వదలి నడుచునట్లు చేశారు. అది అన్ని మతములలో సహజముగా యున్నదే అయినా, హిందువులలో మాత్రము వారి బోధకులు ఒకే దేవున్ని గురించి చెప్పక అనేక దేవుళ్ళను, దేవతలను వారు ఆరాధించుచూ మిగతా హిందువులను కూడా అనేక దేవతలను ఆరాధించునట్లు బోధించారు. అందువలన హిందూమతములో మొత్తానికి అన్యదేవతారాధన అలవాటై పోయినది. అలా ఆరాధించడమే హిందుత్వము అని వారే చెప్పుకొంటున్నారు. భగవద్గీతా గ్రంథములో వద్దని చెప్పిన ఆచరణలనే హిందూమతములో పెద్దలయిన స్వాములు, సన్న్యాసులు, గురువులు చెప్పడము వలన హిందూ ప్రజలందరూ భగవద్గీతలోని భావమును వదలి, దానిని ఏమాత్రము చూడకుండా, వారి పెద్దలు చెప్పినమాటలనే విని, మార్గము తప్పినవారై అన్యదేవతారాధన చేయుచూ, మేము సరియైన మార్గములో ఉన్నామని అనుకొంటున్నారు. మూడు మతములవారు వారి పెద్దల బోధనల వలన వారు కొంత తప్పుదారి పట్టి నడుస్తున్నారు.

**ప్రశ్న :- మూడు మతముల వారికి వారి దైవగ్రంథములయిన భగవద్గీత,**

**బైబిలు, ఖురాన్ గ్రంథములలోని వాక్యముల భావము సరిగా తెలియకుండా పోయినదని మీరు చెప్పిన మాటను నేను ఒకమారు ముస్లీమ్‌ల ముందర ప్రస్తావించగా, వారు తమ పెద్దలు ఏమి చెప్పితే దానినే సత్యమని నమ్ముతామని, వారి మతములో మొదటినుండి వచ్చు ఆచారము ప్రకారము మేము మా ఖురాన్ గ్రంథములోని మాటల అర్థము కొరకు మా పెద్దలు చెప్పిన మాటలకే ఎక్కువ విలువను ఇస్తామని, మా పెద్దలు ఖురాన్‌లో ఎంతో శోధించి తెలుసుకున్న వాక్యములనే మాకు తెల్పుచుందురని చెప్పారు. మా పెద్దలు చెప్పునది సత్యమైన జ్ఞానమే అయినప్పుడు మేమెందుకు మా పెద్దల మాటను వినకూడదు? అని అంటున్నారు. వారి మాటలకు మీరు ఏమంటారు?**

**జవాబు :-** వారి పెద్దల మాటను వింటామని అనడములో వీరి తప్పులేదు గానీ, వారు చెప్పే మాట సత్యమైనదా! కాదా!యని యోచించకుండా విచక్షణారహితముగా వింటామనడము తప్పగును. వారి పెద్దలు చెప్పే వాక్యములు సరియైన భావము కల్గియుండునవయితే ఫరవాలేదుగానీ, ఒకవేళ భావము తప్పినవైతే గ్రంథములో అల్లాహ్ చెప్పినది ఒకటికాగా మనిషికి అర్థమయినది మరొకటి యగును. అందువలన ఎవరి మతములో అయినాగానీ వారి మత పెద్దలు చెప్పు మాటలు సరియైనవో కావో కొంత యోచించవలసిన అవసరమున్నది. ఈ విషయమై ఖురాన్ గ్రంథములో ఆరవ సూరా 91వ ఆయత్‌నందు ఇలా వ్రాసియున్నారు.

**(6-91) "అల్లాహ్ (దేవుడు) ఏ మానవునిపైనా ఎలాంటి జ్ఞాన విషయాన్ని అవతరింపజేయలేదు అని పలికియున్నప్పుడు ఈ అవిశ్వాస జనులు దేవున్ని అర్థము చేసుకోవలసిన విధముగా**

**అర్థము చేసుకోలేదు. వారిని అడుగు మరి మూసా తెచ్చిన ఆ తౌరాత్ గ్రంథాన్ని ఎవరు అవతరింపజేసినట్లు? ఆ గ్రంథము ఒక జ్యోతి, మానవుల కొరకు మార్గదర్శకత్వము. మీరు దానిని వేరువేరు కాగితములుగా (గ్రంథములుగా) విభజించి చూపుతున్నారు. ఎన్నో విషయములను దాచేస్తున్నారు. మీకు గానీ, మీ పెద్దలకుగానీ తెలియని ఎన్నో విషయములు ఇందు మూలముగా మీకు నేర్పబడ్డాయి. తౌరాతు గ్రంథమును అవతరింపజేసినవాడు అల్లాహ్‌యే (దేవుడే) అని చెప్పు. ఆ తర్వాత వారిని వారి వ్యర్థ విషయములలోనే ఆడుకోనివ్వు"** అని గలదు. ఈ ఆయత్‌లో ప్రత్యేకించి 'మీకుగానీ, మీ పెద్దలకుగానీ తెలియని విషయములు' అనియుండుటను గమనించవచ్చును. ఆ మాట ప్రకారము ఎవరయితే తెలిసిన పెద్దలని అనుకొన్నామో వారు తెలియని వారేనని, గ్రంథములోని విషయములు మీకు తెలియనట్లే వారికి కూడా తెలియవని దేవుడు చెప్పినట్లు గలదు. అందువలన జ్ఞాన విషయములు గల దైవగ్రంథములను స్వయముగా మీరు చదివి అర్థము చేసుకోవలెను. ఇతర పెద్దలు చెప్పిన మాటలను విశధీకరించి చూచి అందులో సత్యముంటే నమ్మవలెను. సత్యము లేకపోతే వాటిని పెద్దలు చెప్పినవయినా, బోధకులు చెప్పినవయినా వదలి పెట్టవలసిందే! "ప్రపంచ విషయములలో పెద్దలు చెప్పినట్లు వినినా ఫరవాలేదుగానీ, దైవగ్రంథ విషయములలో మీరు శ్రద్ధగలిగి యుంటే మీకే నేరుగా జ్ఞానము ఇవ్వబడును" అని దేవుడు ఒక సందర్భములో మధ్య దైవగ్రంథములో చెప్పియున్నాడు. యోహాన్ సువార్త, అధ్యాయము 6, వాక్యము 32లో ఇలా చెప్పి యున్నాడు చూడండి.

**(యోహాను 6-32) "పరలోకము నుండి వచ్చు ఆహారము మోషే మీకియ్యలేదు. నా తండ్రియే పరలోకమునుండి వచ్చు నిజమైన ఆహారము మీకనుగ్రహించుచున్నాడు."** ఈ వాక్యములో ప్రజలకు దైవజ్ఞానమును ఆత్మయే స్వయముగా అందించుచున్నదని చెప్పుట వలన శ్రద్ధగల్గిన వానికి ఎవనికయినా వాని శరీరములోని ఆత్మయే జ్ఞానమును ఇవ్వగలదని తెలియుచున్నది. పరలోకము నుండి వచ్చు ఆహారము అనగా పరలోక సంబంధ జ్ఞానము అనియూ, పరలోకమును పొందుటకు (మోక్షమును పొందుటకు) తగిన దైవజ్ఞానమని అర్థము. దైవజ్ఞానమును తెలియుటకు దేవుని మీద శ్రద్ధ, భక్తి కల్గియుండవలెను. శ్రద్ధ, భక్తి లేనివానికి దైవజ్ఞానము తెలియబడదు.

ప్రశ్న :- **మాకు దైవగ్రంథములోని విషయములు అర్థము చేసుకొను స్థోమత లేదు. ఇంతకుముందు మేము దైవగ్రంథమును చదివినా మాకు అర్థము కాని విషయములెన్నో మీరు విశధముగా తెలియజేయడము వలన మాకు తెలియబడినాయి. మేము మిమ్ములనే మా బోధకులుగా తలచాము. మీ ద్వారానే అన్ని విషయములు తెలియుచున్నవి. మీరు లేని కాలములో అనగా జరుగబోవు భవిష్యత్తు కాలములో కూడా మీరు వ్రాసిన గ్రంథములను చూచి జ్ఞానమును తెలియుటకు అవకాశముగా యున్నది. ఈ లోకములో మీ వలననే ఇప్పుడుగానీ, తర్వాత ఎప్పుడయినా మీ గ్రంథముల వలన గానీ జ్ఞానము తెలియుననీ, మీరు తెలియజేయు జ్ఞానమును ఎవరూ తెలియజేయలేరని నిరూపణగా తెలియుచున్నది. అటువంటప్పుడు మేము మా పెద్దలయిన మీ వలన జ్ఞానము తెలిసిందియని చెప్పుకోగలము. అటువంటప్పుడు "మీ పెద్దలవలన మీకు జ్ఞానము ఇవ్వబడదు నేనే మీకు**

**జ్ఞానమును ఇస్తానని" దేవుడు చెప్పినమాటను చూచి స్వయముగా మీ వలన జ్ఞానమును తెలియగలిగిన మేము ద్వితీయ దైవగ్రంథములోని పై వాక్యమును నమ్మాలా! లేదా!! అను సంశయములో పడుచున్నాము. దేవుడు చెప్పినమాట శాస్త్రబద్ధమైనదైయుండును. అందువలన అది నూటికి నూరు పాళ్ళు సత్యమే. అట్లే మీరు చెప్పిన బోధవలన జ్ఞానము మాకు తెలిసినదీ నూటికి నూరుపాళ్ళు సత్యమే. మీరు చెప్పిన జ్ఞానము శాస్త్రబద్ధమై, సత్యమైనదిగా యున్నది. అందువలన ఇటు మీ బోధను కాదనలేము, అటు దేవుని మాటను కాదనలేము. మాలో నిండిపోయిన ఈ అనుమానమును తీర్చుటకు అన్ని విధముల మీరే సమర్థుడని తలచి, మిమ్ములనే భక్తి పూర్వకముగా అడుగుచున్నాము. దైవగ్రంథములోని దేవుని మాటను నమ్మాలా లేదా మీరే చెప్పండి. ఈ మాటను అడుగుటకు ముఖ్యమైన మరొక కారణము కూడా కలదు. అదేమనగా! దైవ గ్రంథములో కూడా కొంత కాలుష్యము ఏర్పడి మనుషుల మాటలు కూడా అందులో కలిసి యున్నాయని తెలియుట చేత పై వాక్యము దేవుడు చెప్పినదేనాయను సంశయమును కూడా వ్యక్త పరచుచూ అడుగుచున్నాము. దయచేసి వివరముగా జవాబును తెలుపమని కోరుచున్నాము.**

**జవాబు :-** ద్వితీయ దైవగ్రంథములోని (యోహాన్ 6-32) వాక్యము మానవులు కల్పించి వ్రాసినది కాదు. అది దైవాదేశమైన వాక్యమే. అందువలన ఆ వాక్యమును అందరూ గుర్తించవలసినదే. దేవుడు (ఆత్మ) ఏమి చెప్పినా అది సత్యమే అయివుంటుంది. దానివలన ప్రపంచములో పెద్దలకు తెలుసుయని వారు చెప్పినది వింటే ఇతరుల మాటల వలన దేవుని జ్ఞానము నీకు లభించదు. నా వలన మాత్రమే లభించునని చెప్పియున్నమాట ఎప్పటికీ ఆమోద యోగ్యమే. వాస్తవముగా దేవుని

గ్రంథములోని దేవుని వాక్యములు పెద్దలనబడు బోధకులకు ఏ మతములోనూ సరిగా తెలియబడలేదు. జ్ఞానము తెలియకున్నా తమకు తెలుసును అన్నట్లు చెప్పువారుండుట చేత వారి మాటల వలన పరలోక ఆహారమైన దైవజ్ఞానము తెలియదని ఆత్మ వాక్యము రూపములో చెప్పియుండుట వాస్తవమే. అయితే కొందరు దేవుని కృపవలన జ్ఞానము అర్థమయిన వారు కూడా కలరు. దైవజ్ఞానము అర్థమయిన వారు అరుదుగా బోధలు చెప్పుచుందురు. అటువంటి వారు చెప్పిన జ్ఞానమంతయూ సత్యసమేతముగా, శాస్త్రబద్ధముగా యున్న జ్ఞానముగా యుండును. సంపూర్ణ జ్ఞానమును తెలిసినవారు అరుదుగా యుండడమే కాక వారు అరుదుగా బోధకులై యుందురు.

ఇప్పుడు నన్ను మీరు సత్యమును చెప్పు బోధకుడిగా గుర్తించి మీరు తెలుపు జ్ఞానము సత్యమైనదే కదా! శాస్త్రబద్ధమైనదే కదా!యని అడిగారు. దానికి నేను "నేను చెప్పు బోధలు సత్యమైనవే, శాస్త్రబద్ధమైనవే" యని ఒప్పుకొంటున్నాను. మీరు చెప్పునట్లు నేను ఎంత పెద్ద జ్ఞానినయినా, భూమిమీద యున్న ప్రజలందరూ నా మాటనే సత్యమని నన్ను ఆశ్రయించినా, ఈయనే మా బోధకుడుయని మీరు నన్ను గురించి గట్టిగా చెప్పినా, దైవ గ్రంథములోని దేవుని వాక్యము ప్రకారము పరలోకమునుండి వచ్చు ఆహారమైన దైవజ్ఞానము నావలన లభించదు. వాక్యము ప్రకారము ఆత్మ వలన లభించును. ఇక్కడ బాగా లోతుగా అర్థము చేసుకోవలసియున్నది. అది ఎట్లనగా!

ప్రతి మనిషి శరీరములో జ్ఞానమును తెలియవలసిన వాడు జీవుడు. అట్లే ప్రతి శరీరములోనూ జీవునికి అన్ని విషయములు తెలియ జేయువాడు ఆత్మయే. అందువలన జ్ఞానమును తెలియజేయునది ఆత్మయని

చెప్పవచ్చును. శరీరములో జీవుడు తెలియువాడుగా యుండగా, ఆత్మ తెలియజేయునదిగా ఉండగా, పరమాత్మ సాక్షిగా (అక్షిగా) చూచువాడై యున్నాడు. ఈ విషయమును అంతిమ దైవగ్రంథములో సూరా 50, ఆయత్ 21లో చెప్పియున్నట్లు మొదటనే చెప్పుకొన్నాము. ఇదే విషయమే అనగా మూడు ఆత్మల విషయమే మిగతా రెండు దైవగ్రంథములలోనూ గలదు. శరీరములో జీవాత్మకు స్వయంశక్తి లేదు. అందువలన అన్ని కార్యములు ఆత్మ వలననే జరుగవలెను. పరమాత్మయిన మూడవ పురుషునిగా యున్న దేవుడు ఏమీ చేయక అన్నిటినీ సాక్షిగా చూస్తూ యుండును. శరీరములోనికి చెవుల ద్వారా, కన్నుల ద్వారా చేరు విషయము లను, అంతేకాక మొత్తము ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా తెలియు విషయములను ఆత్మే బుద్ధికి గ్రహించునట్లు చేయుచున్నది.

ఇప్పుడు అసలు విషయానికి వచ్చి చెప్పితే నేను సత్యమైన జ్ఞానమును చెప్పినా, నీ శరీరములో ఆత్మే కన్ను, చెవి ద్వారా నేను చెప్పిన జ్ఞానమును లోపలికి చేర్చి, లోపల బుద్ధికి అందించునది ఆత్మే. బయట ఎంత పెద్ద సత్యమును చెప్పినా అది లోపల బుద్ధి గ్రహించవలసియున్నది. శరీరము లోపల బుద్ధికి శక్తి నిచ్చి విషయమును గ్రహించునట్లు చేయువాడు ఆత్మే. ఆత్మ యిచ్చు శక్తిని బట్టి బుద్ధి విషయమును గ్రహించగలదు. అందువలన ఎవనికి ఎటువంటి జ్ఞానము తెలియాలన్నా అది ఆత్మ యిచ్చు శక్తి ద్వారా బుద్ధి తెలియగలుగుచున్నది. దీనినిబట్టి దైవజ్ఞానమును మీకు అందించువాడు ఆత్మేనని తెలియునట్లు ద్వితీయ దైవగ్రంథములోని వాక్యములో **'మీ తండ్రియే పరలోకమునుండి వచ్చు ఆహారమును మీకను గ్రహించుచున్నాడు'** అని చెప్పాడు.

ధర్మశాస్త్రములోని జ్ఞానమును అనగా పరలోక ఆహారమనబడు జ్ఞానమును ప్రజలకు మోషే తెలిపినప్పటికీ దానిని బుద్ధి నేరుగా గ్రహించ లేదు, గనుక **"మోషే మీకు పరలోక ఆహారమును మీకు ఇవ్వలేదు. మీ తండ్రియే మీకు పరలోకమునుండి వచ్చు ఆహారమును మీకందించాడు"** అని చెప్పారు. ప్రతి మనిషికి తండ్రి ఆత్మయే. తాత పరమాత్మగా యున్నాడు. జీవునికి ఆత్మ తండ్రికాగా, ఆత్మకు తండ్రిగా పరమాత్మయున్నాడు. అందువలన ఈ విషయమును అర్థము చేసుకొనుటకై ద్వితీయ దైవగ్రంథ మందు ఇలా చెప్పియున్నారు. **(యోహాన్ 14-20) "నేను నా తండ్రి యందును, మీరు నాయందును, నేను మీయందునూ ఉన్నామని ఆ దినమున మీరెరుగుదురు"** ఈ వాక్యమునకు అర్థమును పరిశీలించి చూస్తే జీవునికి ఆత్మ తండ్రికాగా, ఆత్మకు తండ్రి పరమాత్మయని తెలియడమేకాక, ఆత్మ దేవుడు ఇద్దరు కలిసియుండగా, జీవాత్మ, ఆత్మ ఇద్దరు కలిసియున్నారు. జీవాత్మకు పరమాత్మకు ఆత్మ సంధిలాంటివాడు. ఏ జీవాత్మయిన ఆత్మ ద్వారానే పరమాత్మను చేరవలసి యున్నది. అందువలన **'నేనే మార్గమును'** అని ఆత్మ ఒక సందర్భములో చెప్పడమైనది.

దేవుడు భూమిమీద వ్యాపించిన అధర్మములను లేకుండా చేసి దైవధర్మములను స్థాపింపజేయుటకు స్వయముగా మారువేషములో భూమి మీదికి సాధారణ మనిషివలె వచ్చి, తన ధర్మములను తన జ్ఞానము ద్వారా తెలియజేయును. అలా మనిషివలె వచ్చినప్పుడు బోధించు జ్ఞానము సంపూర్ణ జ్ఞానమైయుండును. దైవగ్రంథములలో జ్ఞానముండినా భగవంతుని వేషములో వచ్చిన దేవుడు గ్రంథములలో అంతవరకు అర్థముకాని విషయములను సులభముగా విశదీకరించి తెలియజేయును. అలా తెలియ జేయునప్పుడు ఎందరో మనుషులు జ్ఞానమును భగవంతుని ద్వారా

తెలియగల్గినా, అప్పటికే బోధకులుగా యున్న కొందరు పెద్దలు భగవంతుడు చెప్పు బోధలను చూచి అసూయపడి, తమలో గర్వము పొంగిపోగా, తమకంటే మించినవారు లేరని చెప్పుకొనుచుందురు. బయటికి చెప్పక పోయినా లోపల అదే భావమును కల్గియుందురు. అప్పుడు మీకుగానీ మీ పెద్దలయిన బోధకులకుగానీ తెలియని ఎన్నో విషయములను భగవంతుడు తెలియ జేయును. అంతవరకు దైవగ్రంథములలో పెద్దలయిన బోధకులచే దాచిపెట్టబడిన ఎన్నో విషయములను భగవంతుడు బయల్పరచును. అలా గ్రంథములోని సమస్త జ్ఞాన విషయములను భగవంతుని వేషములో వచ్చిన దేవుడు చెప్పగా భూమిమీద సంపూర్ణ జ్ఞానము తెలియబడును. అలా తెలియబడినప్పటికీ కొందరు తమకు తెలిసిన వ్యర్థ ప్రశ్నలకు జవాబులు లేవని జ్ఞానమును బోధించిన భగవంతున్నే తప్పుపట్టుచుందురు.

ప్రథమ దైవగ్రంథము దాదాపు ఐదు వేల (5000) సంవత్సరముల ప్పుడు తయారయినదని భగవంతుడు చెప్పాడనుకో, దానికి అసూయ పడు పెద్దలు ఆయన చెప్పినది సరికాదనీ, ప్రథమ దైవగ్రంథము భగవద్గీత తయారయి (5160) సంవత్సరములయినదనీ, ఈ విషయమును ఇంతకుముందు ఆయనే 5160 సంవత్సరములని చెప్పాడు. ఇప్పుడు 5000 సంవత్సరములని చెప్పుచున్నాడు. ఏ మాట నమ్మాలి? అట్లే ఈయన చెప్పు జ్ఞానమును ఎలా నమ్మాలి?యని తప్పును చూపి చెప్పుచుందురు. అంతిమ దైవగ్రంథములోని 6-91 ఆయత్‌లో చివరగా చెప్పినమాట **'వారిని వారి వ్యర్థ విషయములలో ఆడుకోనివ్వు'** అని ఉంది. ఇక్కడ వ్యర్థ విషయములు అనగా! ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత ఎప్పుడు తయారయినదను విషయము వ్యర్థ విషయము. ఆ గ్రంథములో ఏమి జ్ఞానమున్నదో దానిని గురించి మాట్లాడడము సారాంశమైన విషయము.

అయితే వ్యర్థ విషయములను ఆధారము చేసుకొని భగవంతున్నే తప్పు పట్టి తాము అతనికంటే గొప్పయనిపించుకోవాలన్నదే వారి ఉద్దేశ్యము. గ్రంథములోని జ్ఞాన విషయములు మనిషికి అవసరము. గ్రంథము ఎప్పుడు పుట్టినా దాని పుట్టుక ద్వారా మనిషికి ఎటువంటి ప్రయోజన ముండదు. అందువలన వ్యర్థ విషయములలో కొందరు మునిగి తేలుచూ సారాంశ విషయములను వ్యర్థములుగా, వ్యర్థములను సారాంశమైన ముఖ్య విషయములుగా తలచుచుందురు. అటువంటి వారికి దేవుడే దిగివచ్చి చెప్పినా వారు సారంశమైన జ్ఞాన విషయములను చూడక వ్యర్థమైన పనికిరాని విషయములనే పట్టుకొని ప్రశ్నించుచుందురు. అందువలన అటువంటి వారిని (6-91) వాక్యములో **"వారిని వారి వ్యర్థ విషయములలోనే ఆడుకోనివ్వు"** అని దేవుడు చెప్పడమైనది. ఆ మాటనుబట్టి అటువంటి వానికి ఎప్పటికీ జ్ఞానము తెలియదు. వాని జన్మ వ్యర్థమేయని దేవుడు చెప్పినట్లయినది. అందువలన మేము జ్ఞానులము అని గర్వపడు కొందరికి మేము చెప్పునది ఏమనగా! నీకు, నీ జన్మకు అవసరమైన జ్ఞాన విషయములను ముఖ్యముగా తీసుకో, జన్మ కర్మలతో సంబంధములేని విషయములను పట్టుకొని వ్రేలాడవద్దండి.

**ప్రశ్న :- ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతను కృష్ణుడు చెప్పాడని అర్జునుని ద్వారా తెలుసుకొన్న వ్యాసుడు గ్రంథముగా వ్రాశాడు. కృష్ణుడు అర్జునునికి యుద్ధరంగములో సమయానుకూలముగా కొద్ది నిమిషములలోనే భగవద్గీతను చెప్పాడనీ, ఆయన తన వయస్సు దాదాపు 90 సంవత్సరములు ఉన్నప్పుడు భగవద్గీతను అర్జునునికి చెప్పాడనీ, తర్వాత రెండు సంవత్సరములకు గ్రంథముగా వ్రాయబడిందనీ, వ్రాయబడిన గ్రంథము బయటి ప్రజలకు తెలియుటకు దాదాపు నాలుగు సంవత్సరములు పట్టినదనీ,**

కృష్ణుడు **96** సంవత్సరముల వయస్సులో భగవద్గీతను చెప్పాడనీ మీరు ఒక గ్రంథములో చెప్పారు. తర్వాత మరొక గ్రంథములో కృష్ణునికి **90** సంవత్సరముల వయస్సులో భగవద్గీతను చెప్పాడని చెప్పారు. రెండు గ్రంథములలో ఆరు సంవత్సరముల తేడా వచ్చిందని మీ మాటను ఎలా నమ్మాలని వ్యర్థ విషయమైన దానిని జ్ఞాన విషయము కానిదానిని అడుగగా, దానికి జవాబుగా మీరు కృష్ణుడు భగవద్గీతను చెప్పినది **90** సంవత్సరములకే అయితే అది మనుషులకు తెలిసినది **96** సంవత్సరములకయిన దానివలన అది కనిపించిన సమయమును బట్టి **96** సంవత్సరములకు కృష్ణుడు భగవద్గీతను చెప్పినట్లు వ్రాశామని వివరమిచ్చారు. అయితే ఇది వ్యర్థ విషయమని భగవద్గీతలో గల జ్ఞానము ముఖ్యమైనది గానీ, భగవద్గీత తయారయిన సమయము, నెల, సంవత్సరము ముఖ్యము కాదని కూడా చెప్పారు. అందువలననే అంతిమ దైవగ్రంథములో **6-91**లో వ్యర్థ విషయములలో ఆడుకొను వారిని అనవసర విషయములను ప్రాధాన్యముగా తీసుకొను వారిని గురించి చెప్పారని మీరే చెప్పారు.

ఇప్పుడు కొందరు కృష్ణుడు భగవద్గీతను చెప్పలేదు. కృష్ణునికి జ్ఞానమే తెలియదు. కృష్ణుడు తెలివైనవాడు, ధనమున్నవాడు అయినందున ధనమును వ్యాసునికి ఇచ్చి తాను చెప్పినట్లు భగవద్గీతను గ్రంథముగా వ్రాయించుకొన్నాడు. వ్యాసుడే భగవద్గీతను స్వయముగా వ్రాసి డబ్బు కొరకు కృష్ణుడు చెప్పినట్లు అర్జునున్ని అడ్డము పెట్టుకొని ప్రకటించాడని కొందరు వ్యక్తులు ఆరోపణ చేయుచున్నారు. వాస్తవముగా కృష్ణుడు అర్జునునకు చెప్పినది కూడా ఎవరూ వినలేదు, ఎవరూ చూడలేదు. అర్జునుడు వ్యాసుని దగ్గరకు పోయి కృష్ణుడు ఈ విధముగా చెప్పాడని

**వ్యాసునితో చెప్పినది కూడా ఎవరూ చూడలేదు. కృష్ణుడు అర్జునునకు చెప్పిన సాక్ష్యముగానీ, అర్జునుడు వ్యాసునితో చెప్పిన సాక్ష్యముగానీ లేదు. అటువంటప్పుడు కృష్ణుడే భగవద్గీత చెప్పాడని ఏమి ఆధారమని కొందరు అడుగుచున్నారు. అంతేకాక కృష్ణుని జీవితములో కృష్ణుడు భగవద్గీతను చెప్పినట్లు, దాని జ్ఞానము ప్రకారము నడుచుకొన్నట్లు ఎక్కడా కనిపించలేదు. జ్ఞానము ఆయన ప్రవర్తనలో ఎక్కడా కనిపించలేదు. ఆయన ఆచరణలో ఏ ఆరాధనగానీ, ఏ ధ్యానము గానీ చేయలేదు. నాస్తికునివలె బ్రతికిన కృష్ణుడు భగవద్గీతను చెప్పాడంటే నమ్మదగిన విషయము కాదని కొందరు హేతువాదులు, భౌతికవాదులు అంటున్నారు. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ఇది వ్యర్థ ప్రస్థావనేయని చెప్పవచ్చును. మనిషికి కావలసింది భగవద్గీత గ్రంథములోని జ్ఞానము మాత్రమేగానీ, వ్రాసిన రచయిత కాదు. వ్రాసిన రచయితది గడచిపోయిన కాలము. ప్రస్తుతము మనముందరున్నది భగవద్గీత. ముందరున్న గ్రంథమును చూడకుండా పోయిన రచయితను గురించి మాట్లాడడము వ్యర్థ ప్రలాపణ, అనవసర విషయమగును. గ్రంథకర్త వలన మనిషికి వచ్చే లాభము ఏమీ లేదు. గ్రంథములోని విషయముల వలననే మనిషికి లాభము చేకూరగలదు. కృష్ణుడు తాను భగవద్గీతను చెప్పినట్లు తెలియకూడదనే ఉద్దేశ్యముతోనే ఆ విధముగా రహస్యముగా భగవద్గీతను ఎవరూ వినకుండా, యుద్ధరంగ మధ్యలో యుద్ధము ప్రారంభముకాక ముందు కొద్ది నిమిషముల కాలములో చెప్పాడని తర్వాత కొంత కాలమునకు తెలిసింది. భగవంతుడే చెప్పాడని స్వయముగా వ్యాసుడు తన గ్రంథములో **'భగవానువాచ'** అని వ్రాశాడు. దానివలన కృష్ణుడు చెప్పాడని తెలిసింది తప్ప కృష్ణుడు చెప్పగా ఎవరూ వినలేదు, ఎవరూ చూడలేదు.

వ్యాసునిచేత వ్రాయబడిన భగవద్గీత కృష్ణుడు చెప్పాడని వ్యాసుడు వ్రాసినా, కృష్ణుని ఉద్దేశ్యములో తాను భగవద్గీత జ్ఞానమును చెప్పినట్లు తెలియకూడదనే ఉండేది. అంతేకాక తన జ్ఞానము ఐదువేల సంవత్సరముల వరకు బయటికి తెలియకూడదనేదే ఆయన ఉద్దేశ్యము. ఆయన అనుకున్నట్లే కృష్ణుడు భగవద్గీతను చెప్పినట్లు కొందరు నమ్మలేదని పై ప్రశ్నునుబట్టి తెలియుచున్నది. దీనికంతటికీ ఒక కారణము గలదు. దేవుడు మూడుమార్లు భగవంతునిగా భూమిమీద అవతరించితే, ఒక్కమారు దేవుని అవతారముగా లెక్కించబడును. దేవుని చేత ఒక్కమారు ధర్మసంస్థాపణ జరిగినట్లు లెక్కించబడును. దేవుడు మూడుమార్లు భగవంతునిగా రావలెను. అట్లే తన జ్ఞానము కూడా మూడు గ్రంథములుగా ఉండవలెనని ఆయన (దేవుని) అభిప్రాయము. దానికి కావలసిన ప్రణాళిక ప్రకారము ఇప్పటికి ఆయన బోధలు మూడు దైవగ్రంథములుగా వచ్చాయి. అయినా ఇప్పటికి ఆయన రెండుమార్లే వచ్చాడు. ఇంకొకమారు రావలసియున్నది.

ఇంతవరకు రెండుమార్లు వచ్చిన అవతారములలో ఒకటి శ్రీకృష్ణుడు. రెండు ఏసు అను పేర్లతో వచ్చాడు. మొదట కృష్ణునిగా వచ్చినప్పుడు ఆయనను దేవుని అవతారమని, ఆయన సాధారణ మనిషి కాడనీ, సామాన్య మనిషివలెనున్న భగవంతుడని ఎవరూ గుర్తించ లేకపోయారు. కృష్ణుడు భగవంతుడని తెలియనట్లు జన్మను గడిపిపోయాడు. భగవద్గీతా జ్ఞానమును చెప్పినా, దానిని ఎవరికీ తెలియకుండా రహస్యముగా చెప్పుట వలన, అర్జునునికి ఒక్కనికే చెప్పడము వలన, కృష్ణుడు భగవద్గీత చెప్పినట్లు నిరూపణ కూడా లేకుండా పోయినది. తర్వాత మూడు వేల సంవత్సరములకు ఏసువచ్చి చెప్పిన బోధలు నాలుగు సువార్తల రూపములో వచ్చాయి. రెండవ అవతరణగా వచ్చిన ఏసును ఎవరూ ఆయనను

భగవంతుడు అని అనుటకు వీలులేకుండా జీవితమును గడిపాడు. తనను భగవంతుడనుటకు వీలు లేనందున, ఏసు భగవంతునిగా ఎవరికీ తెలియ నందున మూడు సంవత్సరములు తన జ్ఞానమును బోధల రూపముతో చెప్పాడు. అట్లు చెప్పిన మాటలు నాలుగు సువార్తలుగా రూపుదిద్దుకొన్నవి. అయినా రెండవమారు తయారయిన ద్వితీయ దైవగ్రంథములో అరవై ఆరు (66) భాగములుండగా అందులో నాలుగు సువార్తలు మధ్యలో ఉండిపోయాయి. ముందు 39 భాగములుండగా వెనుక 23 భాగములుండగా మధ్యలో 4 సువార్తలున్నవి. మొత్తము 66 భాగముల బైబిలులో ముందు 39 భాగములు (పాఠములు) పాత నిబంధనగా, వెనుక 27 భాగములను క్రొత్త నిబంధనగా చెప్పుచున్నారు.

క్రొత్త నిబంధన 27 పాఠములలో మొదటి నాలుగు పాఠములు నాలుగు సువార్తలుగా యున్నవి. నాలుగు సువార్తలు ముందు కొంత, వెనుక కొంత బైబిలు ఉండగా దాదాపు బైబిలు మధ్యలో నాలుగు సువార్తలు గలవు. నాలుగు సువార్తలకు ముందున్న 39 పాఠములలో, వెనుకయున్న 23 పాఠములలో స్వయముగా ఏసు చెప్పిన బోధలు లేవు. మిగతా వారు వ్రాసిన జ్ఞానము కలదు. వెనుక ముందుయున్న అన్ని పాఠములలో కొన్ని సత్యములుండగా కొన్ని అసత్యములు కూడా యున్నవి. నాలుగు సువార్తలు కాకుండా మిగతా 62 పాఠములలో జ్ఞానము, మాయ రెండు మిశ్రమముగా యుండుట వలన ఏది జ్ఞానమో, ఏది మాయ (సాతాన్)నో తెలియని స్థితిగాయున్నది. అందువలన మా సలహా మేరకు చాలామంది నాలుగు సువార్తలనే చదువుచున్నారు. మిగతా 62 పాఠములలో కొన్ని సత్యములుగా యుండుట వలన మిగతా పాఠములను చదువు వారందరికీ **"సత్యమునే గ్రహించండి, అసత్య వాక్యములను వదలి వేయండని"** చెప్పుచుందుము.

**“సత్యాసత్య వాక్యములను గుర్తించలేని వారు కేవలము నాలుగు సువార్తలను చదివినా, అందులోని ప్రభువు జ్ఞానము వలన ముక్తి పొందవచ్చును”** అని కూడా చెప్పాము. నాలుగు సువార్తలలో అత్యున్నతమైన జ్ఞానము యోహాన్ సువార్తలో గలదని చెప్పుచున్నాము. ఈ విధముగా తయారయిన బైబిలు గ్రంథమును ద్వితీయ దైవగ్రంథమని చెప్పడమైనది. అదియే నేడు క్రైస్థవ మత గ్రంథముగా లెక్కించబడుచున్నది.

ద్వితీయ దైవగ్రంథము తయారయిన తర్వాత దాదాపు ఆరు వందల సంవత్సరములకు అనగా ఇప్పటికి 14వందల సంవత్సరముల పూర్వము అంతిమ దైవగ్రంథము తయారైనది. దైవగ్రంథములు మూడేయని చెప్పుచూ భగవద్గీత ప్రథమ దైవగ్రంథమనీ, బైబిలు ద్వితీయ దైవగ్రంథమని, ఖురాన్ గ్రంథము చివరి దైవగ్రంథమని చెప్పుటకు కారణము గలదు. మూడు గ్రంథములు ముందే దేవుడు చెప్పిన విధానము ప్రకారము తయారైనాయి. అవి తయారయిన విధానమును అనుసరించి వాటికి ప్రథమ, మధ్యమ, అంతిమ గ్రంథములని పేరు రావడము జరిగినది. అలా ఒకమారు వచ్చిన పేరును ఎవరూ తీసివేయుటకు సాధ్యము కాదు. అంతిమ దైవగ్రంథములో సూరా 42, ఆయత్ 51లో ఇలా ఉన్నది. **(42-51) “దేవుడు ప్రత్యక్షముగా ఏ మానవునితోనూ మాట్లాడడు. దేవునితో మాట్లాడడము మనిషికి సాధ్యమయ్యే పని కాదు. దేవుడు తన జ్ఞానమును వాణి ద్వారా (వహీ ద్వారా) లేక తెరవెనుక నుంచో మనిషికి చేరవేస్తాడు. లేదా తాను కోరినది తన ఆజ్ఞతో సూచించడానికి తన ప్రతినిధిని పంపుతాడు. ఆయన మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు”** ఈ వాక్యము ప్రకారము మొదట వాణి ద్వారా పుట్టిన

భగవద్గీత రాగా అది మొదటి దైవగ్రంథమయినది. తర్వాత ఇంజీలు గ్రంథము తన ప్రతినిధి ద్వారా చెప్పబడినది. అందువలన బైబిలుకు ద్వితీయ దైవగ్రంథమని పేరు వచ్చినది. దేవుడు చెప్పిన మూడు విధానములలో మొదటిది, రెండవది గడచిపోగా చివరిలో తెరచాటునుండి జ్ఞానము చెప్పబడగా అదే చివరి గ్రంథమను పేరుతో బయటికి వచ్చినది. ఈ విధముగా దేవుడు భూమిమీద చెప్పిన మూడు విధానములను బట్టి, ముందు వెనుకలనుబట్టి ప్రథమ, ద్వితీయ, అంతిమ అను పేర్లతో గ్రంథములు తయారయినవి. అలా వచ్చిన పేర్లను ఎవరూ మార్చలేరు.

**ప్రశ్న :- ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతను కృష్ణుడు చెప్పాడు కదా! కృష్ణుడు చెప్పగా అర్జునుడు విన్నాడు అనీ, అర్జునుని ద్వారా వ్యాసునికి చేర్చబడిన జ్ఞానము వ్యాసుని ద్వారా గ్రంథమయినదని విన్నాము. అలా జరిగినప్పుడు దేవుడు తన ప్రతినిధియైన కృష్ణుని ద్వారా జ్ఞానమును చెప్పించినట్లే కదా! రెండుమార్లు దేవుడు అవతరించాడనీ, ఒకమారు కృష్ణునిగా అవతరించగా, రెండవమారు ఏసుగా వచ్చాడనీ, వారు ఇద్దరు దేవుని ప్రతినిధులుగానే లెక్కించబడినారని, ఇద్దరు భగవంతునిగా వచ్చిన వారేనని చెప్పారు. అలా ఇద్దరు భగవంతులే అయినప్పుడు ఇద్దరు చెప్పిన గ్రంథములు రెండు ద్వితీయ దైవగ్రంథములుగానే లెక్కించవలెను గానీ అట్లుకాకుండా భగవంతుడైన కృష్ణుడు చెప్పిన గ్రంథమును ప్రథమ దైవగ్రంథముగా లెక్కించుట తప్పగును కదా! దేవుడు అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో (41-52లో) చెప్పినట్లు మూడు విధానములకు వరుస క్రమముగా మూడు పేర్లు పెట్టవచ్చును. అలా కాకుండా రెండవ విధానములో దేవుని ప్రతినిధిగా యున్నప్పుడు, చెప్పినప్పుడు రెండు**

**గ్రంథములు తయారయినా అవి రెండు వరుస క్రమములో ద్వితీయ గ్రంథములేయగునుగానీ, అందులో ఒకటి ప్రథమ దైవగ్రంథము ఎలా అయినదని ప్రశ్నించుచున్నాము. దీనికి మీ జవాబు ఏ విధముగా ఉంటుందో చెప్పమని కోరుచున్నాము.**

**జవాబు :-** దేవుడు తన మూడు గ్రంథములలో సంపూర్ణ జ్ఞానమును చెప్పాడు. అయితే తన జ్ఞాన గ్రంథములు మూడు విధానముల ప్రకారము వచ్చాయని, ఆ విధానముల ప్రకారము ముందు వెనుక జరిగిన దాని ప్రకారము దైవగ్రంథములకు వరుస క్రమముగా పేర్లు పెట్టబడినవని కూడా చెప్పుకొన్నాము. అయితే ఇక్కడ ప్రథమ దైవగ్రంథ విషయములో సంశయము ఏర్పడినది. దేవుడు చెప్పినది శాస్త్రబద్ధమైన విధానము, కావున ఆయన మాటకు లోటుయుండదు. ఏదయినా లోపము ఉంటే మన అవగాహనలో యుండవచ్చునుగానీ దేవుడు చెప్పిన విధానములో యుండదు. మూడవ మారు చివరగా **'తెరచాటునుంచి చెప్పడము'** అను విధానము జరిగినది. అందువలన తెరచాటునుండి చెప్పబడిన జ్ఞానము గ్రంథరూపమైనప్పుడు దానిని చివరి గ్రంథముగా చెప్పుచూ **"అంతిమ దైవగ్రంథము"** అని చెప్పాము. రెండవ విధానము ప్రకారము తన ప్రతినిధియైన ఏసు చెప్పిన జ్ఞానము గ్రంథరూపమైనప్పుడు దానిని ద్వితీయ దైవగ్రంథమని చెప్పాము. కృష్ణుడు కూడా ఏసువలె భగవంతుడయిన దానివలన కృష్ణుడు చెప్పిన భగవద్గీత కూడా ద్వితీయ దైవ గ్రంథమే కదా! ప్రథమ దైవగ్రంథమని పేరు ఎందుకు పెట్టారు? అన్నది ప్రశ్నయినది. దానికి నేను చెప్పు జవాబు ఈ విధముగా కలదు. భగవద్గీతను ద్వితీయ దైవగ్రంథమని అనకూడదు. ప్రథమ దైవగ్రంథమనియే చెప్పాలి, ఎందుకనగా!

భగవద్గీత, ఖురాన్ గ్రంథములో అల్లాహ్ (దేవుడు) చెప్పిన మూడు విధానములలో మొదటి విధానము ప్రకారమే తయారయిన దానివలన దానిని ప్రథమ దైవగ్రంథమని చెప్పుట న్యాయమైన పద్ధతి. దేవుడు చెప్పినది, చేసినది గ్రహించుకోలేని మనము తప్పుగా మాట్లాడుచుందుము గానీ, దేవుని మాటలో ఏ లోపము లేదు. అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో దేవుని బోధ విధానము, అట్లే గ్రంథముల వరుస విధానము ఉన్నట్లు చెప్పియున్నారు. దానిప్రకారము భగవద్గీత ప్రథమ దైవ గ్రంథమగును. ఆకాశవాణి చెప్పిన జ్ఞానము గ్రంథమయితే పద్ధతి ప్రకారము ప్రథమ గ్రంథముగా తయారగును. దేవుడు భగవంతుడైన కృష్ణునిగా వచ్చినా, ఆయన భగవంతుడను విషయము ఎవరికీ తెలియకుండా చేశాడు. అంతేకాక కృష్ణుడు అర్జునునకు చెప్పునప్పుడు **"ఇది సృష్ట్యాదిలో ఆకాశ వాణి సూర్యునకు చెప్పిన జ్ఞానమును నీకు చెప్పుచున్నానని"** కృష్ణుడు అర్జునునకు చెప్పాడు. కృష్ణుడు అర్జునునకు చెప్పాడు అని అంటున్నాము తప్ప కృష్ణుడు అర్జునునకు ఏమి చెప్పాడో, ఎట్లు చెప్పాడో, ఎంతసేపు చెప్పాడో తెలియని స్థితిలో యున్నాము. కృష్ణుడు తాను భగవద్గీతను చెప్పినట్లు ఎక్కడా ప్రకటించుకోలేదు. వ్యాసుడు చెప్పిన దానినిబట్టి ఆకాశ వాణి సూర్యునికి చెప్పిన బోధనే కృష్ణుడు చెప్పాడని యుండుట వలన, కృష్ణుడు భగవంతుడని తెలియకపోవడము వలన, కృష్ణుడు కూడా తాను జ్ఞానమును చెప్పు సమయములో తాను చెప్పు జ్ఞానమంతయూ ఆకాశ వాణి సృష్ట్యాదిలో సూర్యునకు చెప్పినదని చెప్పియుండుట వలన, భగవద్గీత యంతయూ ఆకాశవాణి బోధగా పరిగణింపబడుచున్నది. భగవద్గీత జ్ఞానమంతయూ ఆకాశవాణి బోధగా లెక్కించవలసినదే అయివుండుట వలన, భగవద్గీతను వరుస క్రమములో ప్రథమ దైవగ్రంథముగా చెప్పవలసి వచ్చినది.

కృష్ణుని జీవితములో తాను స్వయముగా జ్ఞానము చెప్పినట్లు ప్రవర్తించలేదు. కృష్ణుడు అర్జునునకు జ్ఞానము చెప్పినది కూడా ఎవరికీ తెలియకుండుట వలన భగవద్గీత ఆకాశవాణి లెక్కలోనికి పోయినది. అందువలన వ్యాసుడు భగవద్గీతను వ్రాసినప్పుడు జ్ఞాన యోగము అను అధ్యాయములో మొదటనే ఈ జ్ఞానమంతయూ సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా నేనే సూర్యునకు చెప్పియుంటిని అని చెప్పుట వలన, అది ప్రథమ దైవగ్రంథముగా చెప్పబడుటకు అన్ని అర్హతలు కల్గియున్నది. ద్వాపర యుగములో కృష్ణుడు అర్జునునకు చెప్పుచూ జ్ఞానయోగము మొదటి శ్లోకములోనే ఇలా అన్నాడు చూడండి.

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్ ।
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవే బ్రవీత్ ॥

భావము :- **"ఇది నాశనము లేని యోగము. దీనిని సూర్యునకు చెప్పి యుంటిని. సూర్యుడు మనువుకు చెప్పగా, మనువు వలన ఇక్ష్వాకుడు అను రాజుకు తెలియబడినది."** అని గలదు. ఈ శ్లోకములో నేనే సూర్యునకు చెప్పియుంటిని అని కృష్ణుడు చెప్పాడు. మొదట పంచభూతములలో మొదటిదయిన ఆకాశము వలన తెలిసిన జ్ఞానమును నేనే చెప్పానని కృష్ణుడు చెప్పడములో ఆధ్యాత్మిక అర్థము గలదు. ఆకాశములో కూడా ఆత్మ గలదు. ఆత్మ సర్వజీవుల శరీరములయందు గలదు. జీవులను భూతములను పేరుతో కూడా పిలువవచ్చును. భగవంతుడయిన కృష్ణుడు అన్ని శరీరములలో ఆత్మగాయున్నట్లు చెప్పుచూ, ఆ దినము ఆకాశము యొక్క ఆత్మగా కూడా ఆయనే యున్నట్లు చెప్పుచూ, ఆత్మయిన ఆయనే ఆకాశ భూతమునుండి చెప్పడము జరిగినది. అందువలన శ్లోకములో 'ఒకప్పుడు

నేనే సూర్యునికి చెప్పియుంటినని' చెప్పాడు. అలా చెప్పడము వలన ఆకాశ భూతము సూర్యునికి జ్ఞానము చెప్పినట్లయినది. అందువలన మొదట ఆకాశములో యున్న సూర్యునికి ఆకాశములోని ఆత్మ బోధించిన బోధ భగవద్గీతగా ద్వాపర యుగములో వ్రాయబడినా, అది ప్రథమ దైవగ్రంథముగా లెక్కించబడుచున్నది. కనిపించని ఆత్మజ్ఞానము తెలియని వారికి ఈ విషయము అర్థము కాదు. ఆత్మజ్ఞానము కొద్దిగా అయినా తెలిసిన వారికి కొంతవరకు అర్థము కాగలదు.

పంచ మహాభూతములలోని ఆకాశము మనుషులవలె మాట్లాడదు. ఆకాశము తన శబ్దము చేత జ్ఞానమును తెలియజేయవలసిందే! ఆకాశము తన శబ్దమయిన ఉరుముల చేత జ్ఞానమును తెల్పినది. ఆకాశము నుండి ఉరుముల శబ్దము వచ్చినా, ఆ శబ్దములో జ్ఞానమును ఇమిడ్చినది. శబ్దము చేసినది ఆకాశములోని ఆత్మయేనని తెలియవలెను. ఆకాశములోని ఆత్మ ఉరుముల రూపమున జ్ఞానమును బోధించగా, ఆ ఉరుముల శబ్దమును ఆకాశములోని సూర్యుడు గ్రహించగలిగాడు. ఆ విధముగా మొదట దైవజ్ఞానము తెలియబడినా, అది సూర్యుని వరకే పరిమితమైన దానివలన దానిని ప్రజలకు తెలుపు నిమిత్తము, మనిషిగా వచ్చిన కృష్ణునిలో నుండి ఆత్మ మొదట సూర్యునకు చెప్పిన జ్ఞానమునే చెప్పడము చేసినది. రెండవ మారు మనిషిగా వచ్చిన కృష్ణుడు చెప్పినా, అప్పుడు కూడా కృష్ణుని శరీరములోని ఆత్మయే చెప్పుట వలన, సూర్యునికి చెప్పిన జ్ఞానమునే చెప్పుచున్నానని చెప్పుట వలన, అప్పుడు క్రొత్తగా చెప్పిన జ్ఞానము కాదనీ, ముందు మేఘముల గర్జన రూపములో వచ్చిన జ్ఞానమునే తిరిగి చెప్పడమైనదని, అందువలన అది మొదటి జ్ఞానముగానే లెక్కింపబడుచున్నదని చెప్పవచ్చును. మొదటి జ్ఞానమును తెలుగు భాషలో, మనుషుల భావములో

చెప్పడము వలన అప్పటికి అది క్రొత్తగా కనిపించినా, ముందు సూర్యునకు చెప్పినదేనని మొదటనే చెప్పడము వలన, దానిని ఆకాశము చెప్పిన పాత జ్ఞానము క్రిందికే జమకట్టబడినది. తర్వాత అది గ్రంథరూపమైనా దానిని ప్రథమ దైవగ్రంథమనియే చెప్పాము. ఆకాశ ఉరుములతో మొదలయిన మొదటి జ్ఞానము మనుషులు మాట్లాడే బోధగా మారిపోయి చివరకు గ్రంథరూపమైనది. అలా తయారయిన గ్రంథము మొదట సంస్కృత భాషలోయున్నా అది మొదట సూర్యుడు వినిన జ్ఞానము, ఆకాశము ఉరుముల రూపములో చెప్పిన జ్ఞానము అయినందున దానిని ప్రథమ దైవగ్రంథమనియే చెప్పుచున్నాము.

నేను తెలుగు భాషలో వ్రాసిన గ్రంథమును ఇంగ్లాండు దేశములో ఆంగ్ల భాషలోనికి వేరొక వ్యక్తి వ్రాశాడు అనుకొనుము. అలా వ్రాయు వ్యక్తి ఇది తెలుగు భాషలోని గ్రంథము, ఈ గ్రంథమును ఫలానా వ్యక్తినయిన నేను ఆంగ్ల భాషలోనికి మార్చి వ్రాయుచున్నానని చెప్పి వ్రాశాడు అనుకొనుము. అప్పుడు అది ఇంగ్లాండు దేశములో కూడా నేను చెప్పిన గ్రంథముగానే అక్కడి ప్రజలకు పరిచయమగును. అట్లు చెప్పి వ్రాయక పోతే అక్కడి మనిషే, ఆంగ్ల భాషలో వ్రాసిన మనిషే ఆ గ్రంథమును స్వయముగా వ్రాసినట్లు లెక్కించబడును. అదే విధముగా ఆకాశము చెప్పగా సూర్యుడు వినిన జ్ఞానమును, ఆకాశ ఉరుముల శబ్దముతో కూడుకొన్న జ్ఞానమును కృష్ణుడు మనుషులు మాట్లాడు భాషలో మార్చి చెప్పినా, కృష్ణుడు చెప్పినప్పుడు ఇది మొదట సూర్యునకు చెప్పిన జ్ఞానమని చెప్పినప్పుడు, భారత దేశములో భారతీయుల భాషలో కృష్ణుడు చెప్పినా, అది మొదట సూర్యునికి చెప్పిన జ్ఞానముగానే లెక్కించబడునుగానీ, తర్వాత కృష్ణుడు చెప్పిన జ్ఞానముగా లెక్కించబడదు. అందువలన మొదట సూర్యునికి

ఆకాశ ఆత్మ చెప్పిన జ్ఞానము  కొన్ని లక్షల సంవత్సరముల తర్వాత గ్రంథరూపముగా మారినా  అది ప్రథమ దైవగ్రంథముగానే పిలువబడినది. ఉరుముల శబ్దము నుండి మనుషులు మాట్లాడు భాషలోనికి చెప్పినది భగవంతుడు అయిన దానివలన, ఆకాశములో ఆత్మగాయున్నది  భగవంతుని లోని ఆత్మే అయినందున, భగవంతుడు మనిషి అయినా అన్ని జన్మముల జ్ఞాపకములు ఆయనకుండుట వలన, ఆకాశరూపములో చెప్పిన ఆత్మ కృష్ణ ఆత్మే అయినందున,  కృతయుగము మొదటిలో చెప్పినదే  తర్వాత ద్వాపర యుగము చివరిలో సులభముగా చెప్పగలిగాడు.  కృష్ణుడు ద్వాపర యుగ చివరిలో చెప్పినా,  ఆయన భగవంతుడు అయిన దానివలన, భాష అనువాదము చేసి వ్రాసినవాడు ఫలానాయన్నట్లు,  భగవంతుడు చెప్పిన దానివలన దానిని భగవద్గీతయని ద్వాపరయుగములో పేరు పెట్టడమైనది. ప్రపంచములో దేవుడు చెప్పిన మూడు విధానములలో మొదటి విధానముగా చెప్పబడిన జ్ఞానము అయినందున  దానిని తర్వాత భగవంతుడు చెప్పినా, భవద్గీతయని పేరుపెట్టినా, దానికి ప్రత్యేకమయిన బిరుదులాంటి పేరు ప్రథమ దైవగ్రంథమని చెప్పడమే.  మొదట తయారయిన భగవద్గీతకు ప్రథమ దైవగ్రంథమను బిరుదును ఎవరూ తీసివేయలేరు.  ఎప్పటికీ శాశ్వితముగా అది ప్రథమ దైవగ్రంథముగానే ఉండును.

**ప్రశ్న :- చెరుకును పిండితే రసము వచ్చును.  ఆ రసము తీయగా ఉండుట వలన చెరుకు తీయగా ఉండునని పేరుగాంచినది.  అలాగే ప్రథమ దైవగ్రంథములో సారాంశము ఏమి గలదు?  చెరుకులో తీపి ప్రధానమైనదిగా ఉన్నట్లు  భగవద్గీతలో ఏమి ప్రధాన సారాంశముగా యున్నది?**

**జవాబు :-** ప్రపంచమునకే ఆత్మయిన వాడు మొదట ఖగోళములో సూర్య గ్రహము వినునట్లు ఆకాశమునుండి శబ్దరూపములో పెద్దపెద్ద ఉరుముల గర్జనగా వినిపించు శబ్దము చేత చెప్పబడిన విషయము తర్వాత మనుషుల భాషలోనికి కృష్ణుని చేత తర్జుమా చేయబడినది. కృష్ణుని శరీరములోని ఆత్మయే, ఆకాశములోని ఆత్మగా యుండుట వలన, ఆకాశముగా ఒకమారు, మనిషిగా ఒకమారు రెండుమార్లు ఒకే ఆత్మ చెప్పియుండుట వలన, సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే ద్వాపరయుగము చివరిలో భగవద్గీతగా చెప్పడమైనది. **ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో సారాంశ మైనది దైవశక్తియే కలదు.** దైవశక్తినే **"జ్ఞాన జ్యోతి"** అనియూ, **"జ్ఞానాగ్ని"** అనియూ చెప్పవచ్చును. మనిషి కర్మబద్ధమై అస్వతంత్రత కలిగి, స్వతంత్రముగా నడువలేకయున్నాడు. అటువంటి వాడు **"జ్ఞానశక్తి"** అను బలము చేత కర్మను జయించి స్వయముగా నడువగలడు. కర్మనుండి విడువబడిన వాడై స్వతంత్రత కల్గి స్వయముగా నడువగల శక్తి గ్రంథములో యున్నది. అందువలన మనిషి కర్మబద్ధుడు కాకుండా ఎలా నడువవలెనో, ఎట్లు నడువవలెనో తెలియజేయునది భగవద్గీత. కావున భగవద్గీతలో జ్ఞానమను జ్యోతికలదనీ, అట్లే మనిషి స్వయముగా నడువగల మార్గదర్శినిగా ప్రథమ దైవగ్రంథమున్నదని చెప్పవచ్చును. జ్ఞానము మీద ధ్యాస కలవానికే ఇది ఒక జ్యోతిగాయుండి అజ్ఞాన చీకటిలో మార్గమును కనిపింప జేయుచున్నది. అందువలన ఈ ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతను "జ్యోతి"యనియూ, "మార్గదర్శిని" యనియూ జ్ఞానులు చెప్పుచున్నారు. జ్ఞానులే కాక దైవస్వరూపమైన ప్రవక్తలందరూ కూడా అదే మాటను చెప్పుచున్నారు.

అంతిమ దైవ గ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 5, ఆయత్ 44 యందు ఇలా చెప్పారు చూడండి. **(5-44) "మేము తౌరాత్ గ్రంథమును అవతరింపజేశాము. అందులో మార్గదర్శకము, జ్యోతి ఉన్నాయి. ఈ తౌరాతు గ్రంథ ఆధారముగానే ముస్లిమ్ లైన ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు యూదుల సమస్యను పరిష్కరించేవారు."** అంతేకాక తౌరాతు గ్రంథమును గురించి మరొకచోట ఈ విధముగా చెప్పారు చూడండి. **(62-5) "తౌరాతు గ్రంథము (భగవద్గీత గ్రంథము) ప్రకారము ఆచరించాలని ఆదేశించినప్పటికీ, దానికి అనుగుణముగా ఆచరించనివారు ఎన్ని గ్రంథములను అనుసరించినా, అటువంటి వారిని ఎన్నో గ్రంథములను వీపు మీద మోయు గాడిదలాంటి వారని ఉపమానముగా చెప్పవచ్చును. దేవుని వాక్యములను ధిక్కరించిన వారి దృష్టాంతము చాలా చెడ్డది. దుర్మార్గపు జనులకు అల్లాహ్ సన్మార్గము చూపడు."** ఈ విధముగా తౌరాతు గ్రంథమును గురించి చెప్పడమైనది. తౌరాతు (భగవద్గీత) గ్రంథములో జ్ఞానజ్యోతి యున్నదనీ, అది ప్రతి మానవునికి మార్గదర్శినియని కూడా ఖురాన్ గ్రంథమందు చెప్పబడినది. భగవద్గీత (తౌరాతు) గ్రంథమును గురించి ఖురాన్ గ్రంథము సత్యమని ధృవీకరిస్తున్నది. ఇదే విషయమునే ఖురాన్ గ్రంథములో సూరా 5 ఆయత్ 48న ఇలా వ్రాశారు చూడండి. **(5-48) "మేము నీ వైపు ఈ ఖురాన్ గ్రంథాన్ని సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తనకన్నా ముందు వచ్చిన గ్రంథాలను (తౌరాత్, ఇంజీలును) సత్యమని ధృవీకరిస్తుంది. నీ వద్దకు వచ్చిన**

**సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరించకు"** అని వ్రాసియున్నారు. దీనినిబట్టి చివరి దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథము కూడా భగవద్గీతను (తౌరాతును) ధృవీకరిస్తున్నదని తెలియుచున్నది.

**ప్రశ్న :- తౌరాతు గ్రంథము మూసా ప్రవక్త ద్వారా వచ్చినదని ఖురాన్ గ్రంథములో అక్కడక్కడ చెప్పబడినది. మూసా ప్రవక్త చెప్పిన తౌరాతు గ్రంథమునే బైబిలులో 'ధర్మశాస్త్రము' అని అన్నారు. అట్లే మూసాను మోషే యని అన్నారు. మోషే ధర్మశాస్త్రము లేక మూసా తౌరాతు గ్రంథమును మీరు భగవద్గీతగా చెప్పుచున్నారు. మీరు చెప్పు తౌరాతు, భగవద్గీత రెండూ ఒక్కటేనంటారా?**

**జవాబు :-** నేను చెప్పునది వాస్తవమే. తౌరాతు గ్రంథము, భగవద్గీత గ్రంథము రెండూ ఒక్కటేయనుమాట క్రొత్తగాయుండినా, నమ్మశక్యము కాకుండాయుండినా నా మాట నూరు శాతము వాస్తవమేయని చెప్పగలను. భగవద్గీతే తౌరాతు గ్రంథమని తెలియుటకు తగిన సమాచారము మా రచనలలోని **"కృష్ణ మూస"** అను గ్రంథములో గలదు. అక్కడ ఏమి వ్రాసియుందో ఇప్పుడు చూస్తాము.

తౌరాతు గ్రంథము పడమటి దేశమయిన ఇజ్రాయేలు దేశములోనే పుట్టినదని ఖచ్చితముగా చెప్పలేముగానీ, ఇజ్రాయేలు పరిసర ప్రాంతములో పుట్టినదని చెప్పవచ్చును. తౌరాతు గ్రంథము ఏ భాషలో ఉండినదో ఇప్పటికి కూడా ఎవరికీ తెలియదు. తౌరాతు గ్రంథము భాష ఎలా తెలియదో అట్లే ఆ గ్రంథమును ఎవరు వ్రాశారో కూడా తెలియదు. అయితే కొన్ని విషయములను మాత్రము ఖచ్చితముగా చెప్పగలము. భారతదేశములో దాదాపు ఐదువేల సంవత్సరములప్పుడు భగవద్గీత గ్రంథరూపమైనది. సృష్టి

ఆదిలో దేవుడు తన ఆత్మ ద్వారా ఆకాశమునుండి చెప్పించిన జ్ఞానమును భగవంతుని ద్వారా మనుషులకు చేర్చాడు. భగవంతుడు చెప్పిన జ్ఞానము అన్నట్లు అప్పుడు చెప్పిన జ్ఞానమునకు 'భగవద్గీత' యని పేరు పెట్టి చెప్పడమైనది. భగవద్గీత గ్రంథరూపము కానప్పుడు **"జపర"** అను పేరుతోయున్న జ్ఞానమే మొట్టమొదటి దైవగ్రంథముగా మారినది. మొదట సంస్కృత భాషలో వ్రాసిన భగవద్గీతను తర్వాత ఏ భాషలో వ్రాసినా అది ప్రథమ దైవగ్రంథముగానే యుండును. భగవద్గీత వ్యాసమహర్షి ద్వారా తయారయినా భారతదేశమునకు పడమర దిశలోయున్న ఇజ్రాయేలు దేశ ప్రాంతములోనికి భగవద్గీత చేర్చబడినది. ఆ ప్రాంత భాషలోనే ఆ ప్రాంతములోనున్న వ్యక్తి దగ్గరకు భగవద్గీతను చేర్చడమైనది. అప్పటికి భారతదేశములో సంస్కృత భాషలో తప్ప ఇతర భాషలో భగవద్గీత లేదు. కృష్ణుడు భారత యుద్ధములో చెప్పిన భగవద్గీతా జ్ఞానమును కృష్ణుని వయస్సు దాదాపు 90 సంవత్సరములప్పుడు అర్జునునికి చెప్పడమైనది.

దేవుడు లేక అల్లాహ్ లేక పరమాత్మ పథకము ఎలా వుండునో ఎవరికీ తెలియదు. ఆయన ముందే నిశ్చయించుకొన్న ప్రణాళికను బట్టి అంతయూ దానంతట అదే జరుగుచుండును. కృష్ణుడు మొత్తము 126 సంవత్సరములు బ్రతుకడము జరిగినది. కృష్ణుడు చనిపోయినప్పుడు తన ఎదురుగా ఉన్న బోయవానికి జరుగబోవు కొన్ని విషయములు చెప్పి, తన రెండవ జన్మను గురించి కూడా చెప్పి చనిపోవడము జరిగినది. అలా చనిపోయిన కృష్ణుడు సాక్షాత్తు దేవుడే అయినా మానవునిగానే ప్రవర్తించాడు. చనిపోయినప్పుడు తిరిగి దేవునిగా మారిపోవలసిన ఆయన అలా మారిపోలేదు. ఇంకా కొంత కాలము మూడు ఆత్మలతోనే పని చేయాలను కొన్నాడు. తాను సృష్ట్యాదిలోని జ్ఞానమును భగవద్గీతగా భారతదేశమును

ఎన్నుకొని భారతదేశములోని ఉత్తర ప్రాంతములో చెప్పాడు. అంతవరకు దేవుని జ్ఞానమునకు నిలయముగా యుండి, ఇందూ దేశమని పేరు గాంచిన భారతదేశములో ప్రణాళికబద్ధముగా జ్ఞానమును చెప్పి, అట్లే వ్యాసుని చేత గ్రంథరూపము చేయించాడు. అయితే భారతదేశములో పుట్టిన భగవద్గీత ఐదువేల సంవత్సరముల తర్వాత ప్రకాశించులాగున ఆయన నిర్ణయము జరిగినది. అప్పటి వరకు సురక్షితముగా యుండు దేశము భారతదేశమని తెలిసి భగవద్గీతను భారతదేశములోనే చెప్పడమైనది.

భారతదేశము దైవ జ్ఞానమునకు నిలయమనీ, అట్లే అజ్ఞానమునకు కూడా నిలయమని దేవునికి బాగా తెలుసు. తెలిసి ప్రపంచ దేశములు ఎన్ని యున్నా వాటిలో కాకుండా భారతదేశములోనే భగవద్గీతను చెప్పాడు. భారతదేశములో భగవద్గీత మసిగుడ్డలో చుట్టిన మాణిక్యములాగా ఉండునని, తిరిగి తాను వచ్చినప్పుడు తన భగవద్గీతను గురించి చెప్పినా తనను ఎవరూ గుర్తించలేరను ఉద్దేశ్యముతో సృష్ట్యాది జ్ఞానమును భగవద్గీతగా భారతదేశములో వుంచి కృష్ణుడు చనిపోయాడు. కృష్ణుడు చనిపోతూ బోయవానికి చెప్పిన విషయములు చాలా రహస్యమైనవి. ఇతరులకు తెలిసినా ఎవరూ నమ్మరను ధైర్యముతోనే బోయవానికి చెప్పిపోయాడు. ఆయన పోతూ ఇజ్రాయెల్ దేశములో రాబోవు తన జన్మను గురించి తెలిపిపోవడమే కాక, దానికి తగిన ఏర్పాట్లను అప్పటినుండే ప్రారంభించినట్లు కొంత తెలియుచున్నది. కృష్ణుడు చనిపోయిన తర్వాత ఆయన మూడు ఆత్మలుగా మరికొంత కాలముండదలిచాడు అనుకొన్నాము కదా! అదే విధముగా ఇజ్రాయెల్ దేశ సమీపములోని ఒక వ్యక్తి శరీరములో ప్రవేశించి ఆ శరీరము ద్వారా తన భావములను కొన్నింటిని ప్రదర్శించాడు. ఇప్పుడు

చెప్పు మాట నమ్మశక్యముగాని మాట. ఎవరూ నమ్మరను ధైర్యముతోనే ఆత్మ సత్యమును తెల్పుచున్నదని అనుకోగలము. అలా మానవ శరీరములో చేరిన కృష్ణ పరమాత్మ తొమ్మిది సంవత్సరములు ఆ శరీరములో గడుపడము జరిగినది. తర్వాత ఆ శరీరములో 135 సంవత్సరములప్పుడు చనిపోవడ మైనది. కృష్ణుడు 135 సంవత్సరములు బ్రతికాడనీ, కృష్ణశరీరములో 126 సంవత్సరములు జీవించగా, తర్వాత తొమ్మిది సంవత్సరములు అధికముగా ఉండుట వలన కృష్ణ జన్మ మొత్తము 135 సంవత్సరములు బ్రతికినట్లయి నది. 1+2+6 = 9 అయినప్పుడు కృష్ణ భగవానుడు శరీరమును వదలగా, అదే సంఖ్య తొమ్మిది అయినప్పుడు అనగా 1+3+5 = 9 అయినప్పుడు కృష్ణుడు చేరిన రెండవ దేహమును కూడా వదలిపోవడము జరిగినది.

**ప్రశ్న :- కృష్ణుడు చనిపోయి సూక్ష్మ శరీరముతో మరియొకని శరీరములోనికి చేరడము నమ్మశక్యముగాని మాటగా యున్నది. ఆయన పూర్తి మరణమును పొందలేదా? అకాలమరణమును పొందాడా? దయ్యము ఇతర మనుషులలో చేరినట్లు చేరవలసిన అవసరము భగవంతుడయిన కృష్ణునికి ఎందుకు వచ్చినది? మాలో యున్న అనేక సంశయములకు మీరు జవాబు చెప్పాలి?**

**జవాబు :-** కృష్ణుడు సాధారణమయిన మనిషి కాదు. ఆయన ప్రత్యేకముగా వచ్చిన భగవంతుడు. భగవంతుని శరీరములో మూడు ఆత్మలు యున్నా, ఆత్మ తనపని తాను చేసినా, జీవాత్మ అయినవాడు కర్మ లేనివాడు, ప్రత్యేకమైన వాడు. అతనికి అందరివలె మరణముండదు. **'జగమెరిగిన బ్రాహ్మణునికి జంధ్యమేల'** యన్నట్లు ఆయనకు మరణములు వర్తించవు. అట్లే అందరివలె పుట్టుక కూడా వర్తించదు. తండ్రి వీర్య కణముతో సంబంధము లేకుండా పుట్టిన ఆయనకు అందరివలె **'పుట్టుక' ఎట్లు లేదో అట్లే ఆయనకు అందరి**

**వలె 'జీవుడు శరీరమును వదలి చనిపోవడము' లేదు.** ఆయన కర్మతో సంబంధము లేనివాడు. ఒక చోట చనిపోయి మరొకచోటికి పోవుటకు అతనికి కర్మలేదు. ఆయన స్వయం నిర్ణయము ప్రకారము పుట్టుక యుండును మరియు చావు వుండును. ఆయన ప్రస్థుతము భగవంతుడయినా ఆయనే మూడవ శక్తి అయిన పరమాత్మ (దేవుడు). అందువలన ఆయనను శాసించు శక్తి ఏదీ లేదు. ఆయన ధర్మసంస్థాపన కొరకు స్వయం నిర్ణయమును తీసుకొనును. భవిష్యత్తు ప్రణాళికను అనుసరించి ఆయన చేయు పనులుండును. తన రెండవ రాకను గురించి బోయవానికి కొంత సమాచారమును తెల్పిన కృష్ణుడు, అదే సమాచార నిమిత్తము ఇజ్రాయెల్ దేశ సమీపములోనున్న ఒక ప్రవక్త శరీరములోనికి ప్రవేశించాడు. అప్పటి కాలములో జ్ఞాన సమాచారమును అందించు వ్యక్తిని ప్రవక్త అనడము సహజము. అది కొంత జ్ఞానమయినా కావచ్చును లేక ఎక్కువ జ్ఞానమయినా కావచ్చును. మొత్తము మీద జ్ఞాన సమాచారమును అందించు ప్రవక్తగా యున్న వ్యక్తికి కృష్ణుని మరణ సమయమునకు అతని మరణము కూడా నిర్ణయింపబడియుండెను. అతని పేరు **"మోషే"** అని చెప్పబడుచుండెను. మోషే ప్రవక్త ఆ సమయమునకు చనిపోవునను విషయము కృష్ణునికి తప్ప ఎవరికీ తెలియదు. మోషేకు కూడా తెలియదు. మోషే సాధారణ మనిషే అయినందున తన మరణమును గురించి మోషేకు తెలియదు.

సర్వ సృష్ఠికర్తయిన అల్లాయే (దేవుడే) మోషేను ఆ ప్రాంతములో పేరుపొందిన ప్రవక్తగా చేసియుంచాడు. మోషే 54 సంవత్సరములు బ్రతికాడు. మోషే 54 సంవత్సరములు బ్రతుకునట్లు, మోషే చనిపోవు సమయమునకు కృష్ణుడు చనిపోవునట్లు ముందే నిర్ణయము జరిగినట్లు

ఎవరికీ తెలియదు. కృష్ణునికి మాత్రము అన్నీ తెలిసే జరిగినవి. ఆయన స్వయముగా దేవుడే అయివున్నందున ఆయనకు అన్నీ తెలుసు. మోషే చనిపోయిన క్షణములోనే కృష్ణుడు చనిపోయి మోషే శరీరములో ప్రవేశించు నట్లు నిర్ణయించుకున్నాడు. మోషే ప్రవక్త చనిపోవడము, కృష్ణ భగవాన్ చనిపోవడము ఒకేమారు జరిగినది. కృష్ణుడు తన శరీరములో లేకుండా పోయి మోషే శరీరములో ప్రత్యక్షమయినాడు. అలా మోషే శరీరములో చనిపోయినట్లు ఎవరూ గుర్తించలేరు. మోషే చనిపోయినా అందులో కృష్ణుడు యుండుట వలన మోషే సాధారణముగా బ్రతికేయున్నాడని అందరూ అనుకొన్నారు. కృష్ణుడు మోషేవలెనేవుండి జ్ఞానమును చెప్పుచుండుట వలన కృష్ణున్ని ఎవరూ గుర్తించలేదు, అందరూ మోషేనే మాట్లాడుచున్నాడని అనుకోవడము జరిగినది. కృష్ణుడు చనిపోయినట్లు భారతదేశములోనున్న వారికి తెలిసినా, అతను మోషేగా ఇతర దేశములో యున్నాడని మాత్రము తెలియదు.

**ప్రశ్న :- ప్రపంచములో ఎందరో ప్రవక్తలుండగా మోషే ప్రవక్త శరీరమునే కృష్ణుడు ఎందుకు ఎంచుకున్నాడు?**

**జవాబు :-** ఇది మంచి ప్రశ్నే? సమయానుకూలముగా అడుగవలసిన ప్రశ్నే. దీనికి నా జవాబు ఏమంటే కృష్ణుడు భగవద్గీతను చెప్పిన తర్వాత వ్యాస మహర్షి కృష్ణుడు చెప్పిన జ్ఞానమును గ్రంథరూపము చేయుటకు దాదాపు రెండు సంవత్సరములు పట్టినది. స్వచ్ఛమయిన కల్తీ లేని భగవద్గీత అప్పుడుండేది. వ్యాసుడు చనిపోయిన తర్వాత కొందరు స్వార్థవరులు వారి స్వార్థముతో కొన్ని శ్లోకములను కలుపడము జరిగినది. మొదట తయారయినది కలుషిత శ్లోకములు లేని భగవద్గీతగా యుండెడిది. కృష్ణుడు

90 సంవత్సరముల వయస్సులో అర్జునునకు సృష్ట్యాదిలోని జ్ఞానమును చెప్పగా, తర్వాత రెండు సంవత్సరముల కాలములో అది గ్రంథరూపముగా మారగా, దాని పేరు 'భగవద్గీత' యని చెప్పుకొన్నాము. మోషే 54 సంవత్సరములు బ్రతుకగా, కృష్ణునికి 92 సంవత్సరముల వయస్సులో భగవద్గీత తయారయినది. భగవద్గీత తయారయిన సమయానికి మోషే వయస్సు సరిగా 20 సంవత్సరములుండును. 20 సంవత్సరముల తర్వాత 34 సంవత్సరములు మోషే బ్రతికాడు. అలాగే కృష్ణుడు కూడా 92 సంవత్సరముల తర్వాత 34 సంవత్సరములే బ్రతికాడు.

మోషేకు ఇరువది (20) సంవత్సరముల వయస్సులో ఒక శుభ దినము ఏర్పడినది. అప్పటినుండి మోషే అప్పుడప్పుడు కొంత జ్ఞానమును చెప్పుచూ మంచి వక్తగా మారిపోయాడు. తర్వాత ఆయనను 'ప్రవక్త' అని అందరూ అన్నారు. 20 సంవత్సరములనుండి ఆయన జీవితములో ఒక క్రొత్త వెలుగు వచ్చినది. 92వ సంవత్సరములో కృష్ణునిలో కూడా ఒక తృప్తి ఏర్పడినది. అప్పుడు జరిగిన విశేషము ఏమి అనగా! మోషేకు 20 సంవత్సరములు గడచు కాలమున ఒక దినము ఆదివారము రాత్రి నడిరేయి గడచిన సమయములో స్వప్నము రావడము జరిగినది. ఆ స్వప్నములో కృష్ణుడు కనిపించి గ్రంథమైన తన భగవద్గీతను మోషేకు ఇవ్వడము జరిగినది. మోషే తన స్వప్నములో కృష్ణున్ని చూచినా కృష్ణుడు ఎవరో తనకు తెలియదు. అయితే స్వప్నములో కనపడిన కృష్ణుడు ఎంతో తేజస్సు కల్గియుండడమును చూచిన మోషే అతను నిజముగా దేవుడని నమ్మాడు. తేజస్సుతో కనిపించిన కృష్ణుడు మోషేకు భగవద్గీతా గ్రంథమును ఇచ్చి ఇది **"తౌరాత్"** గ్రంథమని చెప్పడమైనది. మోషే స్వప్నములో గ్రంథమును

తీసుకొని గుండెలకు హత్తుకున్నాడు. అంతే! అతని మెదడులో మెరుపు మెరిసినట్లయినది. మోషేకు ఒక్కమారుగా మెలుకువ వచ్చినది. మెలుకువ వచ్చిన తర్వాత కూడా గుండె వేగముగా కొట్టుకొనుచుండగా, తలలో ఏదో క్రొత్త అనుభూతిని పొందిన సంతోషము కల్గినది. జరిగినది ఏమిటి? అని కళ్ళు తెరచి చూడగా తన చేతులలో గ్రంథము కనిపించినది. అదియే తౌరాత్ గ్రంథము. దానిమీద అప్పటి భాషలో **'తౌరాత్'** యని ఉండడమును మోషే చూచాడు. ఆ విధముగా మోషేకు తౌరాత్ గ్రంథము లభించినది. అక్కడి తౌరాత్ గ్రంథమే ఇక్కడి భగవద్గీత.

**'తౌరాత్' యనగా మూడు చీకటి రాత్రులని అర్థము.** మూడు కనిపించని ఆత్మల యొక్క జ్ఞానముండుట వలన, మూడు ఆత్మల జ్ఞానము రహస్యమైనదయినందున, మూడు ఆత్మలనుద్దేశించి తౌరాత్‌యని భగవద్గీతకు కృష్ణుడే పేరు పెట్టాడని తెలియుచున్నది. ఇదంతా చదివే వారికి ఒక కథలాగ యున్నా, నమ్మశక్యముగానిదైయున్నా ఇది నూటికి నూరుపాళ్ళు జరిగిన సత్యము. నమ్మమని ఎవరినీ బలవంతము చేయడము లేదు. సత్యమును చెప్పక తప్పదు, కావున సమయము ఆసన్నమైనప్పుడు చెప్పక తప్పలేదు. అట్లని పైకి కనిపించు నన్ను ఈ విషయమునకు బాధ్యున్ని చేయవద్దండి. నిజముగా మీకు ఎంత తెలుసో నాకూ అంతే తెలుసు. ఇప్పుడిది మీకే కాదు నాకు కూడా క్రొత్త విషయమే. ఇలా మనకు తెలియని ఎన్నో క్రొత్త విషయములు ఆత్మకు తెలుసు. ఆత్మ అందించితేనే ఇప్పుడు మనకు తెలియుచున్నది.

తౌరాత్ గ్రంథము మోషేకు లభించినదని తెలిసినది కదా! ఇక్కడే ఇంకొక క్రొత్త రహస్యము కలదు. అదేమనగా! తౌరాత్ గ్రంథమును

మోషే తప్ప ఎవరూ చూడలేదు. తౌరాత్ గ్రంథము మోషేకు మాత్రమే కనిపించేది, ఇతరులకు కనిపించేది కాదు. ఆ విధముగా తౌరాత్ (భగవద్గీత) గ్రంథము అక్కడి మనుషులకు రహస్య గ్రంథమయినది. ఆ విషయము మోషేకు కూడా అర్థమయినది. గ్రంథములోని జ్ఞానమును రాత్రిపూట చదువుకొని పగలు ఇతరులకు చెప్పెడివాడు. చెప్పేది భగవద్గీతలోని జ్ఞానమయిన దానివలన శాస్త్రబద్ధముగా యుండెను. జ్ఞానమునకు **'గీటురాయి'**గా (సానరాయిగా) ఉండెను. తౌరాత్ జ్ఞానము వలన ఏది జ్ఞానమో ఏది అజ్ఞానమో తేల్చిచెప్పుటకు వీలయ్యేది. అందువలన తౌరాత్ గ్రంథమునకు **'గీటురాయి'** అను పేరు సార్థకమయినది. అదే గీటురాయియే మన వద్ద గల భగవద్గీత. ఆ దినములలో మోషేకు మాత్రము కనిపించి ఇతరులకు కనిపించని భగవద్గీత నేడు మనముందు జ్ఞానులకు, అజ్ఞానులకు కనిపించుచున్నది. నేడు గ్రంథము కనిపించినా అందులోని జ్ఞానము చాలా మందికి కనిపించడము లేదు. అనగా అర్థము కావడము లేదు.

మోషే చెప్పు జ్ఞానమునకు చాలా మంది ఆకర్షితులై ఆయన చెప్పు జ్ఞానమును తెలియుచుండిరి. మోషే తనకు తౌరాత్ గ్రంథము లభించినప్పటి నుండి 34 సంవత్సరములు గ్రంథములోని జ్ఞానమునే చెప్పాడు. మోషే చెప్పు జ్ఞానము తౌరాత్ గ్రంథములోనిదని ప్రజలకు తెలియదు. మోషేకు 54 సంవత్సరములు గడచిన తర్వాత మోషే శరీరములో లేకుండా పోవడమూ, అందులో స్వయముగా కృష్ణుడే ఉండడము ఇతరులెవరికీ తెలియదు. కృష్ణుడు తొమ్మిది సంవత్సరములు మోషే శరీరములో వుండి, మోషే చెప్పునట్లే నటించి రాబోయే ఏసును గురించి అతని జీవితములో జరుగు కొన్ని సంఘటనలను గురించి చెప్పడము జరిగినది. మోషే (కృష్ణుడు) చెప్పిన సంఘటనలు ఏసు జీవితములో నెరవేరినట్లు నాలుగు సువార్తలలో

తెలియుచున్నది. మోషే ఏసును గురించి చెప్పిన కొన్ని సంఘటనలను తెలుసుకొన్న యెషయా అవే సంఘటనలనే తన లేఖనములలో వ్రాశారు. మోషే తౌరాత్ గ్రంథ జ్ఞానమును చెప్పుటవలన అతను ధర్మ శాస్త్రమును చెప్పాడని అందరూ అనుకోవడము జరిగినది. మోషే స్వయముగా ధర్మ శాస్త్రమును చెప్పాడని అనుకున్నారు. మోషేకు ఒక్కనికే తెలిసిన తౌరాత్‌ను మోషే తర్వాత ఎవరూ దానిని చూడలేదు. మోషే తప్ప తౌరాత్ గ్రంథమును చూచిన రెండవ వ్యక్తి లేడనియే చెప్పవచ్చును.

కృష్ణుడు మోషే శరీరములో తొమ్మిది సంవత్సరములుండి ఏసును గురించి ముందే చెప్పడము, ఆ విషయములను తర్వాత తెలిసిన ప్రవక్తలు లేఖనములుగా వ్రాయడము జరిగినది. కృష్ణుడు 34 సంవత్సరముల ముందే భగవద్గీతను మోషేకు ఇవ్వడము వలన, అతని శరీరములోనికి వచ్చి మాట్లాడవలెనని నిర్ణయించుకొన్నాడు. మోషేలోయున్న తొమ్మిది సంవత్సరముల తర్వాత కృష్ణుడు శరీరమును వదలి మూడు ఆత్మలు ఏకమై దేవునిగా మారిపోయాడు. అదే దేవుడే మూడు వేల సంత్సరముల తర్వాత ఏసుగా రావడము జరిగినది. అయితే ఆయనను ఫలానా వాడని ఎవరూ గుర్తించలేక పోయారు. కొందరు దేవుని కుమారుడు అన్నారు. కొందరు దేవుని దూతయని అన్నారు. అంత తప్ప శరీరముతో వచ్చిన వాడే దేవుడని, ఎవరూ తెలియలేకపోయారు. ఏసు తర్వాత ఏసు చెప్పిన మాటలను బట్టి తయారయిన గ్రంథము ఇంజీలు. ఇంజీలు గ్రంథమును బైబిల్ గ్రంథమంటారు. ఇంజీలు గ్రంథము తౌరాత్ గ్రంథమును అనుసరించి తయారయినది. ఇంజీలులోని జ్ఞానము తౌరాత్‌లోని జ్ఞానమేయని చెప్పవచ్చును. ఈ విషయమును అంతిమ దైవ గ్రంథము ఖురాన్ సురా5, ఆయత్ 46లో కలదు. **(5-46) "మేము మర్యమ్ కుమారుడు**

**ఈసాను (ఏసును) పంపాము. అతను తనకు పూర్వము వచ్చిన తౌరాత్ గ్రంథమును సత్యమని ధృవీకరించేవాడు. మేము అతనికి ఇంజీలు (బైబిల్) గ్రంథాన్ని ఇచ్చాము. అందులో మార్గ దర్శకము, జ్యోతి ఉండేవి. అది తనకు ముందున్న తౌరాత్ గ్రంథమును ధృవీకరించేది. అంతేకాక అది దైవభీతి కలవారికి మార్గదర్శినిగా ఉండేది"**

భారతదేశములో పుట్టిన భగవద్గీత ఇతర దేశములో తౌరాత్‌గా చెప్పబడినది. అయితే అది మోషేకు ఒక్కనికి తప్ప అందరికీ అందని పండయినది. అందువలన తౌరాత్ గ్రంథము పేరు విన్నవారే గానీ, దానిని చూచిన వారు ఎవరూ లేరు. ఇంజీలు గ్రంథములో తౌరాత్ జ్ఞానమున్నదని ఖురాన్ గ్రంథములో వ్రాయబడి యుండటము చూచాము. అంతేకాక తౌరాత్ గ్రంథము తర్వాత వచ్చిన ఇంజీలుకే కాక ఖురాన్‌కు కూడా ఆదర్శముగా యున్నదను విషయము అంతిమదైవ గ్రంథములోనే గలదు. సూరా 5, ఆయత్ 44ను చూడండి **(5-44) "మేము తౌరాత్ గ్రంథమును అవతరింపజేశాము. అందులో మార్గదర్శకము, జ్యోతి ఉన్నాయి. తౌరాత్ గ్రంథ ఆధారముగానే ముస్లీమ్‌లయిన ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు, యూదుల సమస్యను పరిష్కరించేవారు." (5-48) "మేము నీ వైపునకు ఈ గ్రంథమును (ఖురాన్‌ను) సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తనకన్నా ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరిస్తుంది. నీవద్దకు వచ్చిన సత్యమును వీడి వారి (మనుషుల) మనోవాంఛలను అనుసరించకు." (5-68) "మీరు తౌరాత్‌ను, ఇంజీలును**

**(భగవద్గీత, బైబిల్) మీ ప్రభువు తరుపున మీ వద్దకు పంపబడిన ఖురాన్ గ్రంథమును మీ జీవితాలలో నెలకొల్పువరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే."**

'అంతిమ దైవగ్రంథము ఖురాన్' లో వ్రాసిన వాక్యములను బట్టి తర్వాత వచ్చిన రెండు దైవ గ్రంథములలో మొదటి దైవగ్రంథము యొక్క జ్ఞానమే ఉందని అర్థమగుచున్నది. అందువలన మూడు దైవ గ్రంథములను చదవనిదే ఏ ధర్మములో లేనట్లేయని కూడా చెప్పారు. తౌరాత్ గ్రంథము యొక్క పేరును మోషే కూడా బయటికి చెప్పలేదు. అది రహస్యముగా నిలిచిపోయిన గ్రంథమని చెప్పాడు. తౌరాత్ గ్రంథము మోషేకు ఇచ్చినప్పుడు గ్రంథము పేరు తౌరాత్‌యని మోషే విన్నాడు. ఆ గ్రంథము స్వప్నములో దొరికిన గ్రంథము. మోషేకు తప్ప ఇతరులకు కనిపించని గ్రంథము. 'తౌరాత్'ని గురించి మోషే ధర్మశాస్త్రమని చెప్పారు తప్ప పేరు చెప్పలేదు. అతి రహస్యమైన తౌరాత్ గ్రంథము పేరును ఖురాన్ గ్రంథము బయల్పరచినది. ఖురాన్ గ్రంథము తౌరాత్ గ్రంథము పేరును చెప్పకపోతే ఆ పేరు ప్రపంచానికి తెలిసేది కాదేమో! అయితే తౌరాత్ గ్రంథమే భగవద్గీతయని తెలియని రహస్యముగా యున్నది. సమయము ఆసన్నమయ్యే కొద్దీ తెలియని రహస్యములను ఆత్మే తెలుపవలసియున్నది.

ఈ విషయములన్నియూ బాగా గమనించిన తర్వాత తౌరాతు గ్రంథమే భగవద్గీతయనీ, భగవద్గీతే తౌరాతుయని తెలియడమైనది. అంతేకాక కృష్ణుడే మోషేయనీ లేక మూసాయనీ తెలియడమైనది. కృష్ణుడు 126 సంవత్సరములు 'కృష్ణ' అను పేరుతో యుండి, తర్వాత తొమ్మిది సంవత్సరములు 'మోషే'యను పేరుతో చెలామణి అయినట్లు కూడ తెలియు చున్నది. కృష్ణునిగా యున్నప్పుడే తన రెండవ జన్మ అయిన ఏసు జన్మకు

కావలసిన ప్రణాళికను సిద్ధము చేసుకొన్నాడని తెలియుచున్నది. రాబోయే ఏసు జన్మను గురించి మోషేగాయున్నప్పుడే చెప్పడమేకాక, ఏసు జీవితములో జరుగబోవు సంఘటనల గురించి చెప్పియున్నాడు. కృష్ణుడు మోషేగా యున్నప్పుడు తన భగవద్గీతను తౌరాత్‌గా చెప్పాడు. అలా చెప్పడమునకు కారణము చూస్తే భగవద్గీతను తాను చెప్పినట్లు తెలియకూడదనే తన అభిప్రాయమని తెలియుచున్నది. భగవద్గీతను ఆకాశము చెప్పినట్లే ఆకాశమునకు గౌరవము దక్కులాగున, ఆకాశము చెప్పినందుకు దేవుని మొదటి విధానము ప్రకారము భగవద్గీతను ప్రథమ దైవగ్రంథమనుటకు అవకాశముండునట్లు చేశాడు. కృష్ణుడు మోషేకు స్వప్నములో ఇచ్చిన భగవద్గీతకు తౌరాత్‌యని పేరుమార్చి ఇవ్వడమునకు కూడా ఎక్కువగా అదే కారణము కనిపించుచున్నది. తౌరాత్ గ్రంథము మోషేవద్ద యుండేదని కొందరికి అరుదుగా తెలుసుకానీ దానిని ఎవరూ చూడలేదు. అందువలన తాము చూడని గ్రంథమునకు ప్రజలు ధర్మశాస్త్రమనీ, మోషే ధర్మశాస్త్రమనీ చెప్పడమైనది.

**ప్రశ్న :- కృష్ణుని తర్వాత జీవితము మోషేగా ప్రజలకు కనిపించాడు. తర్వాత కృష్ణుడు మోషే శరీరమును వదలి మూడు వేల సంవత్సరములు దేవునిగా యుండిపోయాడు. దేవునిలో యున్న ఆత్మ తిరిగి మూడు వేల సంవత్సరముల తర్వాత ఏసుగా వచ్చినదని మీరు చెప్పారు. కృష్ణునిగా యున్న ఆత్మయే, ఏసుగా వచ్చినదని చెప్పుటకు ఏదయినా ఆధారము కలదాయని అడుగుచున్నాము?**

**జవాబు :-** పరమాత్మ తన ధర్మములకు ముప్పు కల్గినప్పుడు అధర్మములను అణచివేసి ధర్మములను స్థాపించుటకు అప్పుడప్పుడు భూమిమీద మనిషి

వలె అవతరించి మనుషులకు తన జ్ఞానమును గురించి చెప్పి ధర్మములను స్థాపించును. అలా వచ్చినదే కృష్ణుని జన్మ మరియు ఏసు జన్మయని చెప్పవచ్చును. కృష్ణునిగా వచ్చిన దేవుడే తిరిగి ఏసుగా వచ్చాడు. అనగా కృష్ణునిగా మొదట వచ్చిన ఆత్మయే తిరిగి ఏసుగా వచ్చినదని తెలియవలెను. దేవుడు భగవంతునిగా మానవ శరీరములోనికి వచ్చినప్పుడు కూడా దేవుడు దేవునిగానే యుంటాడు గానీ అప్పుడు దేవుని స్థానము ఖాళీకాదు. దేవుడు మనిషి ఆకృతి బొమ్మను చేసి అందులోనికి తన ఆత్మను ఊది పంపుచున్నాడు. అలా వచ్చినవాడు దేవుని ప్రతినిధియని చెప్పవచ్చును. దేవుని ప్రతినిధియైన వానినే భగవంతుడు అనీ, దేవుని అవతారము అనీ అంటున్నాము. దేవుడు మొదట కృష్ణునిగా వచ్చాడు. అదే కృష్ణుడే మోషేగా కనిపించాడు. మోషేగా కనిపించిన కృష్ణుడే తర్వాత ఏసుగా వచ్చాడు. మధ్యలోనున్న మోషేనే ఖురాన్ గ్రంథములో మూసాగా చెప్పబడ్డాడు. అలాగే బైబిలులో మోషే ఖురాన్‌లో మూసాగా చెప్పబడినట్లు, బైబిలులో ఏసుగా పిలువబడినవాడు ఖురాన్ గ్రంథములో ఈసాగా పిలువబడినాడు. అట్లే భగవద్గీతలో కృష్ణుడే ఖురాన్‌లో మూసా, బైబిలులో మోషేగా తెలియవలెను.

కలియుగములో ఏసు శరీరములో వచ్చాడు. ద్వాపర యుగము చివరిలో కృష్ణుడు, ఆయన తర్వాత జీవితములో మోషే తొమ్మిది సంవత్సరములున్నాడు. కృష్ణుడు మోషే ఇద్దరు ఒక్కటే అయితే, తర్వాత మోషే ఏసు ఇద్దరు ఒక్కటే అయినారు. అందువలన మేము ఒకచోట **'కృష్ణ మూసా, ఏసు ఈసా'** అని అన్నాము. మొదట కృష్ణునిగా వచ్చిన వాడే మోషేగా కొన్నాళ్లు, ఏసుగా కొన్నాళ్ళు యున్నాడని అర్థమగుచున్నది. కృష్ణుడు మోషేగా (మూసాగా), మోసేనే ఏసుగా (ఈసాగా) ఉన్నాడని చెప్పుటకు బైబిలులో క్రొత్త నిబంధనయందు యోహాన్ సువార్త ఐదవ

అధ్యాయమున 46, 47 వచనములలో ఇలా కలదు చూడండి. **(యోహాన్ 5-46, 47) "అతడు నన్ను గూర్చి వ్రాసెను గనుక మీరు మోషేను నమ్మినట్లయిన నన్నును నమ్ముదురు. మీరు అతని లేఖనములను నమ్మని ఎడల నా మాటలు ఎలా నమ్ముదురనెను".**

ఈ వాక్యములను బాగా పరిశీలించి చూడగలిగితే మోషే, ఏసు ఇద్దరు ఒక్కటేయని తెలియుచున్నది. ఏసు తనను మోషేతో పోల్చి చెప్పుకోవడము వలన ఏసు మోషే ఇద్దరు ఒక్కటేయని దృఢముగా అర్థమగు చున్నది. మోషే ఏసు ఇద్దరు ఒక్కటేయని తెలియుట వలన మోషేగా యున్నది కృష్ణుడే గనుక, కృష్ణుడు మోషేగా యున్నప్పుడే ఏసును గురించిన లేఖనములను వ్రాశాడు గనుక, ఏసు 'మోషే' పేరు చెప్పినా అది కృష్ణునికే వర్తించును గనుక, ఏసు కృష్ణుడు ఇద్దరు ఒక్కటేయన్నట్లు ఏసు మాటలలోనే తెలియుచున్నది. కృష్ణుడు ఏసుగా వచ్చినప్పుడు చెప్పిన బోధలు గ్రంథరూపమైనాయి. ఆ గ్రంథము దేవుడు చెప్పిన విధానములలో తన ప్రతినిధి చేత చెప్పిస్తానని చెప్పినట్లు, తన జ్ఞానమును మనిషిగాయున్న ఏసు చేత చెప్పించడము వలన, అది రెండవ విధానముగా నెరవేరిన దానివలన, బైబిలు గ్రంథమును 'ద్వితీయ దైవగ్రంథము'గా చెప్పుచున్నాము. ద్వితీయ దైవ గ్రంథములో నాలుగు సువార్తలయందు ఏసు చెప్పిన జ్ఞానముండుట వలన, నాలుగు సువార్తలనే 'ద్వితీయ దైవగ్రంథము' అని అనాలి. అరవై ఆరు పాఠములుగాయున్న బైబిలు గ్రంథములో ఏసు చెప్పినది నాలుగు సువార్తల రూపములో యుండుట వలన, కేవలము నాలుగు సువార్తలనే 'ద్వితీయ దైవగ్రంథము' అనుటకు అర్హత కల్గియున్నది. నాలుగు సువార్తలు తప్ప మిగతా 62 పాఠములను బైబిలు అనవచ్చునుగానీ ద్వితీయ

దైవగ్రంథమని అనకూడదు. బైబిలు గ్రంథములోగల 62 పాఠములకు రెండవ దైవగ్రంథమను మాట సరిపోదని చెప్పవచ్చును. దైవ ప్రతినిధియైన వాడు చెప్పినదే దైవగ్రంథమగును. మనుషులు చెప్పినది దైవగ్రంథము కాజాలదు.

కృష్ణుడు వచ్చి ఆకాశము చెప్పిన జ్ఞానమును ఆకాశ భాషనుండి మనుషుల భాషలోనికి అనువాదవము చేసి చెప్పాడు. తర్వాత ఏసుగా వచ్చి నాలుగు సువార్తల జ్ఞానమును చెప్పాడు. అది ద్వితీయ దైవగ్రంథము కాగా తర్వాత ఆరువందల సంవత్సరములకు అనగా ఇప్పటికి 1400 సంవత్సరములకు పూర్వము మనువుకు చెప్పిన సూర్యుడే, జిబ్రయేల్ అను పేరుతో పూర్వము మనువుకు చెప్పిన జ్ఞానమునే అప్పుడు కొంత, అప్పుడు కొంత ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పుచూ వచ్చాడు. 23 సంవత్సరములు సూర్యుడు (జిబ్రయేల్) ప్రవక్తగారికి బోధించగా అది చివరకు గ్రంథరూపమైనది. జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి కనిపించక తెరచాటునుండి బోధించడము వలన దేవుడు తన జ్ఞానమును మనుషులకు బోధించు మూడు విధానములలో రెండు విధానముల ప్రకారము ముందే బోధించగా, తర్వాత మిగిలిన చివరి విధానమైన తెరచాటునుండి బోధించడము వలన, అప్పుడు జిబ్రయేల్ ద్వారా చెప్పబడిన బోధల గ్రంథమును 'అంతిమ దైవగ్రంథము' లేక 'చివరి దైవగ్రంథము' అని చెప్పడమైనది. దేవుడు చెప్పిన మూడు విధానముల ప్రకారము తెలియజేయ బడిన బోధలకు మూడు దైవగ్రంథములని చెప్పడమే కాక ముందు వెనుక బోధించిన విధానమునుబట్టి వాటికి ప్రథమ, ద్వితీయ, అంతిమ దైవ గ్రంథములని పేరు వచ్చినది.

**ప్రశ్న :- మూడు దైవ గ్రంథములను మూడు విధముల బోధించడమైనది**

**కావున మూడు దైవగ్రంథములుగా చెప్పుచున్నాము. అయితే మూడు దైవ గ్రంథములలో ఒకే జ్ఞానమున్నదా? లేక కొంత తేడాతో ఏమయినా ఉన్నదా?**

**జవాబు :-** మూడు దైవగ్రంథములలో యున్నది సృష్ట్యాదిలో మొదట ఆకాశ వాణి చెప్పిన జ్ఞానమే కలదు. ఆకాశవాణి తన శబ్దమైన ఉరుముల ద్వారా చెప్పిన జ్ఞానమే మొదట భగవద్గీతగా తయారయినది. భగవద్గీతనే మిగతా గ్రంథములలో తౌరాతు గ్రంథము అంటున్నాము. తౌరాతు గ్రంథము (భగవద్గీత) లోని జ్ఞానమే ఇంజీలు (బైబిలు) గ్రంథములోనూ, ఖురాన్ గ్రంథములోనూ యున్నట్లు ఖురాన్ గ్రంథమే సాక్ష్యము చెప్పుచూ ఐదవ సూరాలో 44, 46, 48, 68 ఆయత్‌లలో వ్రాయడమైనది. అందువలన మూడు గ్రంథములలో ఒకే జ్ఞానమున్నదని చెప్పవచ్చును.

**ప్రశ్న :- ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతను 'తౌరాతు' అను పేరుతో మూసాకు (మోషేకు) ఇవ్వడము జరిగినది. అయితే మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తకు చెప్పిన బోధలో సూరా 2, ఆయత్ 53లో ఇలా చెప్పాడు (2-53) "జ్ఞాపకము చేసుకోండి. మీరు సన్మార్గులవ్వు తారని మేము మూసాకు గ్రంథాన్ని మరియు సత్యాసత్యములను వేరుచేసే గీటురాయిని ప్రసాదించాము." అంతేకాక మరొకచోట సూరా 25, ఆయత్ 1 లో ఇలా చెప్పాడు. (25-1) "సర్వలోకాలకు హెచ్చరిక చేసేదిగా ఈ గీటురాయిని తన దాసునిపై క్రమ క్రమముగా అవతరింపజేసిన ఆయన ఎంతో శుభకరుడు" అని కూడా కలదు. ఇక్కడ గీటురాయి అనబడు తౌరాతును మూసాకు ఇచ్చినది**

**వాస్తవమే అనుకొందాము. అయితే అదే గీటురాయిని అంచెలంచెలుగా ముహమ్మద్ ప్రవక్తగారికి అల్లాహ్ ఇచ్చినట్లు ముస్లీమ్‌లు చెప్పుచున్నారు. దానినిబట్టి ఖురాన్ గ్రంథమే గీటురాయి అని అర్థమగుచున్నది. అక్కడ ముసాకు ఇచ్చిన తౌరాతు గ్రంథము గీటురాయా, లేక ఇక్కడ ముహమ్మద్ ప్రవక్తగారికి ఇచ్చిన ఖురాన్ గీటురాయా అని సంశయము ఏర్పడుచున్నది. అసలు 'గీటురాయి' అంటే అర్థము ఏమి? ముసాకు ఇచ్చిన తౌరాతు, ప్రవక్తకు ఇచ్చిన ఖురాన్ రెండూ ఒకే గ్రంథములు కాకున్నా రెండిటికి గీటురాయి అని ఎందుకు అన్నారు? కొంత మాకు అర్థమయ్యే విధముగా చెప్పవలెనని కోరుచున్నాము.**

**జవాబు :-** సృష్ట్యాదిలో ఆకాశము తన వాణి ద్వారా జ్ఞానమును తెలియజేసి నది. వాణి అనగా 'శబ్దము' అని అర్థము. ఆకాశము యొక్క వాణి మాటల రూపములో ఉండదు. మనుషుల వాణి మాటల రూపములో ఉంటుంది. ఆకాశవాణి ఉరుముల రూపములో ఉంటుంది. గర్జించి ఉరిమిన ఉరుముల జ్ఞానమును ఆకాశములోనున్న పెద్ద గ్రహమైన సూర్యుడు గ్రహించాడు. సూర్యుని వలన ఇటు భూగోళముల మీద మనుషులకు, అటు ఖగోళములోని గ్రహములకు, భూతములకు జ్ఞానము తెలియబడినది. సూర్యుడు నిత్యము భూగోళమును అంతటినీ, అన్ని ప్రాంతములను, అన్ని ప్రాంతములలోని మనుషులను చూచుట వలన అన్ని ప్రాంతములలోని ప్రజలు మాట్లాడు భాషను గుర్తించి నేర్వగలిగాడు. ఎవడయినా ఆరు నెలలు ఒక ప్రాంతములో యుంటే ఆ ప్రాంత భాషను నేర్వవచ్చును. సూర్యుడు కొన్ని సంవత్సరములపాటు భూగోళములో అన్ని ప్రాంతముల మీద తన వెలుగును ప్రసరింపజేసినప్పుడు అక్కడి భాషను సులభముగా నేర్వగలిగాడు.

భూమిమీద మొదట భారతదేశములో దక్షిణ భాగమునగల శ్రీలంక ప్రాంతములో తెలుగు భాష తయారయినది. తెలుగు భాష తయారయినప్పటి నుండి భాషను మాట్లాడు వారిని ప్రతి దినము చూచి చూచి తాను తెలుగు భాషను సులభముగా నేర్వగలిగాడు. అంతకుముందు ఆకాశము తన శబ్దము ద్వారా తెలియజేసిన జ్ఞానమును గ్రహించిన సూర్యుడు తనకు తెలిసిన జ్ఞానమును భూమిమీద తెలియజేయాలని అనుకోవడము జరిగినది. అప్పుడు దక్షిణ భారతదేశములో కలిసియున్న లంకలోని మనువు అను వ్యక్తికి తనకు తెలిసిన జ్ఞానమును తెలుగు భాషలోనే చెప్పాడు. ఇక్కడ ఒక గమనిక పైకి సూర్యుడు జ్ఞానమును భూమిమీద చెప్పినా, సూర్యునికి ఆకాశము తన వాణి ద్వారా చెప్పినా, దీనికంతటికీ కారణము మరియు ఇదంతయూ ఎవరికీ తెలియకుండా చేసినవాడు ఆత్మయేనని మరువకూడదు. ఆత్మ అన్నీ చేయుచున్నా తనపాత్రను ఎక్కడా బయటపడకుండా ఉండగలదు. అదే విధముగా ఒక ప్రక్క ఆకాశములో ఆత్మగాయుండి జ్ఞానమును చెప్పినది. అట్లే మరోప్రక్క సూర్యునిలో ఉండి భూమిమీద మనువుకు జ్ఞానము చెప్పినది. సృష్ఠికర్త అయిన దేవుడు ఏమీ చేయక సాక్షిగా చూస్తుండును. అయితే ప్రపంచములో అన్ని కార్యములను చేయువాడు ఆత్మయే అని తెలియవలెను. మూడు ఆత్మలలో దేవుడు సృష్ఠికర్తగా ఉండగా, ఆత్మ కార్యకర్తగా యున్నది. జీవాత్మ జీవితములో జరుగు సుఖదుఃఖముల భోక్తగాయున్నాడు. అనగా భోగిగాయున్నాడు. భోగిగాయున్న జీవుడు యోగిగా మారుటకు దైవజ్ఞానము అవసరము. మొదట ఆకాశములోని ఆత్మ ద్వారా దేవుడు (పరమాత్మ లేక అల్లాహ్) సూర్యునికి వాణిద్వారా జ్ఞానమును అందివ్వగా, సూర్యుడు భూమిమీద ఒక మనిషి అయిన మనువునకు జ్ఞానమును అందించాడు.

ఎప్పటికీ శాశ్వితముగా దేవుడు మారువాడు కాదు. దేవుడు ఎప్పటికీ ఒక్కడే అట్లే దేవుని జ్ఞానము ఒక్కటే. కాలమునుబట్టి దేవుడుగానీ, దేవుని జ్ఞానముగానీ మారునది కాదు. అందువలన సృష్ట్యాదిలో ఆకాశమునుండి చెప్పబడిన జ్ఞానమే భూమిమీద స్థిరస్థాయిగా ఉండును. మొదట చెప్పిన జ్ఞానమే నేడు అనేక మతములుగా చీలిపోయిన ప్రజలలో, మూడు మతములలో గలదని చెప్పవచ్చును. మూడు మతముల వారిది వేరువేరు జ్ఞానమని చాలామంది అనుకొనియుండవచ్చును. ఆయా మతస్థులు కూడా 'మాది వేరు జ్ఞానము ఇతర మతస్థులది వేరు జ్ఞానము' అని అనుకొనియుండ వచ్చును. అయితే అది వారి పొరపాటేగానీ అన్ని మతములలోని జ్ఞానము ఒక్కటేయని చెప్పవచ్చును. **ప్రపంచములో దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే.** ఎన్ని యుగములు మారినా దేవుడు మారువాడు కాదు, అట్లే దేవుని జ్ఞానమూ మారునది కాదు. అయితే కాలానుగుణముగా మనిషి అనేక రంగుల దుస్తులు ధరించినట్లు, మనుషులు దేవునికి అనేక రంగులు పూచి చూపుచున్నారు. ఎన్ని రంగులు పూసినా దృశ్యముల భేదము రంగులదే గానీ, దేవునిది కాదని తెలియవలెను. సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే నేడు ముఖ్యమైన హిందూ, క్రైస్థవ, ఇస్లామ్ అను మూడు మతములలో గలదు. అయితే ఆ విషయము మనుషులు తెలియక అజ్ఞానముతో 'మా దేవుడు వేరు, మా జ్ఞానము వేరు' అని అంటున్నారు. అది పూర్తి పొరపాటని చెప్పవచ్చును.

తౌరాతు గ్రంథము అంటే భగవద్గీతయని తెలుసుకొన్నాము. భగవద్గీతయంటే మొదట ఆకాశవాణి చెప్పిన జ్ఞానమని తెలుసుకొన్నాము. దీనినిబట్టి ఆకాశము చెప్పిన ఒకే జ్ఞానమే భగవద్గీతగా తౌరాతుగా యున్నదని తెలియుచున్నది. ఇంకా వివరముగా తెలియగలిగితే సూర్యుడు ఆకాశ

వాణి జ్ఞానమును మనువుకు చెప్పాడు. అదే సూర్యుడే పేరు మార్పుతో జిబ్రయేల్‌గా వచ్చి ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పాడు. కృతయుగములో సూర్యుడు భూమిమీద జ్ఞానమును చెప్పినప్పుడు **"మ"** అను అక్షరముతో పేరున్న వ్యక్తినే ఎంచుకొని మనువుకు జ్ఞానము చెప్పాడు. అలాగే జిబ్రయేల్ అను పేరుతో కలియుగములో కూడా **"మ"** అను అక్షరముతో పేరున్న వ్యక్తిని ఎంచుకొని మహమ్మద్ (ముహమ్మద్) ప్రవక్తగారికే జ్ఞానము చెప్పాడు. చెప్పబడే జ్ఞానము ఒక్కటేయని తెలియునట్లు కృతయుగములోనూ, కలియుగములోనూ ఒకే అక్షరముగల పేరున్న వ్యక్తినే ఎన్నుకొన్నాడు. చెప్పినవాడు ఒక్కడే అయినా కలియుగములో సూర్యుడు తనను గుర్తించకుండా జిబ్రయేల్ అని పేరు పెట్టుకొన్నాడు. భగవద్గీతను చెప్పినవాడు, ఖురాన్‌ను చెప్పినవాడు ఒకే సూర్యుడేయని ఎవరికీ తెలియదు. ఇతరులకు తెలిసినా తెలియక పోయినా చెప్పినవాడు ఒక్క సూర్యుడే, చెప్పిన జ్ఞానము ఒక్కటే. **ప్రపంచ మున్నంత వరకు దేవుడు, దేవుని జ్ఞానము ఒక్కటేయుండును.** ఎప్పుడయినా అధర్మములు ఎక్కువయి ధర్మములకు ముప్పుగలిగితే, దేవుడు ప్రత్యేకముగా అవతరించి తిరిగి ధర్మసంస్థాపన చేసిపోవును. అప్పుడు కూడా తిరిగి ముందున్న ధర్మములనే తెలియజేసిపోవును. కనుక సృష్ట్యాదినుండి జ్ఞానము మారకుండా ఒకే జ్ఞానమున్నది.

**ప్రశ్న :- ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలోని జ్ఞానము, అంతిమ దైవ గ్రంథమయిన ఖురాన్‌లోని జ్ఞానము ఒక్కటేనంటారా? ఒక్కటే అయితే వేరువేరు మతాలు ఎందుకు ఏర్పడినాయి? భగవద్గీతను అనుసరించు హిందువులు, ఖురాన్ గ్రంథమును అనుసరించు ముస్లీమ్‌లు వేరు ఆచరణలు, వేరు ఆరాధనలు, వేరువేరు అలంకరణలు ఎందుకు కల్గియున్నారు? రెండు**

**మతములలోనున్న పద్ధతులనుబట్టి రెండు జ్ఞానములు ఒక్కటి కాదని తెలియుచున్నది కదా! ప్రత్యక్షముగా కనిపించే దానిని చూచి కూడా ఇద్దరిది ఒకే జ్ఞానము అనడము ఎలా కుదురుతుంది?**

**జవాబు :-** ముందు నీవు దగ్గరదగ్గర ఇదే భావమున్న ప్రశ్నను అడిగావు. దానికి నేను సమాధానము చెప్పుచున్నాను. అది ఇంకా పూర్తి కాలేదు. మధ్యలోనే అలాంటి ప్రశ్నే అడిగావు, దేనికయినా కొంచెము ఓపిక అవసరము. ఉడకబెట్టిన శెనగలు రోటిలో రుబ్బితే పూర్ణమయ్యేదానికి కనీసము అరగంటయినా పట్టుతుంది. అలాగే నీ ప్రశ్నకు జవాబు సంపూర్ణము కావాలంటే కనీసము అరగంటయినా చెప్పాలి. అందువలన నా జవాబు అయిపోవునంతవరకు ఓపికగా వినవలెనని కోరుచున్నాము. ఎప్పుడయితే నీవు అడిగిన ప్రశ్నలకు సంపూర్ణముగా జవాబు వచ్చునో అప్పుడు నా జవాబు అయిపోవునట్లు తలచవలెను.

ఒకే సూర్యుడే కృతయుగములో సూర్యునిగా, కలియుగములో జిబ్రయేల్‌గా పూర్వము మనువుకు చెప్పిన జ్ఞానమునే తిరిగి ముహమ్మద్ ప్రవక్త గారికి చెప్పడమైనది. ఒకే సూర్యుడే వేరువేరు కాలములలో, వేరువేరు మనుషులకు ఒకే జ్ఞానమునే చెప్పాడు. వేరువేరు కాలములలో, వేరు వేరు మనుషులకు, వేరువేరు పేర్లతో ఒకే సూర్యుడు, ఒకే జ్ఞానమును చెప్పియున్నా, అది మనుషుల బుద్ధికి ఒకే విధమైన గ్రాహిత శక్తి లేనందున వేరువేరు విధములుగా అర్థమయినది. అందువలన ఒకే జ్ఞానమునే వేరు వేరు తెగలుగా చెప్పుకొని వేరువేరు మతములుగా, వేరువేరు ఆచరణలుగా చెప్పుకొనుచున్నారు. మనిషి బుద్ధికి గ్రహించు శక్తి ప్రపంచ విషయములవైతే కర్మనుబట్టి యుండును. దైవిక విషయములవైతే వాని శ్రద్ధనుబట్టి యుండును. **మనిషి వేరువేరు శ్రద్ధలు కల్గియుండుట వలన, దైవ**

**విషయముల మీద ఒకే శ్రద్ధ లేనందున, మనిషికున్న శ్రద్ధ స్థాయినిబట్టి జ్ఞానము వాని బుద్ధికి అర్థమగును.** అందువలన దేవుడు ఒక్కడే అయినా, ఆయన జ్ఞానము ఒక్కటే అయినా, మనుషుల శ్రద్ధనుబట్టి మనుషుల బుద్ధికి వేరువేరు విధముల గ్రహింపు గల్గుచున్నది. ఒకే వాక్యమే అనేకమందికి అనేక విధముల అర్థమగుటకు కారణము వాని బుద్ధియొక్క శ్రద్ధా భేదమే యని తెలియవలెను. ఒకే భగవద్గీత హిందువులకు ఒక రకము, క్రైస్థవులకు మరొకరకము, ముస్లీమ్‌లకు ఇంకొక రకముగా అర్థము కాగలదు. అట్లే ఒకే గ్రంథములోని వాక్యము మతమునుబట్టి, మనుషులనుబట్టి వేరువేరు విధములుగా అర్థమగుటకు అవకాశము గలదు. ఈ వ్యత్యాసములను బయట ప్రపంచములో ప్రత్యక్షముగా చూడవచ్చును.

భగవంతుడు చెప్పినదని భగవద్గీతయని వ్యాసుడు వ్రాసిన గ్రంథమునకు పేరు పెట్టబడినది. అయితే దానిని భగవంతుడు ఆకాశ శబ్దము నుండి అనువాదము చేసి మనుషుల భాషలో చెప్పాడు. భగవంతుడు ఆకాశవాణి చెప్పిన జ్ఞానమును ఆకాశ భాషనుండి మనుషుల భాషకు అనువదించి చెప్పాడే తప్ప స్వయముగా చెప్పలేదు. అందువలన భగవద్గీత యను పేరు కృష్ణునకు ఇష్టము లేదు. మోషేకు యుక్తవయస్సు వచ్చినప్పుడు కృష్ణుడే స్వయముగా స్వప్నములో భగవద్గీతా గ్రంథమును ఇచ్చాడు. అప్పుడు గ్రంథము పేరు 'భగవద్గీత'యని చెప్పక 'తౌరాతు' అని చెప్పాడు. గ్రంథములో ముఖ్యముగా మూడు కనిపించని ఆత్మలను గురించి చెప్పియుండుట వలన మూడు చీకటి రాత్రుల పేరును భగవద్గీతకు పెట్టి "తౌరాత్" యని చెప్పడమైనది. తౌరాత్‌యనగా 'మూడు రాత్రులను' తెలుగు అర్థమేనని తెలియవలెను. ఆకాశవాణి మూడు ఆత్మల బోధను మొదట విశ్వమునందు మేఘముల గర్జన రూపముతో చెప్పియుండుట వలన, భగవద్గీతయను

పేరుకంటే తౌరాతు అను పేరే ఆ గ్రంథమునకు తగినదని కృష్ణుని అభిప్రాయము. కృష్ణుడు ప్రత్యక్షముగా కాకుండా స్వప్నములో మోషేకు ఇచ్చుట వలన అది సూక్ష్మగ్రంథమై ఇతరులకు కనిపించనిదై మోషేకు మాత్రము కనిపించునదైయుండెను. మోషేకు కళ్ళు తెరచితే ప్రపంచము కనిపించినట్లే రాత్రిపూట కళ్ళుమూసితే తౌరాతు గ్రంథము కనిపించేది. రాత్రిపూట నిద్ర పోవువరకు తౌరాతు గ్రంథమును మోషే చదివెడివాడు. తాను తౌరాతు గ్రంథములో చదివినదే బయట ప్రపంచములోని మనుషులకు చెప్పెడివాడు. అట్లు చెప్పుట వలన మోషే వలన జ్ఞానము వినిన వారంతా మోషే చెప్పిన దానిని మోషే ధర్మశాస్త్రమనెడివారు. ఈ విధముగా మోషే తప్ప ఇతరులు ఎవరూ తౌరాతు గ్రంథమును చూడలేదు. మోషేకు 54 సంవత్సరములు గడచిన తర్వాత, తొమ్మిది సంవత్సరములు మోషే శరీరములో కృష్ణుడే స్వయముగా నివశించి, తన భగవద్గీత జ్ఞానమును చెప్పడమేకాక, రాబోవు ఏసు జన్మను గురించిన సంఘటనలను గురించి చెప్పుచుండెను.

కాలము గడువగా మోషే చరిత్ర 63 సంవత్సరములకు ఆగిపోయినది. అయినా ఆయన చెప్పిన జ్ఞానము, వ్రాసిన లేఖనములు ఏసు వచ్చు వరకు ఉండేవి. తర్వాత ఏసు జీవితములో లేఖనములు నెరవేరినవి. భగవద్గీతను చెప్పిన కృష్ణుడే మోషేగా అదే జ్ఞానమును చెప్పుట వలన, తర్వాత ఏసుగా వచ్చినప్పుడు కూడా భగవద్గీతకు సంబంధమైన జ్ఞానమునే చెప్పుట వలన, భగవద్గీత, నాలుగు సువార్తల జ్ఞానము వేరని చెప్పుటకు వీలులేదు, రెండూ ఒక్కటేయని చెప్పవచ్చును. అంతేకాక కృత యుగములో మనువుకు చెప్పిన సూర్యుడు, కలియుగములో ముహమ్మద్ ప్రవక్తకు చెప్పిన జిబ్రయేల్ అనునతడు ఇద్దరు ఒక్కరే అయిన దానివలన, ప్రథమ దైవగ్రంథమయిన తౌరాతులోయున్న జ్ఞానమే అంతిమ దైవ

గ్రంథమయిన ఖురాన్‌లో గలదు. అప్పుడు చెప్పినవాడు, తర్వాత చెప్పిన వాడు ఇద్దరు ఒకే జ్ఞానమునే బోధించుట వలన, భగవద్గీత (తౌరాతు) గ్రంథములోనూ, ఖురాన్ గ్రంథములోనూ ఒకే జ్ఞానమున్నదని చెప్పవచ్చును. భగవద్గీత (తౌరాతు) గ్రంథములో శ్లోకములుంటే ఖురాన్ గ్రంథములో ఆయత్‌లను వాక్యములున్నవి. చెప్పిన వాక్యములలోనూ, వ్రాసిన భాషలోనూ తేడా యుండవచ్చునుగానీ, చెప్పిన జ్ఞానము రెండిటిలోనూ ఒక్కటే కలదు. లోతుగా చూడగలిగితే కొంత కూడా తేడా కనిపించదు.

మనుషులు మూడు గ్రంథములను అవగాహన చేసుకోవడములో అవగాహన లోపము వలన గ్రహించుకొను శక్తిలేక, వేరువేరు విధముల అర్థము చేసుకొని వేరువేరు గ్రంథములుగా, వేరువేరు మతములుగా చెప్పు కొంటున్నారు. ప్రథమ దైవగ్రంథమును చెప్పిన సూర్యుడే అంతిమ దైవగ్రంథమును చెప్పాడు. దానివలన తౌరాతు (భగవద్గీత), ఖురాన్ రెండు ఒకే జ్ఞానమని చెప్పవచ్చును. ప్రథమ దైవగ్రంథమయిన ఆకాశవాణి చెప్పిన ఉరుముల భాషను మనుషుల భాషలో అనువదించి చెప్పిన కృష్ణుడే కలియుగములో ఏసుగా వచ్చి ప్రథమ దైవగ్రంథములోని జ్ఞానమునే చెప్పి యుండుట వలన, ఏసు చెప్పిన ద్వితీయ దైవగ్రంథమయిన బైబిలులోనూ తౌరాతు (భగవద్గీత) బైబిలు గ్రంథములలో ఒకే జ్ఞానమున్నదని చెప్పవచ్చును. ఈ విధముగా మూడు గ్రంథముల పూర్వాపరాలను విశదీకరించి చూస్తే ఒక దానితో మరొకటి సంబంధపడియుండుట వలన అన్నిటియందు ఒకే జ్ఞానమున్నదని తెలియుచున్నది. మూడు గ్రంథములలో ముఖ్యముగా మూడు ఆత్మలను గురించి చెప్పిన జ్ఞానమే గలదు. అయితే 'మతము' అను అధర్మము కలియుగములో ప్రత్యేకముగా వచ్చియుండుట వలన మూడు గ్రంథముల జ్ఞానము ఒక్కటేయని తెలియకుండా పోయినది.

అంతిమ దైవగ్రంథము ఖురాన్ గ్రంథములో రెండవ సూరా 53వ ఆయత్‌నందు 25వ సూరా 1వ ఆయత్‌నందు **'గీటురాయి'** అను పదమును ఉపయోగించి గీటురాయి అయిన ఖురాన్ గ్రంథమును మీకు ఇచ్చాను అని అల్లాహ్ (దేవుడు) చెప్పియున్నట్లు గలదు. గీటురాయి అంటే ఏమిటి? అను సంశయము చాలామందిలో గలదు. అయితే సూరా రెండు ఆయత్ 53లో చెప్పినప్పుడు ఇది సత్యాసత్యములను తేల్చి చెప్పునదియని ఒకమాట చెప్పాడు. దానినిబట్టి మనిషి శరీరములోనున్న షుగర్‌ను కొలుచుటకు (చూపించుటకు) డయా మీటర్ ఉన్నట్లు, మనిషి శరీరములో వేడిని కొలుచుటకు (చూపుటకు) లేక తెలుపుటకు థర్మామీటరున్నట్లు, నీటిలోని ఉప్పు శాతమును చూపుటకు వాటర్ మీటరున్నట్లు, ఒక వాక్యములోని జ్ఞానమును కొలుచుటకు ఒక గీటురాయి అను సత్యాసత్య వివేకిని గలదు.

వాస్తవముగా బంగారు వస్తువులో బంగారు సాంద్రత ఎంతయున్నదని చూచుటకు గీటురాయిని ఉపయోగించి చూస్తారు. గీటురాయిని సానరాయి అని కూడా అంటారు. కరుకుదనముతో కూడుకొన్న నల్లని రాయిని గీటురాయి లేక సానరాయి అని అంటారు. ఒరుపురాయి అని కూడా అంటారు. ఎలా చెప్పినా ఆ రాయితో బంగారును కొద్దిగ అరగదీసి అరిగిన బంగారులో బంగారు ఎంత శాతమున్నదియని చూచి చెప్పగలరు. గీటురాయితో గీచి చూచి చెప్పగల నైపుణ్యము కంసాలి పనిచేయు వారికి మాత్రముండును. కంసాలి పని చేయువారు గీటురాయి ఆధారముతోనే బంగారును గీచి చెప్పగలరు. అలా గీయడము వలన బంగారు వస్తువులోపల దాగియున్న కాలుష్యము లేక ఇతర లోహముల కల్తీ బయటపడును. బంగారు వస్తువు లోపల దాగియున్న ఇతర లోహములను గుర్తించుటకు గీటురాయితో గీచి చూడవలసియున్నది. బంగారును ఎలా పరీక్షించగలుగు

చున్నామో  అలాగే ఒక గ్రంథములో ఎంత జ్ఞానమున్నదని తెలియుటకు గీటురాయిలాంటి శాస్త్రబద్ధత గల్గిన గ్రంథముతో చూడవచ్చును. బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి ఏ గ్రంథములో శాస్త్రీయమైన జ్ఞానముగలదో, ఏ గ్రంథములో అశాస్త్రీయమైన జ్ఞానముగలదో చెప్పవచ్చును. శాస్త్రమును **'గీటురాయి'** అంటున్నాము. గీటురాయిని గురించి వివరముగా తెలియ గలిగితే ఇలా కలదు.

భూమిమీద షట్ శాస్త్రములని ఆరు శాస్త్రములుగలవు. ఆరు శాస్త్రములు గీటురాళ్ళలాంటివే అయినా అందులో ఐదు శాస్త్రములు ప్రపంచ విషయములకు సంబంధించినవి. వాటి పేర్లు గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్య శాస్త్రములు అని అంటాము. చివరిలో ఆరవ శాస్త్రము అన్నిటికంటే పెద్ద శాస్త్రము. 'పెద్ద' అనుమాటను 'బ్రహ్మ' అని అంటాము. అందువలన ఆ శాస్త్రమును 'బ్రహ్మవిద్యా శాస్త్రము' అని చెప్పవచ్చును. పెద్ద శాస్త్రము ద్వారా ఏ గ్రంథములో ఎంత జ్ఞానమున్నదో, ఏ మాటలో ఎంత జ్ఞానమున్నదో,  ఏ వాక్యములో ఎంత జ్ఞానమున్నదో చెప్పవచ్చును. అయితే అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌ను దేవుడు 'గీటురాయి' అని చెప్పాడు, అంటే అది పెద్ద శాస్త్రము అని అర్థము. పెద్ద శాస్త్రము అనగా బ్రహ్మశాస్త్రము అని అర్థము. దానినే బ్రహ్మవిద్యాశాస్త్రమని కూడా అంటున్నాము. ఖురాన్ బ్రహ్మవిద్యా శాస్త్రము అయితే అది ఆదిలో పుట్టిన జ్ఞానమయిన ప్రథమ దైవగ్రంథములోని జ్ఞానమే అయివుండుట వలన తౌరాతు అనబడు భగవద్గీత  మొదటి బ్రహ్మశాస్త్రము. తర్వాత అదే ద్వితీయ గ్రంథముగా వచ్చినది. తర్వాత అదే జ్ఞానమే తృతీయ గ్రంథముగా వచ్చినది. తృతీయ దైవగ్రంథము గీటురాయి అయినప్పుడు  మిగతా రెండు గ్రంథములు కూడా గీటురాయిగానే ఉన్నాయని చెప్పవచ్చును. మూడు

గ్రంథముల శాస్త్రబద్ధమైన జ్ఞానముతో మనుషులు ఆచరించు భక్తి విధానములు సరియైనవో కాదో చెప్పవచ్చును. మనుషులలోయున్న జ్ఞానము సరియైనదో కాదో చెప్పుటకు గీటురాయివలెనున్న మూడు దైవగ్రంథములు పనికి వచ్చును. ఈ మూడు గ్రంథములు మూడు గీటురాళ్ళుగా, మూడు బ్రహ్మ విద్యా శాస్త్రములుగా యున్నవి. అందువలన వాటితోనే మనుషుల జ్ఞానమును, మనుషుల ఆచరణను, మనుషుల మతములను గీటురాయితో గీచి జ్ఞానమున్నదో కాదో చూచి చెప్పవచ్చును. మూడు గ్రంథములు శాస్త్రబద్ధమైన జ్ఞానమేయని చెప్పుచూ, గ్రంథములలోని జ్ఞానము అర్థము కాక అజ్ఞానముగా నడుచువారి ఆరాధనలు, ఆచారములు జ్ఞానవంతమైనవో కాదో తూకము వేసి చెప్పవచ్చును.

మనుషులు మూడు మతములలో మూడు రకముల ఆరాధనలు, ప్రార్థనలు కల్గియున్నారు. మూడు మతముల వారు చేయు ప్రార్థనలను 'గీటురాయి' అను మూడు గ్రంథములను అందులోని శాస్త్రసూత్రములను అనుసరించి అవి సక్రమమైనవో కాదో తేల్చి చెప్పవచ్చును. ముందు హిందూమతములో సాధారణ మనుషులు కాకుండా మిగతా స్వాములు, సన్న్యాసులు, పండితులు మొదలయిన వారు చేయు ఆరాధనల గురించి గీటురాయితో గీచి సానబట్టి చూస్తాము. హిందువులలో 'జ్ఞానులు' అని పేరుగాంచినవారే దేవుని ఆరాధనలు చేయుచుందురు. వారు చేయు ఆరాధనలలో యజ్ఞములు మొదటి రకము. యజ్ఞములు చేయుటకు వేదపఠనము అవసరము. యజ్ఞములు చేయుచున్నప్పుడు వేదములు చదువుచూ, సంస్కృత భాషలోని వేదమంత్రములు చెప్పుచుందురు. వాటిని దేవుడు ఖండించుచున్నాడు. భగవద్గీతయను గీటురాయిని ఉపయోగించి చూస్తే బాహ్యయజ్ఞములు ఏమాత్రము జ్ఞానము కాదని తెలియుచున్నది.

ఈ గ్రంథము మొదటిలోనే ప్రార్థన గురించి కొద్దిగా వ్రాసియున్నాము. అయితే అట్లు ఎంత వివరముగా, ఎంత సత్యముగా చెప్పినా మా మాట వినకుండా వారి అలవాటు ప్రకారము వారు చేయుచూ, వారికి తెలిసినదే సత్యమని అనుకోవడము జరుగుచున్నది. అలా వారు అనుకోవడము వలన మాకు వచ్చిన నష్టము ఏమీ లేదుగానీ, వారు దేవుని మాటకు వ్యతిరేఖముగా నడచినవారగుచున్నారు. దానివలన దేవుని మాటకు లోటు ఏర్పడుచున్నది. దేవుని గౌరవమునకు భంగము కల్గుచున్నందువలన దేవుడే ఏది నిజమైన జ్ఞానమో, ఏది నిజమైన జ్ఞానము కాదో తెలియునట్లు, జ్ఞానములో సత్యాసత్యములను తేల్చి చెప్పుటకు గీటురాయిని అందజేశాడు. అదే తన జ్ఞానములోని శాస్త్రబద్ధత, శాస్త్రబద్ధత కల్గిన తన గ్రంథము ద్వారానే సత్యాసత్యములను తెలియవచ్చును.

ఇప్పుడు మా స్వయముగా ఏమీ చెప్పక దైవగ్రంథములలోని గీటురాయిలాంటి జ్ఞానముతో జ్ఞానము యొక్క సత్యాసత్యములను తేల్చి చెప్పుచున్నాము. ప్రజలనందరినీ దేవుని భావము ప్రకారము నడుపుటకే ఇంత ప్రయత్నము చేయుచున్నాము. మతబేధము లేకుండా స్వచ్ఛమయిన జ్ఞానమును తెల్పుటే మా కర్తవ్యముగా తలచుచున్నాము. నేడు మతము అను రోగము ప్రతి మనిషికి అంటుకొనియున్నది. మతమను రోగము ఒక జాఢ్యములాగా తయారయి మనిషిలో నర నరాలలోను జీర్ణించుకు పోయినది. ఎట్లు జీర్ణించినది తెలియుటకు చిన్న ఉదాహరణగా ఒక విషయమును ప్రస్తావిస్తాము చూడండి. ఈ విషయమును గమనించితే నేడు మతము అనునది మనుషులలో ఎంత లోతుగా పాతుకొని పోయినదో అర్థము కాగలదు. నేడు మూడు మతములవారు మా గ్రంథములని చెప్పు భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములను మేము దైవగ్రంథములుగా

చెప్పుచున్నాము. మూడు దైవగ్రంథములు ఎలా తయారయినవో మాకు తెలుసు. మూడు గ్రంథములలో ఒకే జ్ఞానమున్నదనీ, అది సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానమేయనీ, తెలియుట వలన మూడు గ్రంథములను సమానముగా గౌరవించుచున్నాము. మా ఉద్దేశ్యమునకు సరిపడు విధముగా అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 5, ఆయత్ 68లో అల్లాహ్ (దేవుడు) ఈ విధముగా చెప్పియున్నాడు. **(5-68) "ఓ గ్రంథ వాహకులారా! మీరు తౌరాతును, ఇంజీలును, మీ ప్రభువు తరఫున మీ వద్దకు పంపబడిన దానిని (ఖురాన్ గ్రంథమును) మీ జీవితాలలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మము పైనా లేనట్లే"** అని యుండుట వలన మేము అందరికీ మూడు గ్రంథములను చదువమని చెప్పుచున్నాము. మూడు గ్రంథములలోనూ దేవుని విషయములే యుండుట వలన మత భేదము లేకుండా ఏ మతము వాడయినా మిగతా రెండు మతముల గ్రంథములని పేరుగాంచిన వాటిని అసూయ లేకుండా చదువమని చెప్పుచున్నాము. మేము మూడు గ్రంథములను సమానముగా గౌరవిస్తూ ఆ మాట చెప్పాము.

మాట మంచిదే కదా!యని కొందరు హిందువులు భగవద్గీతను గౌరవముగా చదివినట్లు బైబిలును కూడా చదివారు. అలాగే కొందరు క్రైస్థవులు వారి బైబిలును గౌరవించినట్లే భగవద్గీతను కూడా గౌరవించుచూ భక్తితో భగవద్గీతను చదివారు. ఇక ఇరువురూ కలిసి ఖురాన్ గ్రంథము చదువాలనుకొన్నారు. ఖురాన్ గ్రంథమును ముస్లీమ్‌లందరూ అరబ్బీ భాషలోనే చదువాలని నియమమును వారు పెట్టుకొన్న దానివలన, ఖురాన్ గ్రంథములు ఎక్కువగా అరబ్బీ భాషలోనే తయారయివుండును. అయితే

ఈ మధ్య కాలములో హిందువులు కూడా తమ ఖురాన్ గ్రంథమును చదవాలను ఉద్దేశ్యముతో ముస్లీమ్‌లు తెలుగు భాషలో ఖురాన్ గ్రంథమును తయారు చేసి ఉచితముగా ఇస్తాము అని ప్రకటనలు కూడా చేయడము జరిగినది. ఆ ప్రకటనలు చూచిన మేము "ఖురాన్ గ్రంథము మాకు అవసరము మేము చదవాలి మాకు ఇవ్వండి" అని అడిగాము. అప్పుడు వారు మొదట లేని నియమాలను (కండీషన్‌లను) చెప్పారు. అన్నిటినీ ఇక్కడ చెప్పడము అనవసర విషయమవుతుంది. వారు చెప్పిన ముఖ్యమైన మాటను ఒక దానిని చెప్పితే ఇలా కలదు. చివరిగా వచ్చిన గ్రంథమయిన ఖురాన్ గ్రంథమే అన్నింటికంటే ముఖ్యమైనది. ఇది వచ్చిన తర్వాత మిగతా గ్రంథములతో పని లేదు. అందువలన మిగతా గ్రంథములను వదలివేసి, ఖురాన్ గ్రంథమే గొప్పయని విశ్వసించిన వారికి మేము గ్రంథములు ఉచితముగా ఇస్తామని చెప్పారు. అప్పుడు మేము అలా అయితే వద్దు. మేము అన్ని మతములను, అన్ని గ్రంథములను సమానముగా చూస్తున్నాము. అట్లుకాకుండా ఒక గ్రంథమే గొప్పది. మిగతా గ్రంథములు గొప్పవికావు అని మేము చెప్పలేము. అలా చెప్పితే మత బోధలవుతుందిగానీ, జ్ఞాన బోధలు అనిపించుకోవు. మేము మూడు గ్రంథములు చదువాలని ఖురాన్ గ్రంథములో వాక్యము ప్రకారమే చెప్పాముగానీ మేము స్వయముగా చెప్పలేదు. మేము ఖురాన్ గ్రంథమునకు, అల్లా మాటకు విలువనిచ్చి అక్కడ చెప్పిన (5-68) ఆయత్ ప్రకారము చదువాలి అనుకొన్నాముగానీ, ఖురాన్ ఒక్క గ్రంథమే గొప్పది మిగతా రెండు గ్రంథములు గొప్పవి కావు అని చెప్పడము మా జ్ఞానమునకు, మా ధ్యేయమునకేగాక ఖురాన్ గ్రంథములోని (5-68) వాక్యమునకు కూడా వ్యతిరేఖమగును. అందువలన మేము మీ నియమముల ప్రకారము ఉండలేము. మాకు తప్పనిసరి

అయినప్పుడు డబ్బుపెట్టి కొని చదువుతాము, మీ ఉచిత గ్రంథము మాకు వద్దని చెప్పాము.

ఇంతకుముందు సంవత్సరము క్రితము హైదరాబాద్‌లో తిరుమలేసు అను వ్యక్తి ఉచిత ఖురాన్ కొరకు బస్సుమీద ప్రకటన చూచి అడిగితే వారు ఇస్తాము రమ్మని చెప్పి, అతను పోయిన తర్వాత మసీద్‌లో కూర్చోబెట్టి నలుగురు ముస్లీమ్‌లు ఇస్లామ్ మతమును గురించి రెండు గంటలు బోధించి, చివరకు అతనితో నమాజ్ చేయించి, ఈ దినమునుండి నీవు ముస్లీమ్ అయిపోయావని చెప్పి ప్రతి దినము ఖుర్‌ఆన్ చదువమని, నమాజ్ చేయమని చెప్పి పంపారు. అలా చేయడము వలన ఎదుటి వ్యక్తి యొక్క ఇష్టాయిష్టము తెలుసుకోకుండా మతములోనికి చేర్చడము కాదా? విలువ తెలియని మనుషులకు అల్లాహ్‌ను గురించి చెప్పడము, భక్తి విశ్వాసాలు లేనివారికి ఖురాన్ గురించి చెప్పడము అల్లా గౌరవానికి భంగము చేసినట్లు కాదా? మా లెక్కలో అన్ని మతములలోని జ్ఞానము ఒక్కటే, అన్ని మతములకు దేవుడు ఒక్కడేయని చెప్పుచుందుము. ఖురాన్ గ్రంథము దైవగ్రంథమని తెలిసి అందులోని (5-68) ఆయత్‌లోని మాట దేవుని మాటగా తలచి ఖురాన్ గ్రంథమును చదువమని, హిందువులకు భగవద్గీతను గౌరవించినట్లు ఖురాన్ గ్రంథమును గౌరవించమని చెప్పాము. అట్లే క్రైస్థవులకు వారు బైబిలును గౌరవించినట్లే ఖురాన్ గ్రంథమును గౌరవించమని చెప్పాము. అంతేగానీ అది పెద్ద, ఇది చిన్న అని మేము ఎప్పుడూ చెప్పలేదు. ఒకే మతమును, ఒకే దేవున్ని గౌరవించువారికి ఆ దేవుడొక్కడే అన్ని మతములకు పెద్దయని ఎందుకు అనుకోకూడదు? దేవుడు తన గ్రంథములలో ఎక్కడయినా మనుషులు చెప్పినట్లు చెప్పాడా? చెప్పండి. ఖురాన్ గ్రంథము తనకంటే ముందు వచ్చిన గ్రంథములను సత్యమని ధృవీకరించుచున్నదని (5-48)

వాక్యములో అల్లాహ్ చెప్పియున్నాడు. అంతేకాక ఆ వాక్యము చివరిలో **"నీవద్దకు వచ్చిన సత్యమును వీడి మనుషుల మనోవాంఛలను అను సరించకు"** యని వుంది. మూడు గ్రంథములలో సత్యమున్నదని సత్య సమేతముగా వచ్చిన ఖురాన్ గ్రంథము చెప్పుచుండగా దానికి విరుద్ధముగా, అల్లా మాటకు వ్యతిరేఖముగా మాట్లాడు వారి మాటలు వినవద్దని వాక్యము చివరిలో చెప్పియున్నారు. ఈ వాక్యములను అనుసరించి అల్లాహ్ మాటను గౌరవిస్తూ మేము మూడు గ్రంథములు సత్యసమేతముగా వచ్చినవేయని నమ్ముచున్నాము. అందువలన మూడు గ్రంథములను గీటురాయిగా తీసుకొని మూడు మతముల వారు 'మతము' అను ముసుగులో తప్పటడుగు వేయవద్దని చెప్పుచున్నాము. మనిషి మనిషిగా యుండవలెను. మతము అను రంగు పూసుకుంటే అల్లాహ్ శిక్షించేవాడుగా యుంటాడు. అల్లాహ్ (దేవుడు) 'నా బోధలు సర్వమానవాళికి హితోపదేశము' అని చెప్పాడు. ఒకమారు (81-27) వాక్యమును చూడండి. **"ఇది సమస్త లోకవాసుల కొరకు హితోపదేశము".** ఇక్కడ సర్వమానవులకు అని చెప్పాడు తప్ప ముస్లీమ్‌లకని చెప్పలేదు కదా! దేవున్ని విశ్వసించినవాడు ఏ మతములో యున్నా వాడు ముస్లీమేయగును. 'ముస్లీమ్' అనుమాటకు 'విశ్వాసము' అని అర్థము. విశ్వాసము ఎవరికుంటే వారు ఏ మతములోయున్నా వాడు విశ్వాసియేయగును. అనగా ముస్లీమేయగును. ఇదే ఖురాన్ గ్రంథములో ఆరవ సూరా, 90వ ఆయత్‌లో ఏమి చెప్పియున్నారో ఒకమారు చూడండి.

**(6-90) "ఇలాంటి వారే (దేవున్ని విశ్వసించినవారే) అల్లాహ్ మార్గదర్శకత్వమును పొందినవారు. కావున నీవు వారి మార్గాన్నే అనుసరించు. వారితో ఇలా అను "నేను దీనికి**

**బదులుగా మీనుంచి ఎలాంటి ప్రతిఫలాన్ని అడుగను. ఇది సర్వలోకాలవారి కొరకు ఒక హితోపదేశము మాత్రమే"** అని కలదు. ఇక్కడ అల్లాహ్ మాటప్రకారము దేవునికి విశ్వాసిగా ఉండమని, అలా ఉండడము వలన దేవుని మార్గదర్శకత్వము మనిషికి లభించునని చెప్పాడు. అంతేకాక **'విశ్వాసిగాయున్న వానినుండి ఏ ప్రతిఫలాన్ని అడుగను'** అని గలదు. దానిప్రకారము దేవునికి విశ్వాసిగా యుండమని చెప్పవచ్చును గానీ, నీ మతమును వీడి ఈ మతము లోనికి రమ్మని చెప్పడము ప్రతిఫలాన్ని అడిగినట్లగును కదా! అలా అడగమని దేవుడు చెప్పలేదు. ఇది ఒక మతమునకే పరిమితి కాదు. అన్ని మతముల ప్రజలకు ఖురాన్ హితోపదేశిని అని కలదు. బాగా గమనించితే ఈ వాక్యము చివరి మాటలో ఇలా కలదు. **"ఇది ఒక హితోపదేశము మాత్రమే"** అని కలదు. దీనినిబట్టి ఇది ఒక గ్రంథమేకాక మిగతా గ్రంథములు కూడా అందరి కొరకు హితోపదేశముగా ఉన్నాయనేగా అర్థము. **'సర్వ లోకవాసులకు'** అనగా 'అన్ని మతముల వారికి' అని అర్థము. 'ఒక హితోపదేశము మాత్రమే' అనగా ఇది ఒకటేగాక ఇంకా హితోపదేశములు ఉన్నాయనేగా అర్థము. ఖురాన్ గ్రంథము తనకంటే ముందు వచ్చిన గ్రంథములను సత్యమని ధృవీకరించుచున్నదని ఐదవ సూరా 48వ ఆయత్‌లో చెప్పిన మాటను మరువకూడదు.

దేవుడు 'జ్ఞానము' అను పుణాది మీద తన బోధను చెప్పితే మనుషులు ఆ మాటను కాదని మతము అను పుణాది మీద దేవుని బోధలను చూపుచున్నారు. అందువలన ఏది సత్యమో, ఏది అసత్యమో నిగ్గు తేల్చుటకు తన గ్రంథములనే శాస్త్రములను గీటురాయిగా చేసి మనకిచ్చాడు. శాస్త్రబద్ధత యను గీటురాయిగాయున్న దైవగ్రంథములను

కూడా మనుషులు మతము అను మసి పూసి ఓటురాయిగా మార్చవలెనని చూస్తున్నారు. ఎవరు ఎంత అజ్ఞానమును కలిపినా గీటురాయి గీటురాయి గానే ఉంటుంది తప్ప ఓటురాయిగా మారదు. గీటురాయితో మేము మనుషుల ఆచరణలలోనూ, మాటలలోనూ, ఆరాధనలలోనూ ఎంత అజ్ఞానమున్నదో చూపపూనినాము. గీటురాయిగా యున్న గ్రంథమును ఉచితముగా ఇస్తామని పైకి చెప్పినా లోపలి వారి ఉద్దేశ్యము మతప్రచారము తప్ప ఏమీ లేదని వారు చెప్పిన నియమములలోనే స్పష్టముగా కనిపించు చున్నది. ముస్లీమ్‌లందరూ అరబ్బీ భాషలోనే ఖురాన్‌ను చదువవలెనని చెప్పుచున్నవారు, అరబ్బీ భాషరాని ముస్లీమ్‌లను అరబ్బీ భాష నేర్చుకొని చదవమనీ, తెలుగులో చదవరాదని చెప్పుచున్నారు. నేడు భారతదేశములోని ముస్లీమ్‌లు అరబ్బీ భాష రాని కారణముగా 80 శాతము మంది ముస్లీమ్‌లు ఖురాన్ గ్రంథమును చదువలేదు. ఖురాన్ గ్రంథములో ఏమున్నదో వారికి తెలియదు. వచ్చిన ప్రాంతీయ భాషలోగానీ, తెలుగు భాషలోగానీ చదువుతా మనుకొంటే అలా చదువకూడదు, ముస్లీమ్ అయిన వాడు అరబ్బీ భాషలోనే ఖురాన్‌ను చదువవలెనను, మత నియమమును తమ మత పెద్దలు చెప్పుచుండుట వలన వారు చదువలేకపోవుచున్నారు.

తెలుగు భాష వచ్చిన ఎందరో ముస్లీమ్‌లు అరబ్బీ భాషలోనే చదువవలెనను మత నియమముతో దైవగ్రంథమునకు దూరము చేయబడి అరబ్బీ భాషలో చదువలేకయున్నారు. అయితే నేడు తెలుగు భాషలో ఎన్నో అనువాద ఖురాన్ గ్రంథములు తయారైనాయి. తెలుగు భాష వచ్చిన ఎందరో ఇస్లామ్ పండితులు ఖురాన్ గ్రంథమును తెలుగులో అనువదించి వ్రాసి గ్రంథములను తయారు చేశారు. అయినా తెలుగు గ్రంథములను ముస్లీమ్‌లు చదువకూడదు అను నియమము ప్రకారము చదవకూడదు.

అలాంటప్పుడు తెలుగు భాషలో ఖురాన్ గ్రంథమును ఎందుకు వ్రాశారు? ఎవరు చదువాలని వ్రాశారు? అలా వ్రాయడములో వారి ఉద్దేశ్యము ఏమి? అని ఆలోచించిన వారి భావము స్పష్టముగా బయటికి కనిపించుచున్నది. తెలుగు భాష వచ్చిన హిందువుల కొరకు తెలుగు ఖురాన్ గ్రంథమును తయారు చేశారు. హిందువులు ఖురాన్ గ్రంథమును చదివి తమ మతము వైపు రావాలను ఆలోచన తప్ప అందులో ప్రత్యేకించి ఏమీ లేదు. అందువలన ఖురాన్ గ్రంథము కావాలను హిందువులకు ముందు తమ మతమును గురించి చెప్పుచున్నారు. తమ మతమును స్వీకరించిన వారికే దేవుని దారి దొరుకునని చెప్పుచున్నారు. మత ప్రచారమునకు క్రైస్థవులు ఎటువంటి నియమములు లేకుండా వారి గ్రంథమని చెప్పుకొనుచున్న బైబిలును హిందువులకు ఉచితముగా ఇచ్చుచున్నారు. అదే ఉద్దేశ్యముతోనే ముస్లీమ్‌లు ఖురాన్ గ్రంథమును ఉచితముగా ఇస్తామని చెప్పినా ముందు తమ మతములోనికి చేరాలనో, తమ మతము గొప్పదనో, చివరిగా వచ్చిన ఖురాన్ తర్వాత ఏ గ్రంథము అవసరము లేదని, ఇంతవరకు చదువుచున్న మీ గ్రంథములకంటే ఖురాన్ గ్రంథమే గొప్పదని, ఇది రాకముందు భగవద్గీతకు, బైబిలుకు విలువ ఉండేదని, ఖురాన్ అంతిమ దైవగ్రంథముగా వచ్చినదనీ, అంతిమంగా వచ్చిన ఈ గ్రంథము తర్వాత ఏ గ్రంథము ముఖ్యము కాదనీ, అందువలన ఖురాన్ గ్రంథమును విశ్వసించి ఇస్లామ్ మతములో చేరమని చెప్పుచున్నారు.

ఇదంతా చూస్తే పవిత్రమైన ఖురాన్ గ్రంథము సర్వమానవాళికి అని స్వయముగా అల్లాహ్ (దేవుడే) చెప్పియుండగా, మనుషులు ఇది ముస్లీమ్‌లకే మీరు కూడా ముస్లీమ్‌లుగా మారండని చెప్పుచున్నారు. ఖురాన్‌లో దేవుని బోధలకు వ్యతిరేఖముగా మతమును ఖురాన్ గ్రంథము

చాటున ప్రచారము చేయుచున్నారు. సర్వమతములు దేవునికి సమానమే, 'ఖురాన్ సర్వమానవులకు హితబోధిని' అను మాటను మేము చెప్పుచుండగా 'కాదు ఇది ముస్లీమ్‌లకే' అన్నట్లు వారు చెప్పుచున్నారు. చివరకు మాలాంటి వారికి కూడా మతమును అంటగట్టుటకు చూస్తున్నారు. ఈ మతము అను జాఢ్యము ఒక్క ముస్లీమ్‌లలోనే కాదు, అన్ని మతములలో తక్కువ లేకుండాయున్నది. అయితే క్రైస్థవులు మతము అని చెప్పకుండా బైబిలును హిందువులకు ఇస్తున్నారు. మత ప్రచారమునకే ఇస్తున్నారని బయట పడకుండా ఓపికగా ఇస్తున్నారు. ముస్లీమ్‌లు కూడా ఖురాన్ ఉచితముగా ఇస్తామంటున్నారు. అయితే అది మత ప్రచారమునకే అన్నట్లు బయటపడు చున్నారు. క్రైస్థవులు మతప్రచారమునకే బైబిలు గ్రంథములు ఉచితముగా ఇస్తున్నా వారు తమ ఉద్దేశ్యము బయటపడకుండా జాగ్రత్తగా ఇస్తున్నారు. ముస్లీమ్‌లు క్రైస్థవులకంటే తక్కువగా గ్రంథములను ఉచితముగా ఇచ్చినా వారు ఎందుకిచ్చుచున్నది, వారి ఉద్దేశ్యమును బయటపడునట్లు మాట్లాడు చున్నారు.

దేవుని భావములో మతము అను మాటకు తావేలేదు. అందువలన ఏ మతములో పుట్టినవాడు ఆ మతములోనేయుండి మతమును మారవలెనను ఉద్దేశ్యము లేకుండా జ్ఞానము తెలియుటకు తనబోధ సర్వ మానవులకు అనీ, అన్ని మతముల వారికి ఏకముగా చెప్పాడు తప్ప, ఫలానా మతము నాకు ముఖ్యమని ఎక్కడా చెప్పలేదు. దేవుని జ్ఞానమును చూస్తే మతములు మారడము, మతములను ప్రచారము చేయడము ఏమాత్రము సరిపోదనీ, అది పూర్తి అజ్ఞానమని అర్థమగుచున్నది. అందువలన మేము మా రచనలలో **"మత మార్పిడి దైవద్రోహము మహాపాపము"** అను గ్రంథమును వ్రాశాము. దేవుడు మత ప్రసక్తి లేకుండా తన బోధలను

మనిషి అను వానికి ఉపయోగపడులాగున చెప్పాడు. అదే విధానమునే మేము అనుసరించుచూ, మూడు మతముల మీద ఏమాత్రము అసూయ లేకుండా జ్ఞానమును చెప్పుచున్నాము. అందువలన అన్ని మతముల వారు నావద్ద దైవజ్ఞానమును తెలియగల్గుచున్నారు.

దేవునికి వ్యతిరేఖమైన అధర్మములలో కృత, త్రేతా, ద్వాపర యుగముల వరకు నాలుగు అధర్మములే ఉండేవి. ఇప్పుడు కలియుగములో ఐదవ అధర్మము **'మతము'** అనునది వచ్చి చేరినది. గీటురాయితో గీచి ధర్మమను అధర్మము ఎలా మనుషులలో యున్నదో ఉదాహరణగా చెప్పుకొన్నాము. ఖురాన్ గ్రంథమును గీటురాయిగా ఉపయోగించుకొని, ఆ గ్రంథములో ఐదవ సూరా 48, 68 ఆయత్‌లను చూపుచూ మనుషులలో మతము దేవునికి ఎట్లు వ్యతిరేఖముగా యున్నదో చెప్పుకొన్నాము. దేవుడు ఆకాశవాణి ద్వారా చెప్పించిన జ్ఞానము భూమిమీద మూడు గ్రంథములుగా తయారైనది. ఆ మూడు గ్రంథములు అజ్ఞానమును, జ్ఞానమును తేల్చి చెప్పు గీటురాళ్ళుగా యున్నాయి. గీటురాయిగాయున్న అంతిమ దైవ గ్రంథము ఖురాన్‌లోని జ్ఞానము కలుషితమై 'మతము' అను గడ్డితో నిండుకొని అందులోని జ్ఞానమునకు ముప్పు ఏర్పడినప్పుడు అదే గ్రంథమును గీటురాయిగా ఉపయోగించుకొని జ్ఞానమును, అజ్ఞానమును తేల్చి చెప్పవచ్చును. ఇప్పుడు ఖురాన్ గ్రంథమును అడ్డము పెట్టుకొని దాని పేరు చెప్పుచూ, దానిలో లేని మతమును ప్రచారము చేయుచున్నారు. తాము అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ ప్రకారము, దానిలోని జ్ఞానము ప్రకారము మాట్లాడుచున్నామని చెప్పుచూ, తమ మతమును గొప్పయని చెప్పుచూ, తమదే నిజమైన జ్ఞానమని అంటున్నారు. వారు ఖురాన్ గ్రంథమును గొప్పగా చెప్పుచూనే, దాని సాకుతో మతమును ప్రవేశ

పెట్టుచున్నారు. దానికి విరుగుడుగా గీటురాయిగా ఖురాన్ గ్రంథమును నేను ఉపయోగించుకొన్నాను. అందులోని **81-27, 6-90** ఆయత్‌లను ఉపయోగించి ఖురాన్‌లో మతబోధ లేదని చెప్పాము. అట్లే 5-48 మరియు 5-68 ఆయత్‌లను ఉపయోగించుకొని "ఖురాన్ గ్రంథము మిగతా రెండు గ్రంథములు సత్యమని చెప్పుచున్నదనీ, మూడు గ్రంథములు చదవని వాడు ఏ మతములో, ఏ ధర్మములో లేనట్లేయని" చెప్పుచున్నదని తెలిపాము. ఖురాన్ గ్రంథము గీటురాయి కాగా, అందులోని **81-27, 6-90** రెండు ఆయత్‌లతోనూ మరియు **5-48, 5-68** ఆయత్‌లతోనూ గీచిచూచి వారి మాటలలోని జ్ఞానమును, అజ్ఞానమును బయటపెట్టాము. ఈ నాలుగు ఆయత్‌ల ప్రకారము వారు చెప్పిన మాటలలో మతమను అజ్ఞానమున్నదనీ, దేవుడు అను జ్ఞానము లేదనీ తేల్చివేశాము. ఈ సంఘటనతో దేవుడు చెప్పినట్లు **'ఖురాన్ గ్రంథము జ్ఞానములో సత్యాసత్యములు తెలుపు గీటురాయి'** యని తెలిసిపోయినది. ఖురాన్ గ్రంథమును తీసుకొని గొప్పగా చెప్పి దాని చాటున మతమును ప్రచారము చేయాలనుకొన్న వారిని ఖురాన్ గ్రంథమునే గీటురాయిగా ఉపయోగించి వారిలోని అజ్ఞానమును బయటకు కనిపించునట్లు చేశాము. దానివలన ఖురాన్ గ్రంథము గీటురాయిగా నిరూపణకు వచ్చినది.

నేడు భగవద్గీత లేక తౌరాత్ గ్రంథమునే **'ప్రథమ దైవగ్రంథము'** అని అంటున్నాము. ఆ గ్రంథములోని జ్ఞానమే మిగతా రెండు గ్రంథములుగా వచ్చినది. దేవుడు చెప్పిన జ్ఞానము ఒక్కటే అయినా అది మూడు గ్రంథములుగా తయారయినది. మూడు గ్రంథములను అడ్డము పెట్టుకొని మూడు మతములు తయారయినాయి. మూడు గ్రంథముల నీడలో మూడు మతములు తయారయినా, ఆ మతములు ఏ ఒక్కటిగానీ

గ్రంథముల ప్రకారము నడువలేదు. వారి మత పెద్దలు చెప్పినట్లు నడుస్తున్నాయే తప్ప గ్రంథముల జ్ఞానము ప్రకారము నడువలేదు. మూడు మతములు నేడు తమ మతములను అభివృద్ధి చేసుకొను పనులలో పడిపోయాయి గానీ జ్ఞానమును అనుసరించడము లేదు. మూడు మతములలోనున్న అజ్ఞానమును ఆయా మత గ్రంథములనే గీటురాయిగా ఉపయోగించి వారికి జ్ఞానమును, అజ్ఞానమును తేల్చి చెప్పవలసి యుంటుంది. ఒక హిందువు అజ్ఞానముగా మాట్లాడితే వాని గ్రంథమయిన భగవద్గీతను గీటురాయిగా చేసుకొని వారిలోని జ్ఞానము ఎంత, అజ్ఞానము ఎంతయని తేల్చి చెప్పవచ్చును. ఏ మతస్థునికి ఆ మత గ్రంథమునే గీటురాయిగా ఉపయోగించవలెను. హిందువులకు భగవద్గీతను గీటురాయిగా చేయవలెను గానీ, బైబిలునో, ఖురాన్ గ్రంథమునో చెప్పకూడదు. అందువలన దేవుడు మూడు మతముల అజ్ఞానమును బయటపెట్టుటకు మూడు గ్రంథములను గీటురాళ్ళుగా ఇచ్చాడు.

ఉదాహరణగా ఖురాన్ గ్రంథము నిజమైన గీటురాయిగా ఎలా ఉపయోగపడినదో, మతము అనువారు నోరు మెదపకుండా తన వాక్యములతో ఎలా కట్టివేసినదో చూచాము. అదే విధముగా ఏ మతములోని అజ్ఞానమునయినా ఆ మత గ్రంథముతోనే వారి మత గ్రంథ వాక్యములతోనే తేల్చి చెప్పవచ్చును. మూడు మత గ్రంథములు మూడు గీటురాళ్ళుగా ఉన్నాయి, కనుక ప్రతిచోట ఈ మూడు గ్రంథములతో ఆ మతములలోని అజ్ఞానమును, జ్ఞానమును బయటపెట్టవచ్చును. ఇంతవరకు మత ప్రచారము, స్వమత ప్రేమ, పరమత అసూయ అను అజ్ఞానమును తేల్చి చెప్పుకొన్నాము. అదే విధముగా మనుషులు ఆచరించు ప్రతి ఆచరణను సానబట్టి చూచి చెప్పవచ్చును. ఇప్పుడు మనుషులు చేయు ప్రార్థనలో

లేక ధ్యానములో, లేక నమాజ్‌లో ఎంత జ్ఞానమున్నది, ఎంత అజ్ఞానమున్నది తెలియుటకు మూడు మతముల వారికి మూడు గ్రంథములను ఉపయోగించి చూస్తాము. గీటురాయిని ఉపయోగించి చూచిన తర్వాత, గీటురాయిని ఉపయోగించి సత్యాసత్యములను తేల్చిన తరువాత, ఏ మతము వారికి ఆ మత గ్రంథమునే గీటురాయి చేసి, జ్ఞానాజ్ఞానములు తేల్చిన తరువాత కూడా, తమది అజ్ఞానమని తెలిసిన తర్వాత కూడా, గీటురాయిని లెక్కచేయక తమదే నిజమైన జ్ఞానమనీ, తమ ఆచరణే సరియైన ఆచరణయని చెప్పు వారిని మొండివాదులు అని చెప్పవచ్చును. అటువంటి వారికి దైవగ్రంథములు పెద్దగ కనిపించవు. తమ గురువులు, తమ పెద్దలు చెప్పిన మాటలే గొప్పగా కనిపించుచుండును. పైకి మాటలలో అన్నిటికీ దేవుడే పెద్దయని చెప్పుచూ, దేవుడు చెప్పిన మాటలను లెక్కచేయక మనుషుల మాటలను అనగా వారి పెద్దల మాటలను వినువారు దేవుడే పెద్దయని చెప్పుట భూటకము కాదా!

**ప్రశ్న :- సందర్భము వచ్చింది కావున అడుగుచున్నాను. దేవుడిచ్చిన గ్రంథమును కాదని మనుషులు వ్రాసిన గ్రంథములను గొప్పగా చెప్ప వచ్చునా? కొందరు ఒకవైపు దేవుని గ్రంథమును గొప్పగా చెప్పుచూ దానికి సమానముగా వారి పెద్దలు వ్రాసిన గ్రంథములను కూడా చదువుచూ దేవుని గ్రంథములోని విషయములను వదలి మనుషుల గ్రంథములోని విషయములనే ఆచరించుచుందురు. వారు మనుషులను దేవునితో సమానముగా చూడకూడదని చెప్పుచూ దేవుడు చెప్పిన మాటలకంటే మనుషులు చెప్పిన మాటలనే ఎక్కువగా ఆచరించుచుందురు. అలా చేయడము తప్పుకాదా! దేవుడు తన ప్రతినిధి ద్వారా, తెరచాటునుండి, ఆకాశవాణి నుండి మూడు విధముల జ్ఞానము చెప్పగా దానిని కూడా**

**హైజాక్ చేసి తమ ఆధీనములోనికి తెచ్చుకొని  వారు చెప్పినట్లు నటించు వారు కూడా కలరు.  గీటురాయిని ఉపయోగించి చూచితే వారిని ఏమనాలి?**

**జవాబు :-** ఇది ఒక మతములోనే కాకుండా ప్రతి మతములోనూ ఉన్నది. అయితే కొన్నిచోట్ల బయటికి కనిపించునట్లు కలదు.  కొన్నిచోట్ల అనగా కొన్ని మతములలో బయటికి కనిపించకుండా యున్నది.  హిందూ మతములో హిందువులకు భగవద్గీతయని చెప్పుకొన్నా అది మాటల వరకే పరిమితమై పోయినది.  భగవద్గీతను చదువకూడదని చెప్పుకొను వారు కూడా స్వచ్ఛమైన హిందువులుగా చలామణి అగుచున్నారు.  భగవద్గీతను ఇంటిలో ఉంచుకోకూడదను వారు కూడా హిందువులలో ముఖ్యులుగా యున్నారు.  భగవద్గీత హిందువుల గ్రంథమే కాదు అనువారు హిందూ మత పెద్దలుగా యున్నారు.  ఈ విధముగా హిందువులకు భగవద్గీత మూల గ్రంథమని తెలియని స్థితిలో చాలామంది కలరు.  భగవద్గీత విషయము తెలియనివారు హిందువులలో సగానికి పైగా కలరు.  ఎవడయినా భక్తివరుడు ఉన్నాడంటే  వాడు రామాయణము, భారతము చదివిన వాడుంటాడు తప్ప  భగవద్గీతను చదివినవాడు లేడు.  ఈ విధముగా దేవుడిచ్చిన దైవగ్రంథమును కాదని  ఇతర గ్రంథములనాశ్రయించు వారు గలరు.  రామాయణము నుండి అనేక గ్రంథములు, పురాణములు, వేదములు, ఉపనిషత్తులు చదువడము వలన  అసలయిన దేవున్ని వదలి దేవుడు కాని దేవతలను ఆరాధించడము మొదలుపెట్టారు.  ఈ విషయమును భగవద్గీత గ్రంథమును గీటురాయిగా చేసి చూస్తే  ఆ గ్రంథములో అనేకచోట్ల అనేకమార్లు అన్యదేవతారాధన తగదని చెప్పాడు.  అన్యదేవతారాధన వలన మనిషి మార్గము తప్పి నడచిన వాడగుచున్నాడని రాజవిద్యా రాజగుహ్య యోగములో 23, 24, 25 శ్లోకములలో చెప్పియున్నారు.  ఆ శ్లోకములను

గీటురాయిగా చేసి చూస్తే మనుషులు చేయు తప్పు తెలియుచున్నది. అన్యదేవతారాధన అజ్ఞానమని తెలియుచున్నది.

శ్లోకము॥ 23. యేప్యన్య దేవతాభక్తా యజన్తే శ్రద్ధయా న్వితాః ।
తేపి మామేవ కౌంతేయ! యజ్యన్త్య విధిపూర్వకమ్ ॥

**భావము :- "ఎవడయితే శ్రద్ధగలిగి అన్యదేవతారాధన చేస్తున్నాడో అతడు అంతటాయున్న నన్నే ఆరాధించినట్టైనా, వాడు మార్గము త్రప్పి నడుస్తున్నాడు. వాని భక్తి నావద్దకు చేరదు."**

శ్లోకము॥ 24. అహంహి సర్వ యజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ ।
నతుమా మభిజానన్తి తత్త్వేనా తశ్చ్యవన్తితే ॥

**భావము :- "సర్వదేవతలకు చేయు ఆరాధనలయందు, యజ్ఞములందు భోక్తను నేనే మరియు ప్రభువును నేనే. నన్ను యదార్థ స్థితిలో తెలియని వారందరికి సుఖము కల్గును తర్వాత అదిపోయి కష్టమును కల్గును, అంతేగానీ ముక్తి దొరకదు."**

శ్లోకము॥ 25. యాన్తి దేవవ్రతాన్ దేవాన్, పితౄన్ యాన్తి పితృవ్రతాః ।
భూతాని యాన్తి భూతేజ్యాః యాన్తి మద్యాజినోపి మామ్ ॥

**భావము :- "దేవతా పూజ వలన దేవతలనే చేరుదురు, పితృదేవతలను పూజింప వారివద్దకే చేరుదురు. చెట్లను, పాములను, పశువులను మొదలగు జీవరాసులను పూజించితే వాటియందే చేరిపోవుదురు. నన్ను పూజించు వాడు మాత్రము నావద్దకు చేరగలడు. అనగా జన్మలకు పోకుండా ముక్తి పొందగలడు."**

ఈ విధముగా దేవుడు తన గ్రంథమున చెప్పిన మాటలను బట్టి ఎవరిని పూజించితే వారివద్దకు చేరిపోవుదురని చెప్పాడు. దేవున్ని వదలి

దేవుడు కాని వారిని ఆరాధిస్తే తిరిగి జన్మలకు పోవలసిందేనని తెలియు చున్నది. ఇది ఒక్క హిందువులకే కాదు మనుషులయిన ప్రతి ఒక్కరికి సంబంధించిన విషయము. దైవగ్రంథము ఏదయినా మనుషులందరికీ వర్తించును. అర్థమగుటకు హిందువులకు భగవద్గీతలోనే చూపితే తొందరగా అర్థము కాగలదని భగవద్గీతను తీసుకొని చెప్పడమైనది. మూడు దైవ గ్రంథములు ఒకే గీటురాయిగా యున్నాయి. అందువలన ఒకే దైవగ్రంథము నుండి అన్ని మతముల ప్రజలలోని అజ్ఞానమును ఎత్తి చూపవచ్చును. అట్లు చెప్పితే 'అది మా గ్రంథము కాదు' అని అనుటకు అవకాశమున్నది. 'మా గ్రంథములోని విషయమైతే వింటాము' అని తప్పించుకొనువారు కూడా ఉండుటవలన మనిషి ఏ మతములో యున్నాడో, ఏ గ్రంథమును నమ్ము చున్నాడో ఆ గ్రంథమునుండే గీటురాయి అయిన బోధలను చూపవలసి యుంటుంది. అలాగని హిందువులకు భగవద్గీతను తప్ప ఇతరము చెప్పకూడదని ఏమీ లేదు. ఒకవేళ ఆ విషయమునకు సంబంధించిన బోధ భగవద్గీతలో లేనప్పుడు ఇతర దైవగ్రంథము నుండి కూడా చెప్పవచ్చును.

క్రైస్థవుల విషయములోనికి వస్తే దేవుడు మనిషి రూపములో చెప్పినది, మనుషులు దేవుని గురించి చెప్పినది రెండు రకముల బోధలు గలవు. ద్వితీయ దైవగ్రంథమని పేరుగాంచినది ఇంజీలు గ్రంథము. ఇంజీలు అనగా జీవము గలది అనీ, జీవింపజేయునదియనీ అర్థమును చెప్పవచ్చును. ఈ గ్రంథములో **జీవ జలము, జీవము** అని అంటే **'జ్ఞానము'** అని భావించ వలెను. అలా అనుకోవడము ఈ గ్రంథములో మాత్రము గలదని చెప్పవచ్చును. దేవుడు తన జ్ఞానమును మూడు విధముల తెల్పునని ఖురాన్ గ్రంథములో 42వ సూరా, 51వ ఆయత్‌లో చెప్పడమైనది. అందులో "దేవుడు తన ప్రతినిధిని పంపి తన జ్ఞానమును చెప్పించును" అని గలదు.

మూడు విధానములలో రెండు వేరు విధానములు కాగా, ఒకటి మాత్రము తన ప్రతినిధిని మానవునిగా మానవులలోనికి పంపి అతని ద్వారా జ్ఞానమును చెప్పించును అని గలదు. అయితే విధానము అదే అయినా మనిషిగా వచ్చిన వాడు దేవుని ప్రతినిధియైనందున, ఆయన వేరు దేవుడు వేరు కాదు ఇద్దరు ఒక్కరేయని చెప్పుటకు అవకాశము గలదు. అది తర్వాత విషయము అయినా దేవుడు పంపిన వాడు దేవుని ప్రతి రూపము లేక ప్రతినిధియని చెప్పియుండుట వలన అతనిని దేవునిగానే భావించాలి. సత్యమును చెప్పితే దేవుని మారువేషమే మనిషిగా వచ్చినదని తెలియవలెను. అతడు సాధారణ మనిషివలె కనిపించినా అతడు మనిషి కాదు. అందువలన అతనికి ప్రత్యేకమైన పేరు పెట్టి పిలుస్తున్నాము. ఆ పేరే భగవంతుడు. దేవుడు అంటే కనిపించని శక్తి, భగవంతుడు అంటే కనిపించే శక్తియని అర్థము. **'దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతర మానవులకు ఎవరికీ తెలియదని'** చెప్పడము జరిగినది. ఈ విషయమును అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా మూడు ఆయత్ ఏడు (3-7) లో చెప్పియున్నారు.

ఆ విధముగా దేవుని అవతారమై లేక దేవుని ప్రతినిధియై వచ్చిన వాడు ఏసు. ఏసుగా వచ్చిన దేవుని ప్రతినిధి తన జీవితమును సాగించుచూ తాను దేవుని అవతారమని ఎవరికీ తెలియకుండా ఉంటూ తాను ప్రజలకు చెప్పవలసిన జ్ఞానమును చెప్పిపోవును. అదే విధముగా ఏసుగా వచ్చిన దేవుడు తనను ఎవరూ గుర్తించనట్లు జీవించి తన జీవిత కాలములో చెప్పవలసిన జ్ఞానమును చెప్పిపోయాడు. ఆయన ప్రజల మధ్యలో ఉన్నది కేవలము మూడు సంవత్సరములే. ఆ మూడు సంవత్సరములలో కొంత జ్ఞానమును చెప్పి చనిపోయినట్లు నటించి, ప్రజల మధ్యలోనుండి తప్పుకొని దూరముగా వచ్చి తన జీవిత కాలమును పూర్తి చేశాడు. ఆయన మనిషి

రూపములోయున్న దేవుడైయుండి దేవుని గురించిన బోధలు చెప్పాడు. దేవుని జ్ఞానము దేవునికే తెలుసు, కావున ఆయన తన జ్ఞానమును ప్రజలకు సులభముగా బోధించడమైనది. మనిషిగా ఆయన చెప్పిన బోధలు బైబిలు గ్రంథములో నాలుగు సువార్తలుగా ఉన్నాయి. బైబిలు గ్రంథము మొత్తము 66 పాఠముల రూపములోయుండగా నాలుగు సువార్తలకు ముందు 39 పాఠములు వెనుక 23 పాఠములు గలవు. మధ్యలో నాలుగు పాఠములు ప్రత్యేకమైనవిగా యుంటూ ప్రత్యేకమైన **'సువార్తలను'** పేరును కల్గియున్నవి. నాలుగు సువార్తలను దేవుడు చెప్పియుండగా మనుషులు వ్రాశారు. మిగతా 62 పాఠములను మనుషులే దేవున్ని గురించి వ్రాశారు. అయితే అందులో కొన్ని సత్యము, కొన్ని అసత్యముతో కూడుకొనియున్నవి. నాలుగు సువార్తలు స్వయముగా దేవుడు మారువేషములో ఉండి చెప్పినవైనందున అందులో అంతా జ్ఞానమేయున్నది. మనుషులు చెప్పిన వాటిలోనే దేవుని జ్ఞానమును గురించి చెప్పిన మాటలే అయినా అవి మనుషులు చెప్పినవగుట వలన సత్యాసత్యములతో కూడుకొనియున్నవి.

బైబిలు గ్రంథమంతయూ మూడు భాగములుగా విభజింపబడినది. ముందుగల 39 పాఠములను పాతనిబంధన అంటున్నాము. తర్వాత 'క్రొత్త నిబంధన' అను పేరుతో 27 పాఠములున్నవి. పాతనిబంధన, క్రొత్త నిబంధన అని రెండు భాగములుగా అందరూ బైబిలు గ్రంథమును చెప్పుచున్నారు. అయితే మేము **'సువార్తలు'** అను నాలుగు పాఠములను వాటిలో కలుపకుండా ప్రత్యేకముగా చెప్పితే బైబిలును మూడు భాగములుగా చెప్పవచ్చును. బైబిలు గ్రంథమును రెండు భాగములుగా చెప్పుటకంటే మూడు భాగములుగా చెప్పడమే న్యాయము. ఎందుకనగా! దేవుని మాటలను ఒకవైపు, మనుషుల మాటలను మరొకవైపు చేసి చెప్పితే బైబిలు

మూడు భాగములగును. దేవుడు మనిషిగా యున్నా దేవుడు దేవుడే. మనుషుల మాటలను దేవుని మాటలను కలుపకుండా వేరుగా చెప్పుకొంటే దేవున్ని గౌరవించినట్లగును. అలా కాకుండా మనుషుల మాటలతో దేవుని మాటలను కలిపితే దేవున్ని గుర్తించనట్లు, గౌరవించనట్లు అగును. వాస్తవముగా మనిషిగా వచ్చిన దేవున్ని అప్పుడు ఆయన ఉన్న సమయములో ఎవరూ గుర్తించలేరు. ఆయన పోయిన తర్వాత ఆయన చెప్పిన జ్ఞానమును బట్టి దేవున్ని గుర్తించవచ్చును. అయితే ఆయన చెప్పిన మాటలనే గ్రంథముగా వ్రాస్తూ, ఆయన జ్ఞానమును గుర్తించకుండా మనుషుల మాటలలో కలుపడము దేవుడు మరియు మనుషులు చెప్పిన మాటలను కలిపి చదువుకోవడము చూస్తే దేవుని జ్ఞానమును మనిషి ఏమాత్రము గుర్తించలేదని అర్థమగుచున్నది.

బైబిలు గ్రంథములో ఏసు మనిషిగా యున్నప్పుడు కేవలము మూడు సంవత్సరములు మాత్రమే బోధను చెప్పాడు. ఆ మూడు సంవత్సరములలో చెప్పిన మాటలన్నియూ దైవజ్ఞానముతో కూడిన మాటలే. ఆ మాటలను గ్రహించగలిగితే సంపూర్ణ జ్ఞానము లభించును. మనిషి జన్మలనుండి బయట పడి దైవము వద్దకు చేరుటకు సరిపడు జ్ఞానమును ఏసుగా యున్నప్పుడు దేవుడు బోధించాడు. అయితే మనుషులు అప్పుడు గానీ, తర్వాత కాలములోగానీ దేవుని జ్ఞానమును గుర్తించనివారై మనుషులు చెప్పిన మాటలను, దేవుడు చెప్పిన మాటలను కలిపి చదువుకొనుచున్నారు. వాస్తవముగా దైవగ్రంథములో దేవుడు చెప్పిన జ్ఞానమే ఉండాలి. అయితే మూడు దైవగ్రంథములలో దేవుడు చెప్పినది మాత్రమే ఉండక అందులో మనుషులు చెప్పినది కూడా కలిసియుండును. బైబిలు గ్రంథమును గమనించితే దేవుడు చెప్పినది నాలుగు పాలములయితే మనుషులు చెప్పినది

62 పాఠములున్నవి. అట్లే భగవద్గీతలో ఏడువందల శ్లోకములుంటే, కొన్ని పదుల సంఖ్యలో కల్పిత శ్లోకములు కలిసియున్నవి. ఇక ఖురాన్ గ్రంథ విషయములోనికి వస్తే అంతా దేవుడు చెప్పినదే యున్నట్లుండినా అంతా దేవుని జ్ఞానమే యున్నదని చెప్పలేము. ప్రతి గ్రంథములోనూ మనుషులు చెప్పినది ఎంతో కొంత కలిసియుండును. దేవుడే అలా వుండునట్లు నిర్ణయము చేశాడు. గ్రంథములో దేవుని మాటలు కొన్ని, మనుషుల మాటలు కొన్ని యుండుట వలన దేవునికి ఇష్టమైన వానికి దేవుని జ్ఞానము, దేవునికి ఇష్టము లేనివానికి మాయ జ్ఞానము కనిపించునట్లు తన గ్రంథములలో మనుషులు కల్పించి వ్రాసిన అజ్ఞానము కూడా కొంతయుండునట్లు దేవుడే చేశాడు. దేవునికి తెలియకుండా ఏదీ జరుగదు. దైవ గ్రంథములలో అజ్ఞానము చోటు చేసుకొనియున్నదంటే అది దేవుని ఇష్టముతోనేయుండును.

మనిషి శ్రద్ధనుబట్టి గ్రంథములలోని జ్ఞానము లభించుచుండును. దేవుడు మనిషిగా యున్నప్పుడు బోధించు బోధ స్వచ్ఛమయినదిగా యుండును. తర్వాత ఆ బోధ గ్రంథరూపముగా మారునప్పుడు దానిని మనుషులే వ్రాయవలసియుండును. అప్పుడు గ్రంథము కలుషితమగుటకు అవకాశము గలదు. మొదట వ్యాసుడు కృష్ణుడు చెప్పిన జ్ఞానమునే భగవద్గీతగా వ్రాసినా తర్వాత కొందరు తమ భావములను శ్లోకముల రూపములో తయారుచేసి భగవద్గీతలోనికి చేర్చారు. బైబిలు విషయానికి వస్తే ప్రత్యక్షముగా కనిపించునట్లు ఏసు చెప్పిన జ్ఞానము నాలుగు సువార్తలుగాయుండగా, మనుషులు వ్రాసినది 62 పాఠములుగా యున్నది. ఖురాన్ విషయమునకు వస్తే దానిని గురించి ఇలాగ అని చెప్పలేముగానీ, దేవుడే “నేను మనుషులను తప్పుదారి పట్టిస్తాను” అని చెప్పుట వలన

దానికొరకు దేవునికి తెలిసే కొంతయినా కలుషితము చేరియుండవచ్చునని అనుకొంటున్నాము.

శ్రద్ధ బుద్ధి గలవాడు సక్రమమైన జ్ఞానము తెలిసి కలుషిత జ్ఞానము వైపు పోకుండాయుండుటకు ఇది నిజమైన జ్ఞానము, ఇది అసత్య జ్ఞానము అని తెలియుటకు తన గ్రంథములోని వాక్యములనే గీటురాయిగా చేసి పెట్టాడు. అందువలన మనుషులు చెప్పిన జ్ఞానమును, దేవుడు చెప్పిన జ్ఞానమును సులభముగా గ్రహించవచ్చును. ఇప్పుడు ఖురాన్ గ్రంథములోని జ్ఞానమును గీటురాయిగా దేవుడు చూపడము వలన దానితో బైబిలుయందు గానీ, ఖురాన్‌గ్రంథమందు గానీ యున్న మనుషుల కలుషిత జ్ఞానమును గుర్తించవచ్చును. బైబిలు గ్రంథములో 62 పాఠములు కలుషితముగా యున్నవనీ అందులో జ్ఞానమును అజ్ఞానమును, సత్యాసత్యములను గీటురాయితో తెలుసుకోవచ్చని చెప్పాము. బైబిలుకు, ఖురాన్‌కు ఖురాన్ గ్రంథములోని గీటురాయి వాక్యములనే ఉపయోగించి సత్యాసత్యములను తేల్చవచ్చును. బైబిలు గ్రంథములోని నాలుగు సువార్తలలోని వాక్యములందు లేని విషయమును ప్రథమ దైవగ్రంథమందుగానీ, అంతిమ దైవగ్రంథమందు గానీ చూడవచ్చును.

'ప్రార్థన లేక ఆరాధన' విషయములో భగవద్గీతయందు గీటురాయిని మూడు శ్లోకములలో చెప్పుకొని ఉపయోగించి చూచుకొని తప్పును తెలుసు కొన్నాము. ఇప్పుడు అదే ప్రార్థన విషయము క్రైస్థవులలో చూచినట్లయితే క్రైస్థవుల ప్రార్థన ఒకే దేవుని మీద ఉన్నదయినా అది బహిరంగ ప్రార్థనగా యున్నది. హిందువుల బహు దేవతారాధనను ఖండించి ఒకే దేవునివైపు చూపు మరలునట్లు రాజవిద్యా రాజగుహ్య యోగములోని మూడు శ్లోకముల ద్వారా తెలుసుకొన్నాము. ఇప్పుడు ప్రార్థన విషయములో సత్యాసత్యమును

తెలుయుటకు సువార్తలలోని గీటురాయిని ఉపయోగించి చూస్తాము. ఈ విషయమై మత్తయి సువార్త 6వ అధ్యాయములో 5 నుండి 8వ వాక్యము వరకు చూడండి. **(మత్తయి 6-5,6,7,8) "మీరు ప్రార్థన చేయునప్పుడు వేషధారులవలె ఉండవద్దు. మనుషులకు కనపడవలెనని సమాజ మందిరములలోనూ, వీధుల మూలలలోనూ నిలచి ప్రార్థన చేయుట వారికి ఇష్టము. వారు తమ ఫలము పొంది యున్నారని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. నీవు ప్రార్థన చేయునప్పుడు నీ గదిలోనికి వెళ్ళి తలుపులు వేసి, రహస్య మందున్న నీ తండ్రిని ప్రార్థన చేయుము. అప్పుడు రహస్యమందు చూచు నీ తండ్రి నీకు ప్రతిఫలమిచ్చును. మరియు మీరు ప్రార్థన చేయునప్పుడు అన్యజనులవలె వ్యర్థమైన మాటలు వచింపవద్దు. విస్తరించి మాటలాడుట వలన తమ మనవి వినపడునని వారు తలంచుచున్నారు. మీరు వారివలె ఉండకుడి. మీరు మీ తండ్రిని అడుగక మునుపే మీకు అక్కరగా యున్నవేవో ఆయనకు తెలియును."**

ఈ వాక్యములు సులభముగా అర్థమగులాగున పైకి కనిపించుచున్నా ఇందులో అర్థము చేసుకోవలసినది ఎంతోయున్నది. ఈ వాక్యములు స్థూల విషయమును గురించికాక సూక్ష్మ విషయమును బోధించుచున్నవి. 'నీవు ప్రార్థన చేయునప్పుడు నీ గదిలోనికి వెళ్ళి తలుపులు వేసి' అని చెప్పు వరకు స్థూల విషయముగా అందరికీ అర్థము కాగలదు. తర్వాత **"రహస్యమందున్న నీ తండ్రిని ప్రార్థన చేయుము. అప్పుడు రహస్యమందు చూచు నీ తండ్రి నీకు ప్రతిఫలమిచ్చును"** అని

వ్రాసినదంతా సూక్ష్మ విషయమైయున్నది. ఇక్కడ 'రహస్యమందున్న నీ తండ్రిని ప్రార్థన చేయుము' అని యున్నది కదా! 'నీ తండ్రిని ప్రార్థన చేయుము' అని యుండడమేగాక 'రహస్యమందున్న'యని ఉన్నది. ఇక్కడ చాలా సూక్ష్మముగా యున్న విషయము **'తండ్రి మరియు రహస్యము.'** రహస్యమనగా ఏమి? తండ్రియనగా ఎవరు? అను ప్రశ్నలకు జవాబు తెలిసియుండవలెను. అయితే చాలామంది మనకు కనిపించకయున్న దేవుడు అని భావించుకొని కనిపించకయున్న దేవున్ని ప్రార్థించడమే కదా! యని అనుకొనుచుందురు. 'రహస్యమందు చూచు నీ తండ్రి నీకు ప్రతిఫలమిచ్చును' అని యున్నది. తండ్రి అయినవాడు రహస్యమందు చూచుటయని అంటే ఎక్కడనుండి చూచుచున్నాడు? రహస్యము అంటే ఎక్కడయున్నది? అక్కడనుండి నిన్ను ఎలా చూచుచున్నాడు? అని ప్రశ్నించుకొని, ఆ ప్రశ్నలకు జవాబులను తెలియవలెను. తండ్రియంటే దేవుడేనా? అను ప్రశ్నను కూడా వేయవలసి యుండును. 'రహస్యమందు చూచు' అని వాక్యములో గలదు. 'రహస్య మందు చూచు నీ తండ్రి' అని కలదు కదా! రహస్యమందు ఎవరిని చూచుచున్నాడు? అని ప్రశ్నించుకొంటే నిన్నే చూచుచున్నాడని జవాబు వచ్చును. అప్పుడు నీవు కూడా రహస్యమందు ఉన్నావా? అను ప్రశ్న రాగలదు. అంతేకాక ప్రార్థన కోసము గదిలోనికి వెళ్ళి తలుపులు మూసి అని చెప్పడములో అర్థమేమిటి? అని కూడా ఆలోచించవలసియుంటుంది. గది లేనివాళ్ళు, గదియున్నా గదికి తలుపులు లేనివాళ్ళు చాలామంది గలరు. అటువంటి వారు ప్రార్థన చేయుటకు అవకాశముండదా? అను ప్రశ్న కూడా రాగలదు. ఒక ఇంటిలో ఎక్కువ జనాభా వున్నవారు గలరు. కొన్ని ఇండ్లలో గదులే ఉండవు. అటువంటి వారు ప్రార్థన ఎలా చేయాలి? గదియంటే ఏమిటి? గదిలో దూరి తలుపులు వేస్తే నీవు రహస్యములో

ఎవరికీ కనిపించక యుండినట్లే కదా! అసలు గదియంటే స్థూలముగా యుండునదా? సూక్ష్మముగాయుండునదా? గది నీ శరీరమునకా? నీకా? నీకయితే నీవు గదిలోయున్నావా? శరీరములో యున్నావా? అని ప్రశ్నించు కొని చూచి ఇన్ని ప్రశ్నలకు జవాబు తెలిసినప్పుడే నీ ప్రార్థన సరియైనదగును. దేవుడు చెప్పిన ప్రార్థన చేసినట్లగును. అట్లు కాకుండా ఈ ప్రశ్నలకు జవాబు లేకుండా ప్రార్థన చేస్తే అది ప్రార్థన అనిపించుకోదు. నేను నీకు చెప్పినది ఏమి? నీవు చేసినది ఏమి? అని దేవుని నుండి ప్రశ్న రాగలదు.

క్రైస్థవులు నేడుగానీ, పూర్వముగానీ ఇప్పుడు మేము చెప్పినంత లోతుగా ఆలోచించడము లేదు. ప్రార్థన విషయములోనే కాకుండా మిగతా అన్ని విషయములలోను లోతుగా ఆలోచించడము లేదు. ఏసుప్రభువు ఏమి చెప్పాడని ఆలోచించక తమకు తోచినదే చెప్పాడని, తమకు అర్థమయినదే చెప్పాడని అనుకోవడము జరుగుచున్నది. ఈ విధముగా బైబిలును సరిగా అర్థము చేసుకోలేక పోవడము వలన బైబిలులోని విషయములు ఒక్కటి కూడా సరిగా అర్థము కాకుండా పోయాయి. గీటు రాయిని ఉపయోగించి చూచినప్పుడు మనిషి అర్థము చేసుకొన్న దానిలోని జ్ఞానము, అజ్ఞానము బయటపడుచున్నది. ఏసుప్రభువు చెప్పిన 'జ్ఞానము' అను గీటురాయితోనే బైబిలునుండి మనము అర్థము చేసుకొన్న దానిని పరీక్షించి చూచుకోమని చెప్పుచున్నాము. గీటురాయి ప్రకారము నీది జ్ఞానమయితే ఫరవాలేదు. అజ్ఞానమయితే సరైన ఆలోచన చేసి సరైన జ్ఞానమును తెలియమని చెప్పుచున్నాము.

ఇంతవరకు రెండు మతముల ప్రార్థన విషయములో హిందువులు దేవున్ని వదలి, దేవుడు ఎవరో తెలియక, దేవుడు వేరు దేవతలు వేరు అను విషయము తెలియక ఎందరినో దేవతలను ఆరాధించుచుండగా భగవద్గీత

లోని గీటురాయితో వారి అజ్ఞానమును బయటికి చెప్పడమైనది. తర్వాత క్రైస్థవుల విషయములో ప్రార్థన విధానమును చూస్తే వారు దేవుడు ఒక్కడేయని ఒక్క దేవున్నే ఆరాధించుచుండినా, ప్రార్థన చేయు విధానము తెలియని దానివలన, బైబిలు గ్రంథములోని మత్తయి సువార్తయందలి గీటురాయితో, వారు ఆచరిస్తున్న విధానములో సత్యాసత్యమును చెప్పడమైనది. ప్రార్థనయందు జ్ఞానపద్ధతిలో ఎలా ఆలోచించాలో గీటురాయి ద్వారా తెలుపడమైనది. అలా చెప్పడము వలన ప్రార్థన విషయములో వారు జాగ్రత్తగా వ్యవహరించు అవకాశము గలదు. ఇప్పుడు తదుపరి విషయముగా అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లోని ప్రార్థనా విషయమును చూస్తాము.

ఒకే దేవున్ని ఆరాధించు వారిలో మొదటివారు ముస్లీమ్‌లేనని చెప్పవచ్చును. అంతేగాక ప్రపంచములో దేవున్ని ఎక్కువగా ఆరాధించు వారు, ప్రార్థించువారు ముస్లీమ్‌లేనని కూడా చెప్పవచ్చును. అసూయ లేకుండా ఉన్నది ఉన్నట్లు చెప్పితే, వారితో పాటు ప్రార్థన చేయువారు ప్రపంచములో ఎవరూ లేరని చెప్పవచ్చును. అత్యధిక ప్రార్థనలు చేయువారు ముస్లీమ్‌లే. వారి బాహ్య జీవితములో ఎలాగున్నా దేవుని విషయములో దేవుని ప్రార్థన విషయములో కడు జాగ్రత్తగా మసలుచుందురు. దేవుని ప్రార్థన విషయములో తమ పెద్దలు చెప్పినట్లు తప్పక ఆచరించుచుందురు. దేవుని విషయములో ఎటువంటి అశ్రద్ధగానీ, సోమరితనముగానీ వారిలో ఎంతమాత్రము కనిపించదు. దేవుని ప్రార్థన విషయములో అందరు ఏకాభిప్రాయము కల్గియుండడమే కాక ప్రపంచ విషయములన్నిటికంటే ప్రార్థనకే ఎక్కువ విలువనిచ్చుచున్నారు. అంతిమ దైవగ్రంథములో వారి ప్రార్థనను **'నమాజ్'** అను పేరుతో పిలుస్తున్నారు. నమాజ్ విషయమును

ఖురాన్ చదివిన వారి పెద్దలు ఎట్లు ఆచరించుచున్నారో మిగతా వారు కూడా అట్లే ఆచరించుచున్నారు. ముస్లీమ్‌లు ప్రార్థనలో మొదటివారుగా యున్నా, ఖురాన్ గ్రంథములో అల్లాహ్ ప్రార్థన విషయములో ఏమి చెప్పాడో తప్పనిసరిగా చూడవలసిన అవసరమున్నది. దేవుడు తన జ్ఞానమును ఒకే గ్రంథముగా మనుషులకు ఇచ్చాడు. చివరికది మూడు గ్రంథములుగా మారినది. దేవుడు మొదట తన జ్ఞానమును గీటురాయి రూపములో ఇవ్వగా, అదే మూడు గ్రంథములుగా మనముందరున్నది. అందువలన చివరిలో తయారయిన ఖురాన్ గ్రంథము కూడా సత్యా సత్యములు తేల్చి చెప్పుటలో గీటురాయిగా యున్నదని తెలియుచున్నది. ఇదే విషయమునే ఖురాన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 53లోనూ, మరియొక చోట సూరా 25 ఆయత్ 1 లోనూ ఈ విధముగా చెప్పడమైనది. **(2-53) "మేము మూసాకు మీ మార్గదర్శకత్వము నిమిత్తము గ్రంథాన్ని గీటురాయిని ప్రసాదించాము"** అని కలదు. **(25-1) "సమస్త లోకాలను హెచ్చరించేవానిగా ఉండటానికి గాను తన దాసునిపై గీటురాయిని అవతరింపజేసిన అల్లాహ్ గొప్ప శుభకరుడు."**

అంతిమ దైవగ్రంథము గీటురాయిగా ఉన్నదనుటకు అల్లాహ్ చెప్పిన పై ఆయతులే ఆధారము. గీటురాయి అనగా సత్యాసత్యములు తెల్పునది యని అర్థము. గీటురాయిని ఉపయోగించి గ్రంథములోని వాక్యములనే గీటురాయిగా చేసుకొని, మనుషులు దేవుని ఎడల చేయు కార్యములు సరియైనవో కాదో తేల్చి చెప్పుకొన్నాము. ఇప్పుడు ఖురాన్ గ్రంథములో దేవుడు ఇచ్చిన గీటురాయిని ఉపయోగించుకొని ముస్లీమ్‌లు చేయు ప్రార్థనలో సత్యము ఎంత ఉంది? అసత్యము ఎంతయుంది? అని సరిచూచు

కొందాము. ఒకవేళ దేవుడు చెప్పిన విధానము మనుషులకు సరిగా అర్థముకాకపోయినా, గీటురాయి వలన లోపములు సరిచేసుకొని ముందుకు పోవు అవకాశమును పొందవచ్చును. గీటురాయి మనుషుల అభిప్రాయమును తెలుపక దేవుని అభిప్రాయమును జ్ఞాన రూపముతో చెప్పుచుండుట వలన ప్రతి ఒక్కరూ గీటురాయి జ్ఞానమును అనుసరించ వలసియుండును. ఇప్పుడు ప్రార్థన విషయములో గీటురాయిని ఉపయోగించి సత్యాసత్యములను తెలుసుకొందాము.

'ప్రార్థన' దేవుని విషయములో చాలా ముఖ్యమైనది. అందువలన ప్రార్థన గురించి గ్రంథము మొదటిలోనే కొంత చెప్పుకొన్నాము. 'ముఖ్యమైన అభ్యర్థనను ప్రార్థన' అని అంటాము. దేవున్ని ప్రపంచ విషయములలో ఏదీ అడుగవలసిన పనిలేదు. అవి అన్నియూ కర్మనుబట్టి యుండును. **మనము అడుగవలసినది కర్మకు సంబంధము లేనిది, దైవికమయినది. తనను దేవుని వద్దకు చేర్చుకొమ్మని అడుగడమే అన్నిటికంటే ముఖ్యమైన అర్థన.** అందువలన ముక్తిని గురించి అడుగడమే ప్రార్థన అంటాము. మూడు మతములలో ముక్తిని అడుగడము కొరకే ప్రార్థన తయారు చేయబడినది. అయితే అజ్ఞానము వలన ప్రార్థన గాడితప్పి ప్రపంచ విషయములలోనికి పోయినది. ముస్లీమ్ మతము ప్రార్థనలో ప్రత్యేకమయిన దనీ, ప్రార్థన ఆచరించడములో ముస్లీమ్‌లే మొదటివారనీ, ముస్లీమ్‌ల తర్వాతనే మిగతా వారని చెప్పవచ్చని చెప్పాము. అయితే ముస్లీమ్‌లు ప్రార్థన విషయములో ఎంత దృఢ విశ్వాసముతోయున్నారో అంత ఫలితమును పొందుచున్నారా? యని లెక్కించి చూచాము.

ఫలితము విషయములో మూడు మతములను గురించి చెప్పు కొందాము. హిందూ మతమున ప్రార్థనయున్నది. అందరూ చేయకున్నా

కొందరయినా దైవప్రార్థన చేయుచున్నారు. 'దేవుడు' అను విషయములో వేయిమందిలో ఒకనికి కూడా నిజమైన దేవుడు ఎవరని తెలియదు. కొన్ని వేలమందిలో ఒకనికి దేవతలను, మనుషులను సృష్ఠించిన వాడు దేవుడు ప్రత్యేకముగా యున్నాడని తెలిసినా, వాడు దేవున్ని ప్రార్థన చేసినా, ఆ ప్రార్థన ధ్యానముగానో, తపస్సుగానో యుండును. నేటి కాలములో 'మెడిటేషన్' అని క్రొత్త పేరు కూడా పెట్టుకొన్నారు. హిందువులలో వేలమందికి ఒకడు అరుదుగా అసలయిన దేవున్ని గుర్తించి దేవతలను వదలిపెట్టి దేవున్నే ప్రార్థన చేసినా ఆ ప్రార్థన సరియైనదేనా? అని ప్రశ్నించుకొని చూస్తే, అనగా గీటురాయిని ప్రయోగించి చూస్తే ప్రార్థన విషయములో దేవుడు చెప్పిన పద్ధతిని మనుషులు సరిగా గ్రహించుకోలేదని తెలియు చున్నది. గీటురాయితో గీచిచూస్తే దేవుడు చెప్పిన ధర్మమును వదలి అధర్మము ప్రకారము ప్రార్థనలు చేయుచున్నారనీ, అధర్మ ప్రార్థనలు దేవునికి సంబంధము లేనివని తెలియుచున్నది.

దేవుని ప్రార్థన అనగా ముక్తిని కలుగజేయునదీ, దేవుని సన్నిధికి చేర్చునదీ, పుట్టుక లేకుండా పరలోక ప్రాప్తిని కల్గించునది అని అర్థము. పరలోకము అనగా దేవుని సాన్నిధ్యమేనని తెలియవలెను. ముక్తి అనిన రెండవ పుట్టుక లేకుండా దేవునిలోనికి ఐక్యమై పోవడము అని అర్థము. **ముక్తి, మోక్షము, దేవుని సన్నిధి, పరలోక ప్రాప్తి, జన్మలు లేకుండా పోవడము** ఇవన్నియూ ఒక్కటే. దానినే **విడుదల, ముక్తి, విముక్తి** అని అంటున్నాము. కర్మనుండి బయటపడడమే 'ముక్తి' అంటున్నాము. కర్మబంధనముల చేత జన్మలు పొందకుండా దేవునియందు ఐక్యమై పోవుటనే ముక్తి లేక మోక్షము అని అంటున్నాము. ఈ పదములు హిందువులకు కొంత పరిచయమే అయినా ముస్లీమ్‌లకు పూర్తి క్రొత్తగా యుండును. ఖురాన్ గ్రంథములో

**'పరలోకము'** అను పదమును ఉపయోగించియున్నా పరలోకము అంటే అర్థము తెలియదు. దానిని ఒక ఊరులాగా కొందరు పోల్చుకొన్నారు. కొందరు స్వర్గమును 'పరలోకము' అని అనుకోవడము జరిగినది. మొత్తము మీద చాలా పొరపడినారనీ, ఖురాన్ గ్రంథములోని పరలోకమును గురించి సరిగా గ్రహించుకోలేక పోయారని కూడా చెప్పవచ్చును. అంతేకాక **'నమాజ్'** అను పదమును కూడా సరిగా అర్థము చేసుకోలేక, దేవుడు ఒకటి చెప్పగా మనిషి మరొకటి అర్థము చేసుకొన్నాడని చెప్పుచున్నాము. ఇదంతయూ ఇతరులను కించపరచుటకో, నేను గొప్ప అని అనిపించుకొనుటకో చెప్పడము లేదు. నా వలె జ్ఞానమార్గములో ముందుకు పోవాలను ఉద్దేశ్యముతో చెప్పుచున్నాము. అందువలన ఎవరూ తప్పుగా అర్థము చేసుకోకూడదని చెప్పుచున్నాను. ముందుగా మోక్షమును నమ్ము హిందువులే ఎలా ప్రార్థన విషయములో పొరపడినారో తెలియగల్గితే, మిగతా మతముల విషయము సులభముగా అర్థము కాగలదు. అందువలన ఇక్కడ చెప్పినది అందరికి కావున జాగ్రత్తగా తెలియండి. దేవుని మార్గమును సరళము (సులభము) చేయుట కొరకు దేవుడిచ్చిన గీటురాయిని ఉపయోగించి ఎవరిలో ఎంత అజ్ఞానమున్నదో చెప్పక తప్పలేదు.

కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము మూడు యుగముల నుండి భూమిమీద నాలుగు అధర్మములు గలవు. అధర్మములకు వ్యతిరేఖముగా మూడు ధర్మములు కూడా గలవు. అధర్మములు మాయకు సంబంధించినవి. ధర్మములు దేవునికి సంబంధించినవి. ధర్మముల వలన దేవుడు తెలియబడును. అధర్మముల వలన ప్రపంచ సంబంధమైన విషయములే తెలియబడును. మాయ పక్షమున ప్రపంచ సంబంధ విషయములుండును. 17,28,000 సంవత్సరములు కృతయుగము గడచి

పోయినది. 12,96,000 సంIIలు త్రేతాయుగము గడచిపోయినది. 8,64,000 సంIIలు ద్వాపరయుగము గడచిపోయినది. ఇప్పుడు కలియుగము దాదాపు 5160 సంవత్సరముల పైన జరుగుచున్నది. మొత్తము ఇప్పటికి గడచినది 38,93,160 సంవత్సరములనుకొందాము. ఇది ఒక లెక్క మాత్రమే! ఇటువంటి యుగములు ఎన్ని గడిచాయో అది దేవునికే తెలియాలి. ఇప్పటి వరకు జరిగిన కాలములో నాలుగు అధర్మములు అప్పుడప్పుడు చెలరేగగా, దేవుని చేత తిరిగి మూడు ధర్మములు ప్రతిష్ఠించబడేవి. ఇప్పుడు అదే కార్యనిమిత్తము అధర్మములను లేకుండా చేసి ధర్మములను ప్రతిష్ఠించుటకే, మూడు దైవ గ్రంథములు చెప్పబడినాయి. మూడు దైవగ్రంథములలో ధర్మములను ఆచరించమని, అధర్మములను నిషేధించమని చెప్పడమైనది. మానవుల మనస్సులో అధర్మములు సులభముగా ప్రాకగలవు. మనస్సు ప్రకృతి చేత తయారయినది. అందువలన ప్రకృతిచే తయారు చేయబడిన మాయ, ప్రకృతి చేత తయారయిన మనస్సులోనికి సులభముగా ప్రాకగలదు. అందువలన మనుషులకు అధర్మములు సులభముగా అర్థమగుచున్నవి. అధర్మములు అర్థమయినట్లు ధర్మములు అర్థము కావడములేదు. మొదటి నుండి జ్ఞానము కల్గిన హిందువులు మూడు యుగములనుండి యున్నారు. ఒకే హిందూ సమాజమే మూడు యుగములనుండి యున్నది. ప్రస్తుతము ఇప్పుడిప్పుడు కలియుగములో రెండువేల సంవత్సరములనుండి 'మతము' అనునది పుట్టుకొచ్చినది. మతము అనునది ఒక అధర్మముగా తయారయినది. అంతకు ముందు నాలుగు అధర్మములుండగా, ఇప్పుడు వాటి జతకు మతము అను అధర్మము క్రొత్తగా వచ్చి చేరినది. కలియుగములో ఐదు అధర్మములు అయినవి. అధర్మముల సంఖ్య పెరిగినది. ఇప్పుడు వచ్చినది కాకుండా ఇంతకుముందున్న నాలుగు అధర్మములను

చెప్పుకొంటే ఇలా కలవు. **1) యజ్ఞములు, 2) దానములు, 3) వేదాధ్య యణములు, 4) తపస్సులు** అనునవి అధర్మములుగా యుండేవి. ఈ నాలుగు అధర్మముల వలన దేవుడు తెలియబడడు అని ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీత ద్వారా దేవుడు చెప్పడమైనది. దేవుడు తెలియని నాలుగు అధర్మములను వదలి, దేవునిలోనికి కలియు యోగములను మూడింటిని దేవుడు చెప్పడమైనది. ఆ మూడు యోగములను **1) బ్రహ్మ యోగము, 2) కర్మయోగము, 3) భక్తి యోగము** అని చెప్పడమైనది. దేవునితో వియోగముగాయున్న మనము **యోగము** చెందవలెనని దేవుడు చెప్పాడు.

'యోగము' అనగా కలయిక 'దేవునితో కలయిక' అని అర్థము. మనిషి దేవునియందు కలిసి యుండడమును 'మోక్షము, యోగము' అని అనవచ్చును. దేవునియందు కలిసి యుండుటను యోగము లేక కలయిక అనునట్లే తెలుగులోనే అర్థముండునట్లు **'నమాజ్'** అని అంటున్నాము. నమాజ్ అనగా దేవునితో కలిసియుండడమనియే అర్థము. యోగము అంటే దేవునితో యుక్తము అయినట్లు, నమాజ్ అనగా దేవునితో కలయిక అని అర్థము. యోగము పొందుటకు అనగా దేవునిలోనికి ఐక్యమగుటకు యోగమునే ఆచరించవలెను. అందువలన యోగమును **'ధర్మము'** అని అంటున్నాము. అట్లే దేవునిలోనికి చేరుటను **'నమాజ్'** అని కూడా అందురు అని చెప్పుకొన్నాము. యోగమునకు, నమాజ్‌నకు ఒకే అర్థము గలదు. యోగము పొందుటకు యోగమును ఆచరించమని యన్నట్లు, నమాజ్ పొందుటకు నమాజ్‌నే ఆచరించవలెను. ధర్మమయిన యోగమును ఆచరించడము వలన దేవునిలోనికి ఐక్యము పొందవచ్చును. అలాగే దేవుని ధర్మమయిన నమాజ్‌ను ఆచరించడము వలన దేవునిలోనికి కలిసి

పోవచ్చును. యోగము అనగా కర్మలనుండి విడువడి జన్మలలోనికి పోకుండా దేవునిలోనికి చేరియుండడమని అర్థము. అలాగే నమాజ్ అనగా జన్మలు పొందకుండా దేవునియందు చేరిపోవడము అని అర్థము. 'నమాజ్' అను పదమును విడదీసి చూస్తే న+మ+జ = నమాజ్ అని చెప్పవచ్చును.

ఇక్కడ నమాజ్‌లోని మూడు అక్షరములకు అర్థమును చెప్పుకొంటే **'న'** అనగా వద్దు అని అర్థము. **'మ'** అనగా నాకు యని అర్థము. **'జ'** అనగా జన్మలు అని అర్థము. **"నాకు జన్మలు వద్దు" అని అర్థమును తెల్పునదే నమాజ్.** నమాజ్ ఆదినుండి యున్న తెలుగు పదమే యని చెప్పవచ్చును. మనిషి దేవుని జ్ఞానము మీద ఆసక్తుడై జ్ఞానమును తెలిసి, జ్ఞానము ప్రకారము యోగమును ఆచరిస్తే, అతనికి యోగ సమయములో లభించు జ్ఞానాగ్ని వలన వాని కర్మలన్నీ కాలిపోయి, వానికి కర్మలు లేని దానివలన జన్మలకు పోకుండా మోక్షమును పొంది దేవునియందైక్యమగును. ఎప్పుడయితే కర్మలు శేషము లేకుండా కాలిపోవుచున్నవో, అప్పుడు ఒక్క క్షణము కూడా అతడు శరీరములో యుండక ముక్తిపొంది దేవునిలో చేరిపోవును. కర్మలు అయిపోయిన వెంటనే జన్మలకు కారణమయిన కర్మలు లేకపోవడము వలన, అతడు ఒక్క సెకండు కూడా ఆలస్యము లేకుండా దేవునియందు చేరిపోవును. కర్మ అయిపోకనే ఒక్క క్షణము ముందుగానీ, కర్మ అయిపోయిన తర్వాత ఒక్కక్షణము వెనుకగానీ లేకుండా మనిషి అనగా జీవుడు దేవునియందు చేరిపోవును. ఇదే విషయమునే ఖురాన్ గ్రంథములో సూరా 7, ఆయత్ 34లో ఇలా చెప్పబడియున్నది చూడండి. **(7-34) "ప్రతి సమాజానికి ఒక గడువు నిర్ణయింపబడి యున్నది. వారి నిర్ణీత గడువు వచ్చినప్పుడు వారు ఒక్కక్షణము కూడా వెనక్కిగానీ, ముందుకుగానీ జరగడము సంభవము**

**కాదు."** ఇక్కడ ఈ వాక్యములో 'ప్రతి సమాజానికి' అని ఉన్నది. దాని అర్థము ప్రకారము **'ప్రతి తెగ జీవరాసులకు'** అని అర్థము. ముక్తి లేక విడుదల అను గడువు గలదు. ఎప్పుడు కర్మ అయిపోతుందో అదే వారికి నిర్ణయించబడిన గడువు. వారి నిర్ణీత గడువు వచ్చినప్పుడు ఎప్పుడు కర్మ అయిపోతే అప్పుడు ఒక్క క్షణము ముందు, ఒక్క క్షణము వెనుక కాకుండా ముక్తి చెందుదురని చెప్పారు.

హిందువులు ముక్తి కొరకు అనగా దేవునియందైక్యమగుటకు కొందరు యోగమును చేయువారు కూడా అరుదుగా యున్నారు. వారిని వదలి మిగతా వారిని చూస్తే చాలామంది ముక్తి పొందాలను ఉద్దేశ్యమున్నా, వారు దేవుని ప్రార్థనను యోగముగా చేయడము లేదు. యోగమును ఎలా ఆచరించవలెనో తెలియక దానికొరకు కొంతమంది గురువులను, లేక తెలిసిన జ్ఞానులను ఆశ్రయించుచున్నారు. గురువులవద్దకు పోతే వారు గురూపదేశమును చేయుచున్నారు. గురూపదేశము అను బోధలో యోగమును గురించి చెప్పక ఏదో ఒక మంత్రమునో, దృశ్యమునో ఉపదేశముగా ఇచ్చుచున్నారు. వారు ఇచ్చిన చెవులతో వినిన మంత్రమును గానీ, కంటితో చూచిన దృశ్యమునుగానీ స్మరించుతూ ధ్యానము చేయు చున్నారు. అలా ఇంద్రియ విషయమైన మంత్రమునో, దృశ్యమునో ధ్యానించడమును 'తపన' అంటున్నాము. దానినే **'తపస్సు'** అని కూడా అనవచ్చును. ప్రపంచ సంబంధ ఇంద్రియ ధ్యాసలను తపస్సు అని చెప్పవచ్చును. తపస్సు వలన దేవుడు లభించడు. తపస్సు వలన దేవున్ని తెలియుటకు శక్యము కాదు. తపస్సుల వలన సాధ్యము కాని దేవుడు యోగము వలన సాధ్యపడును. అందువలన గీటురాయి అయిన 'భగవద్గీతా గ్రంథము'లో ఆత్మ సంయమ యోగములో 46, 47వ శ్లోకములలో ఇలా చెప్పారు చూడండి.

శ్లో॥ 46. తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥

భావము :- **"యోగి అయినవాడు తపస్వికులకంటే ఉత్తముడు, జ్ఞానులకంటే అధికుడు, పనులు చేసి కర్మలను సంపాదించుకొను వారికంటే అధికుడు అయినందున నీవు యోగివే కావలెను."** అని చెప్పాడు. దీనినిబట్టి అన్ని విధముల యోగి అధికుడు అని తెలిసినందున యోగము వలననే దేవుడు లభించునని చెప్పుచున్నారు. ఈ విషయమును క్రింది 47వ శ్లోకమున చూడండి.

శ్లో॥ 47. యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్త రాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యోమాం సమేయుక్తతమో మతః ॥

భావము :- **"సర్వ యోగులందు సంపూర్ణముగా అంతరాత్మలో నన్నే ఆశ్రయించి, శ్రద్ధతో ఎవడు ప్రార్థించుచున్నాడో అతడు నాతో కలిసి యున్నాడని నేను తలంచుచున్నాను"** అని దేవుడే స్వయముగా ఈ శ్లోకములో చెప్పాడు. ఇక్కడ చెప్పిన రెండు శ్లోకములలో యోగము చేయుట వలన దేవునియందు కలియుటకు సాధ్యమగునని గీటురాయి ద్వారా తెలియుచున్నది. యోగము అనగా సూచనప్రాయముగా తెలిసినది. తపస్సు అనగా చెప్పడము ఏమి అంటే **శరీరమునకున్న ఇంద్రియ ధ్యాసలు కల్గి యుండడము తపస్సుగా** చెప్పబడుచున్నది. గురువులు ఉపదేశించు మంత్రములుగానీ, జ్ఞానులు చెప్పిన శ్లోకములనుగానీ రెండు చెవుల ద్వారా విననవగును. అలాగే గ్రంథములో చదివిన వాక్యములుగానీ, శ్లోకములను గానీ రెండు కన్నుల ద్వారా చూచినవగుచున్నవి. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. హిందువులు ఇంద్రియ సంబంధములయిన వాటిని అనగా కంటితో

చూచినవిగానీ, చెవితో విన్నవిగానీ మనస్సునందుంచుకొని దేవుని కొరకు ధ్యానించినా అది తపస్సు యగునుగానీ యోగము కాదు. దాని ప్రకారము హిందువులు చేయు జపములన్నీ తపములే (తపస్సులే) యగుచున్నవి. అట్లే క్రైస్థవులు నోటితో చెప్పు ప్రార్థనలన్నియూ తపస్సుల క్రిందికే జమ కట్టబడుచున్నవి. యోగములు అనుటకు అవకాశము లేదు. ఇకపోతే ముస్లీమ్‌లు చేయునది నమాజ్ అని పేరు కల్గియున్నా అది పూర్తి నమాజ్ కాదని వారి పెద్దలే హెచ్చరించి చెప్పారు. అది తపస్సు క్రిందికి వచ్చునని వారి భావము.

బయట ప్రపంచములో విశ్వాస జనులందరికోసము నియమిత సమయాలలో పాటించటానికి విధిగా నమాజ్ నియమింపబడినది. నిబద్ధతతో కూడుకొన్న నమాజ్ అనగా భయస్థితిలో చేయబడే నమాజ్ ఒక విధముగా కుదింపబడిన నమాజ్ అవుతుంది. కాబట్టి ఈ లోటును భర్తీ చేయడానికి నిలుచొని, కూర్చొని, ఇంకా పడుకొని ఉన్నప్పుడు సహితము అల్లాహ్‌ను స్మరిస్తూ ఉండాలని ఇక్కడ ప్రబోధించడము జరిగినది. దీనిని గురించి సూరా 4 ఆయత్ 103లో ఇలా చెప్పారు చూడండి. **(4-103) "ఇక నమాజ్‌ను పూర్తి చేసిన తర్వాత నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా, అల్లాహ్‌ను స్మరిస్తూ ఉండండి. శాంతి భద్రతలు నెలకొన్న తర్వాత నమాజ్‌ను స్థాపించండి. నిశ్చయముగా నమాజ్ విశ్వాసులకు నియమిత సమయాలలో పాటించటానికి విధిగా నిర్ణయించబడింది."** ఈ ఆయత్‌లో "నమాజ్ అయిన తర్వాత ఎక్కడున్నా ఎట్లుండినా పరుండినా, నిలుచుండినా, కూర్చున్నా దేవున్నే స్మరించుకొంటూ ఉండండి" అని చెప్పారు. అలా ఎందుకు చెప్పారు? అనగా సామూహికముగా, సమయ నియమముగా చేసిన నమాజ్

స్వతంత్రముగా చేసినది కాదని సమయమునకో, సమాజమునకో కట్టివేయబడిన నమాజ్ అని కొందరు ముస్లీమ్ పెద్దలే చెప్పుచున్నారు. ఈ ఆయత్‌కు పెద్దలు క్రింద వ్రాసిన వివరములో అలాగే చెప్పారు. మరియొక చోట మొదటనే ఫాతిహా సూరాలకు ముస్లీమ్ పండితులు వారి ఉద్దేశ్యములను చెప్పుచూ ఇలా అన్నారు.

**తౌహీదె ఉలూ హియత్** అంటే భావము ఇలాగయున్నది. అన్ని రకాల ఆరాధనలకు (ఇబాదత్‌లకు) దాస్యాలకు, వేడుకోల్లకు అర్హుడు అల్లాహ్ మాత్రమే (దేవుడు ఒక్కడే అర్హుడు). ఎవరయినా ఒక ప్రత్యేకమైన వ్యక్తి మెప్పుకోసం లేక దేవుని ఆరాధించకపోతే ఆయన కోపానికి గురి అవుతానేమోనని భయముతో చేసే ప్రతిపనీ ఆరాధనగానే భావింపబడినా, పైకి అందరూ దానిని ఆరాధన అనుకొనినా, అది దేవుని దృష్ఠిలో ఆరాధన కాదు. అందుచేత మనుషులు చేసే నమాజ్, రోజా, హజ్, జకాత్ వంటి క్రియలు మాత్రమే ఆరాధనలు కావు. ఒకానొక ప్రత్యేక అస్తిత్వం (నిరాకార దైవత్వము) ఎదుట అభ్యర్ధించుకోవడమే నిజమైన అభ్యర్ధన. దానినే అర్ధన మరియు ప్రార్ధన అందురు. అస్తిత్వము ఎదుట ఏ నియమ నిబంధన లేకుండా, సమయపాలన లేకుండా చేయడము నిజమైన ఆరాధన అవుతుంది. సమయ నియమముతో చేసే ఆరాధన కాలములో కుదించ బడిన ఆరాధన, నియమమునకు కట్టివేయబడిన ఆరాధనయని చెప్ప వచ్చును. అటువంటివి ఆరాధనలుగా చెప్పుకొన్నా, ఆరాధనలుగా కనిపించు చుండినా, వాస్తవముగా ఆరాధనలు కావనే చెప్పాలి.

అటువంటి ఆరాధనలు తపన క్రిందికి జమకట్టబడుట వలన అవి తపస్సులుగా పరిగణించబడుతాయి. దేవున్ని గురించి తపస్సు చేయడము, తపన పడడము మంచిదని అనుకొనుటకు వీలులేదు. ఒకమాటతోనో,

పాటతోనో, మంత్రముతోనో కట్టువేయబడిన దానిని ఉచ్ఛరించినా అది తపనయగును. ముస్లీమ్‌ల ప్రార్థనలో సమయము ముఖ్యము. ఫలానా సమయములో నమాజ్ (ప్రార్థన) చేయవలెనను నియమమును కల్గి యుందురు. అలా నియమముతో కూడుకొన్న నమాజ్ కట్టివేయబడిన నమాజ్ అనియూ, కుదింపబడిన నమాజ్ అనియూ కొందరు ముస్లీమ్ పెద్దలు చెప్పుచున్నారు. దానికి విరుగుడుగా **"తౌహీదె ఉలూహియత్"** ను చెప్పారు. దానిప్రకారము నమాజ్, జకాత్, రోజా, హజ్‌వంటి క్రియలు మాత్రమే ఆరాధనలు కావు అని చెప్పారు. **"నిజమైన ఆరాధన ఒకానొక అస్తిత్వము ఎదుట అర్థించడము"** అని ముస్లీమ్ పెద్దలే చెప్పినట్లు ఖురాన్ గ్రంథములో 'అల్ ఫాతిహా' సూరాను గురించిన వ్రాసిన వారే చెప్పారు. మమ్ములను అడిగితే 'నమాజ్' అను పదము యొక్క అర్థములో 'నాకు జన్మలు లేకుండా పోవడమని' అర్థము. దేవున్ని ఆ విధముగా కోరుకోవడమే నమాజ్‌లోని నిజమైన అర్థము. అలా కోరాలంటే ప్రార్థనా మందిరములలో సమయ పాలనలో చేయు నియమ నమాజ్ అందరితో కలిసి చేసిన పిమ్మట ఎక్కడుండినా, ఎట్లుండినా దేవున్ని నమాజ్ అర్థముతో కూడుకొన్న భావమును వ్యక్తము చేస్తూ దేవున్ని స్మరించుకోవలెనని చెప్పాము. అలా చేయమని అదే నిజమైన ఆరాధనయగునని 4వ సూరా 103వ ఆయత్‌లో కూడా చెప్పారు.

సమాజము కొరకు, విశ్వాసుల కొరకు సమయ పాలనతో కూడిన నమాజ్‌లు చేయమని అందులో తప్పులేదని మేము కూడా చెప్పుచున్నాము. అట్లు చేయడము వలన ఇతరులలో కూడా దేవుని మీద విశ్వాసమును పెంచినట్లగును. ఆ విధమైన సామూహిక నమాజ్ చేసిన తర్వాత **"ఏకాంత నమాజ్"** చేయవలెను. అదే నిజమైన నమాజ్ అగుట వలన మసీద్‌లో మీ

ప్రార్థన అయిన తర్వాత ఇమాం గారు చదువుతున్న వచనములు వినుచున్నట్లు నటిస్తూ, మీరు మీ మనస్సులో అంతరంగ రహస్యమున నున్న దేవున్ని (ఆత్మను) ప్రార్థన చేయమని కొందరు ముస్లీమ్ పెద్దలు చెప్పిన మాటలను వినవలసియున్నది. అంతేకాక సూరా 4, ఆయత్ 103లో **"మసీద్‌లో నమాజ్ అయిన తర్వాత నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా దేవున్నే స్మరించండి"** అని చెప్పడము వలన అల్లాహ్ నమాజ్ తర్వాత ఏకాంతముగా అంతరంగములో చేయు ప్రార్థనే గొప్పదని తన ఆయత్‌లో చెప్పినట్లయినది. అందువలన ఇటు పెద్దలమాట, (4-103) ప్రకారము అటు అల్లాహ్ (దేవుని) మాటను ఆలకించితే, ముస్లీమ్‌లందరూ ఏదయితే నమాజ్ అని చేయుచున్నారో అది నిజమైన ప్రార్థన కాదనీ, అది పేరుకు మాత్రమే ప్రార్థనయని దానివలన ఫలితముండదని, పెద్దలు చెప్పిన (తౌహీదె ఉలూ హియత్) వాక్యము ప్రకారము మరియు (4-103) ఆయత్ ప్రకారము తెలియుచున్నది.

**ప్రశ్న :- ప్రార్థనామందిరములలో చేయు ప్రార్థన పేరుకు మాత్రమే ప్రార్థన అయితే, మీరు చెప్పినదే నిజమైన ప్రార్థన అయితే ఇంతవరకు ఆ విషయమును ఖురాన్ గ్రంథములో దేవుడు ఒక్క ఆయత్‌లో తప్ప మిగతా ఆయత్‌లలో ఎక్కడా చెప్పలేదే! (4-103) లో ఒకచోట చెప్పిన దానివలన అది మాకు సరిగా అర్థము కాలేదు. మిగతా చోట్ల ఎక్కడయినా చెప్పాడా?**

**జవాబు :-** అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో ముతషాబిహాత్ (సూక్ష్మమైన) జ్ఞాన వాక్యములు చాలా కలవు. ముస్లీమ్‌లు చాలామంది సూక్ష్మ విషయములను కూడా స్థూల విషయములుగా చెప్పుకొనుట వలన దేవుడు చెప్పిన భావములు తెలియకుండా పోయాయి. సూక్ష్మ విషయములు

దేవునికే తెలుసుయని, మనుషులుగా యున్నవారు సూక్ష్మ విషయములను చెప్పలేరనీ జ్ఞానులయిన మనుషులు చెప్పిన వారి మాటలను కూడా విననందున చాలా విషయములు ముస్లీమ్‌లకు తెలియకుండా పోయాయి. **ఖురాన్ గ్రంథములో సూక్ష్మమైన వాక్యములున్నాయని అల్లాహ్‌యే సూరా 3, ఆయత్ 7లో చెప్పడమైనది.** ముస్లీమ్‌లకు కూడా తమ గ్రంథములో సూక్ష్మమైన వాక్యములు మనుషులకు అర్థము కాని వాక్యములు ఉన్నాయని తెలుసు. తెలిసికూడా అవి ఏవియనిగానీ, వాటి వివరము ఏమియనిగానీ ఎవరయినా జ్ఞానుల వలన తెలుసుకొందామనిగానీ అనుకోవడము లేదు. ఆ విషయములు దేవునికి ఒక్కనికే తెలుసు మనుషులకు తెలియదని చెప్పు చుందురు. దేవుడు మనుషుల రూపములోనే తెలియజేయునని వారికి తెలియదు. ఆ మాటను వారు నమ్మను కూడా నమ్మరు. వారు నమ్మినా నమ్మకపోయినా, దేవుడు అనేక సంశయములకు మనుషులనుండియే జవాబు ఇచ్చుచుండును. దేవుడు మనుషుల హృదయములనుండి ఇచ్చు జవాబుల ద్వారా నేను ఎన్నో విషయములను తెలియగలిగాను. ముస్లీమ్‌లు నమ్మినా నమ్మకపోయినా, నేను మాత్రము సరియైన సమాధానమును తెలియజేయుదును.

**ప్రశ్న :- దేవుని జ్ఞానము దేవునికి తప్ప మనుషులకు తెలియదని ఖురాన్ గ్రంథములో సూరా 3, ఆయత్ 7లో వ్రాసియున్నారు కదా! అలాంటప్పుడు నీకెలా తెలియగలిగింది?**

**జవాబు :-** మీ ప్రశ్నకు జవాబుగా సూరా 2, ఆయత్ 186 నుండి చూడ వచ్చును. **(2-186) "నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే నేను వారికి అతి సమీపములో యున్నానని చెప్పు. పిలిచేవాడు**

**నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపును విని జవాబిస్తాను. కాబట్టి వారు సరైన మార్గము పొందటానికి నా ఆజ్ఞను అనుసరించాలి. మరియు నాయందు విశ్వాసము కలిగి యుండాలి"** అని చెప్పు. ఈ వాక్యమును చూస్తే "నన్ను అడిగేవారు ప్రత్యేకముగా యున్నారు. వారు అడిగినప్పుడల్లా వారి మాటలను విని వారికి జవాబిస్తాను" అని చెప్పియున్నాడు. నేను చెప్పిన మాటను ఇతడు విని వాడు సరైన మార్గమును పొందవచ్చునని దేవుడే చెప్పియున్నాడు. అలాంటప్పుడు వివరము తెలియని సూక్ష్మ వాక్యములకు అర్థమును ఇతరుల నుండి ఎందుకు తెలియకూడదు? దేవుడు 'నేను జవాబిస్తాను' అని అన్నప్పుడు కూడా వినని వానికి ఎప్పటికీ ఏమీ తెలియదు. అందువలన తెలిసిన జ్ఞానులు దేవున్ని అడిగి తెలుసుకొన్న జ్ఞానుల గుండా కొన్ని సూక్ష్మ విషయములను తెలుసుకొంటారు.

సూరా 2 ఆయత్ 3లో ఇలా యున్నది చూడండి. **(2-3) "ఎవరయితే అగోచర యదార్థ విషయాన్ని విశ్వసిస్తారో, నమాజును స్థాపిస్తారో, మరియు మేము ప్రసాదించిన జీవనోపాధి నుండి మా మార్గములో ఖర్చు చేస్తారో"** ఈ వచనములో సూక్ష్మ విషయాలను ఇతరులు చెప్పినా వినమని అనడము ముస్లీమ్‌లలో సాధారణ విషయమై పోయినది. ఇలా కాకుండా "ఎవరయితే అగోచర యదార్థ విషయాన్ని విశ్వసిస్తారో" అని ఈ వాక్యములో చెప్పారు. అంతేకాక "ఎవరయితే నమాజును స్థాపిస్తారో" అని చెప్పియున్నారు. అంతేకాక "నేను ప్రసాదించిన జీవనోపాధినుండి నా మార్గములో ఖర్చు చేస్తారో" అని యుంది. ఇక్కడ చెప్పిన వాక్యములోని విషయములన్నియూ సూక్ష్మమైన

విషయములే. స్థూల భావముగా చెప్పుకొంటే దేవుడు చెప్పిన అసలయిన భావము తెలియకుండా పోవును. అందువలన ఈ వాక్యములను సూక్ష్మముగానే చెప్పుకోవలెను. ముందుగా 'మేము ప్రసాదించిన జీవనోపాధి నుండి మా మార్గములో ఎవడు ఖర్చు చేస్తాడో' అను దానికి స్థూలముగా, సూక్ష్మముగా రెండు విధములా అర్థము చెప్పుకోవచ్చును. స్థూలముగా అర్థము కనిపించునట్లే యున్నది. సూక్ష్మముగా చెప్పుకొంటే ఇలా గలదు. "దేవుడు మనిషికి 'జీవ జలమును' ఇచ్చాడు" అని బైబిలు గ్రంథములో గలదు. **'జీవ జలము' అనగా 'దైవజ్ఞానము'** అని అర్థము. ఆ విధముగా చెప్పుకొంటే దేవుడిచ్చిన జీవనోపాధి జ్ఞానమని అర్థము చేసుకోవలెను. దేవుడిచ్చిన జ్ఞానమును దేవుని మార్గములోని వారికి వివరము చెప్పి ఎవరయితే ఉపయోగిస్తారో అని చెప్పుచూ దానిని 'నేనిచ్చిన జీవనోపాధిని నా మార్గములో ఖర్చు చేయువారు' అని అన్నాడు. 'నా మార్గము' అనగా 'దేవుని మార్గము' అని తెలియవలెను. 'అగోచర యదార్థ విషయాన్ని' అనగా 'కనిపించని సూక్ష్మ విషయాన్ని' అని అర్థము. 'నమాజును స్థాపిస్తాడో' అనగా 'జన్మలు లేకుండాపోవలెనను' ఉద్దేశ్యమును తెలియజేసే ప్రార్థనను ఎవడు తెలియజేస్తాడోయని అర్థము.

'పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు' అనగా **'నా మీద శ్రద్ధయుండి ఎవడు నన్ను జవాబు కొరకు అర్థించుచున్నాడో అటువంటివాని పిలుపును విని వానికి జవాబు ఇస్తాను'** అని పై (2-186)వ వాక్యములో గలదు. 'నేను వానికి అతిసమీపములో యున్నానని' వాక్యములో చెప్పడమైనది. ఇది సూక్ష్మమైన వాక్యము అందువలన స్థూలముగా అర్థము చేసుకోకూడదు. అతి సమీపమునయున్నా కనిపించనివాడు ఆత్మ. దేవుడు ఎవరితోనూ మాట్లాడువాడు కాడు. ఆయన సాక్షిభూతుడే. మాట్లాడువాడు దేవుని

కార్యములను మరియు జీవుని కార్యములను చేయువాడు ఆత్మయే. ఆత్మకు పరమాత్మ జ్ఞానము సంపూర్ణముగా తెలియుట వలన దైవమార్గములో సక్రమముగా నడువటానికి ఆత్మ యొక్క మాటను వినవలసిందే. అందువలన ఆత్మ సరియైన మార్గము పొందటానికి 'నా ఆజ్ఞను అనుసరించ వలసిందేయని' చెప్పాడు. అంతేకాక దేవునియందున్న విశ్వాసమువలె ఆత్మ మీద కూడాకలిగి యుండాలి. దేవుడు ఏమీ చేయువాడు కాడు. ఆత్మే అన్నీ చేయువాడు, అన్నీ తెలుపువాడని విశ్వాసము కల్గియుండాలి అని చెప్పాడు. పై వచనములో చెప్పిన మాటలనుబట్టి అక్కడ అగోచరమైన ఆత్మ మీద విశ్వాసముకల్గి యున్నప్పుడు ఖురాన్ గ్రంథములోని ఏ సూక్ష్మవాక్యము యొక్క వివరమయినా సులభముగా తెలియవచ్చును. దేవునికి తప్ప ఎవరికీ తెలియదనీ, సూక్ష్మ విషయములను వదలు వానికీ, అర్థము కొరకు వెదకని వానికీ ఇతర జ్ఞానుల వలన తెలియు అవకాశమును పోగొట్టుకొన్నట్లేయని చెప్పవచ్చును. (2-186) ఆయత్ ప్రకారము వాని లోపల, వానికి సమీపమున యున్న ఆత్మ, రహస్య వాక్యముల అర్థమును చెప్పగలదు.

చావు పుట్టుకలు ఏ మనిషికీ తెలియని అగోచర విషయములుగా యున్నవి. 'మనిషి చనిపోయి పుట్టును' అను విషయమును ముస్లీమ్‌లు ఏమాత్రము నమ్మడము లేదు. మొదటినుండి వారి పెద్దలు అలా బోధించారు, అందువలన వారు మనిషి చనిపోయి తిరిగి పుట్టునంటే నమ్మకున్నారు. ద్వితీయ దైవ గ్రంథమున ఇంజీలులో (బైబిలులో) యోహాన్ సువార్త మూడవ అధ్యాయములో 7, 8 వచనములలో ఇలా చెప్పారు చూడండి. **(7) మీరు క్రొత్తగా జన్మింపవలెనని నేను నీతో చెప్పినందుకు ఆశ్చర్యపడవద్దు. (8) గాలి తనకిష్టమైన చోటను విసరును. నీవు**

**దాని శబ్దము వింటువేగాని, అది ఎక్కడినుండి వచ్చునో ఎక్కడికి పోవునో నీకు తెలియదు. ఆత్మ మూలముగా జన్మించిన ప్రతి వాడును అలాగే యున్నాడనెను"** ద్వితీయ దైవ గ్రంథమున చెప్పిన ఈ మాటలు జన్మలున్నాయని ధృవపరుస్తున్నవి. గాలి ఎక్కడినుండి వచ్చుచున్నదో, ఎక్కడికి పోవుచున్నదో తెలియనట్లు, గాలి శబ్దమును మాత్రము వినువారు గాలియున్నదని తెలిసినా, దాని రాకపోకలు తెలియ నట్లు, మనిషి జన్మించియున్నట్లు తెలిసినా అతడు ఎక్కడనుండి వచ్చి పుట్టాడో, ఎక్కడికి పోతున్నాడో తెలియదన్నాడు. అందువలన జన్మల విషయము చాలామంది నమ్మకుండా యున్నారు అని చెప్పాడు. ఆత్మ మూలముగా జన్మించిన ప్రతివాడు అలాగే యున్నాడని (జన్మలు కల్గి యున్నాడని) చెప్పి, అయినా **'మా సాక్ష్యమును మీరంగీకరింపరని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. భూలోక సంబంధమైన సంగతులు నేను మీతో చెప్పితే మీరు నమ్మకున్నప్పుడు పరలోక సంబంధమైనవి మీతో చెప్పిన ఎడల ఎలాగు నమ్ముదురు?'** అని 11, 12 వాక్యములలో చెప్పాడు. దీనినంతటినీ చూస్తే చాలామంది మనిషి యొక్క పునర్జన్మలను నమ్మడము లేదని తెలియుచున్నది.

ఎవడయితే కనిపించని అగోచర విషయములను విశ్వసిస్తాడో వాడు నేను చెప్పు కనిపించని నమాజ్‌ను విశ్వసిస్తాడు. నాకు జన్మలు లేవు అను స్థితికి చేరుకోవడమే నమాజ్ అని తెలియగల్గుతాడు. నేను జన్మించని వానిగా ఉండవలెనంటే, ఇప్పుడు జన్మించి యున్న నేను నమాజ్‌ను చేరుకోవాలి. ఇది నమాజ్ అని తెలియపరుస్తూ, దానిని చేరుకొనుటకు చేయు సాధనను ఎవడు చూపగలడో, వాడు భూమిమీద నమాజ్‌ను స్థాపించినట్లు. అంతవరకు భూమిమీద నమాజ్ పేరున్నా దాని స్థాపన,

దాని ఆచరణ లేనట్లే. దాని ఉద్దేశ్యమే లేనప్పుడు, అనగా నాకు జన్మలు లేని స్థితి కావలెనను నమాజ్ ఉద్దేశ్యమే మనుషలలో లేనప్పుడు, దానిని స్థాపించువాడు ఎవడూ లేనట్లే కదా! అప్పుడు అర్థముతో కూడుకొన్న నమాజ్ (ప్రార్థన) లేనట్లే కదా! ఇప్పుడు నేను సూటిగా మనిషిని ప్రశ్నించుచున్నాను. "ఓ మనిషీ! నీకు నమాజ్ అంటే తెలుసా? ఓ మనిషీ! నీవు నమాజ్‌ను ఒకమారైనా నీ జీవితములో చేశావా? నీవు చెప్పుకొను నమాజ్, నీవు ఆచరించు నమాజ్ నీ ప్రభువైన అల్లాహ్ వద్దకు (దేవునివద్దకు) చేర్చుతుందా? చేర్చగలదని మీరు మీ హృదయము మీద చేయి వేసుకొని చెప్పగలరా? నీవు ప్రార్థన పేరుతో నీ దేవున్ని పొగడుచున్నావు. ఆయన (దేవుడు) ఎంత గొప్పవాడో ఆయనకు తెలియదా? నీవు పొగడితేనే ఆయన గొప్పతనము ఆయనకు తెలియగలదా? దేవుడు తనను పొగడమని చెప్పాడా? తన సామ్రాజ్యములో సీటును అడుగుకొమ్మన్నాడా? లేదా, నీవు దేవుని సన్నిధానమును అడుగుచున్నావా? లేదు. దేవున్ని పొగడుచున్నావని నీకే తెలియుచున్నది. **దేవుడు పొగడ్తలకు లొంగడు. దేవున్ని ఆయన సన్నిధానమును గురించి అడుగుకొంటే దానిని నీకు ప్రసాదించగలడు. అంతేగానీ పొగడే వానిని నమ్మడు.**

నమాజ్‌ను నెలకొల్పండియని ఖురాన్ గ్రంథములో చాలామార్లు చెప్పాడు. దానినిబట్టి ప్రస్తుతము 'నమాజ్' అనునది లేదనియేగా అర్థము. ఇంటిని నిర్మించండి అంటే ఇల్లు లేదు, ఇల్లును తయారు చేయమనేగా అర్థము. నమాజ్‌ను నెలకొల్పండి అని దేవుడే చెప్పినప్పుడు నమాజ్ భూమిమీద లేదు దానిని మీరు చేయండనే కదా! అర్థము. నేడు చాలామంది 'నమాజ్' అను పేరుతో చేయు ప్రార్థనలు దేవునిలోనికి ఐక్యమగుటకు కాదని, నమాజ్ ఆచరణ హిందువుల తపస్సును పోలియున్నదనీ, నమాజ్ వలన స్వర్గము లభించగలదుగానీ పరలోకము (మోక్షము) లభించదని

తెలియుచున్నది. నమాజ్‌లో పరలోకమును లేక మోక్షమును, లేక దేవునిలోనికి ఐక్యమగు విధానమును అర్థించడము లేనేలేదు. నమాజ్ చేయు ప్రతి వారికి వారి ఉద్దేశ్యములో దేవునిలోనికి చేరిపోవాలని. తర్వాత జన్మలకు రాకూడదను భావమే లేదు. అందువలన మనుషులు చేయునది ప్రార్థన అనిపించుకొన్నా నిజమైన అర్థముతో కూడిన నమాజ్ అనిపించు కోదు. అన్ని విధములా మూడు మతముల వారు చేయు ఆరాధనలలో 'ప్రార్థన' అను అంశమున్నా, అది పూర్తి సార్థకతతో కూడుకొన్నదిగా, దేవునిలోనికి చేరి తిరిగి పుట్టకూడదను ఉద్దేశ్యముతో చేయునిదిగా లేకుండడము వలన ప్రతి మనిషి, ప్రతి మతస్థుడు ప్రార్థన విషయములో పునః పరిశీలించుకోవాలని తెలుపుచున్నాము. మీరు దేవుని మార్గములో ముందుకు పోవాలను ఉద్దేశ్యముతో మిమ్ములను నొప్పించి చెప్పవలసి వచ్చినది. **'బుద్ధి చెప్పువాడు గుద్ది చెప్పును'** అను పెద్దల సామెత ప్రకారము మీకు మంచిని చెప్పుటకు నేను చెడుగా కనిపించినా ఫరవాలేదని భావించి చెప్పడమైనది.

## <u>మా గ్రంథము గొప్ప</u>

ప్రశ్న :- **మేము ముస్లీమ్‌లతో కొన్ని ఆధ్యాత్మిక విషయములను చర్చించగా వారు వినకపోగా మాది అంతిమ దైవగ్రంథము, ఇది లేనప్పుడు ఇంతకు ముందున్న గ్రంథములను అనుసరించాలి. ఇది వచ్చిన తర్వాత పాత గ్రంథములతో ఇక పనిలేదు. ఇదే చివరి గ్రంథము కావున అందరూ దీని ప్రకారమే నడువవలెను. దేవుడు ఆ గ్రంథములను వదలిపెట్టండని ఈ చివరి గ్రంథమును పంపాడు. దేవుడిచ్చిన చివరి గ్రంథము ప్రకారమే అందరూ నడుచుకోవాలని అంటున్నారు. దీనిని గురించి వారు చెప్పు మాట నిజమేనా? మీరేమంటారు?**

**జవాబు :-** మేము కూడా చాలాచోట్ల ఇదే విషయమునే విన్నాము. ముస్లీమ్‌లలో బోధకులయిన వారే ఆ విధముగా చెప్పుచుండగా సాధారణ ముస్లీమ్‌లు వారినే అనుసరించుచున్నారు. ఖురాన్ గ్రంథమునకు **'అంతిమ దైవగ్రంథము'** అను పేరు వచ్చినది వాస్తవమే. అందువలన మేము ఖురాన్ గ్రంథమును ఎక్కువగా అంతిమ దైవగ్రంథమనియే పిలుస్తూ ఉంటాము. ముందు వచ్చిన రెండు గ్రంథములను కాదని ఈ గ్రంథమునే చూడమని దేవుడు ఖురాన్ గ్రంథములోగానీ, మిగతా రెండు గ్రంథములలోగానీ ఎక్కడా చెప్పలేదు. ఇదే ఖురాన్ గ్రంథములో సూరా 5, ఆయత్ 48లో ఇలాగున్నది చూడండి. **(5-48) "మేము మీవైపుకు ఈ ఖురాన్ గ్రంథాన్ని సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తనకన్నా ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరిస్తుంది. నీ వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరింపకు"** ఇక్కడ ఈ వాక్యమును గమనించితే ముస్లీమ్‌లు ఖురాన్ గ్రంథమే అన్ని గ్రంథముల కంటే గొప్పదియని చెప్పినట్లు ఖురాన్ గ్రంథములో ఎక్కడా లేదు. అయినా వారు ఎందుకు అలా చెప్పుచున్నారనగా దానికి ఒకే ఒక కారణము మతము. 'నా మతము' అనునదే అంతగా అసత్యమును చెప్పించుచున్నది. ఇటువంటివారు తయారవుతారను ఉద్దేశ్యముతోనే దేవుడు ముందే తన ఖురాన్ గ్రంథములో (5-48) ఆయత్‌ను చెప్పియున్నాడు. ఈ ఆయత్ (వాక్యము)లో **'ఖురాన్‌కంటే ముందు వచ్చిన గ్రంథములను సత్యమని ధృవీకరించుచున్నది'** అని ప్రత్యేకముగా చెప్పియున్నా దేవుని మాటను కాదని ఖురాన్ ముందర భగవద్గీతగానీ, బైబిలుగానీ పనికి రాదు. ఈ గ్రంథము రానప్పుడు ఆ గ్రంథముల అవసరముండేది. ఇది వచ్చిన తర్వాత వాటి అవసరము లేదని చెప్పుచున్నారు. అంతిమ దైవగ్రంథము

వచ్చిన తర్వాత  ముందు వచ్చిన రెండు గ్రంథములు దీనిక్రింద పడి పోయాయి.  ఆ రెండు గ్రంథములకంటే ఉన్నతమైన జ్ఞానమును ఈ గ్రంథములో దేవుడిచ్చాడు.  అందువలన అందరికీ ఆధారము ఖురాన్ గ్రంథమే అంటున్నారు.  అందరూ ఖురాన్ గ్రంథమును అనుసరించ వలసిందేయని అంటున్నారు.  ఆ మాట నిజమేనేమోయని  వారి మాటను నమ్మి తమ మతములను వదలి ఇస్లామ్ మతమును స్వీకరించిన వారు కూడా కలరు.  ఈ మాటలన్నియూ మతప్రచారమునకేయని తెలిసి పోవుచున్నది.  వారు చెప్పిన ఒక్కమాట కూడా ఖురాన్ గ్రంథములో లేదు. ఖురాన్ దైవగ్రంథము, అటువంటి గ్రంథములో మతమునకు సంబంధించిన మాటలే లేవు. (5-48) వ వాక్యములో **"ఖురాన్ తనకంటే ముందు వచ్చిన గ్రంథములను సత్యమని ధృవీకరించుచున్నది, సాక్ష్యమిచ్చుచున్నదియని"** చెప్పియుండగా,  వీరు చెప్పు మాటలన్ని అసత్యములు కాదా! అందువలన ఈ ఆయత్ చివరిలో ఇలా అన్నాడు.  **"నీవద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరింపకు"** అని కలదు. నీ వద్దకు వచ్చిన సత్యము అనగా  నీవు హిందువువైతే నీవద్దకు వచ్చిన సత్యము **ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతయని** గుర్తుంచుకో, ఒకవేళ నీవు క్రైస్థవునివైతే  నీకు దేవుడు ఇచ్చిన గ్రంథము **ద్వితీయ దైవగ్రంథము బైబిలు.**  ముస్లీమ్ అయితే నీ గ్రంథము **అంతిమ దైవగ్రంథము ఖురాన్.** ఈ మూడు నీవున్న మతమునుబట్టి నీ దగ్గరకు వచ్చిన సత్యములనీ, సత్యగ్రంథములని గుర్తించుకో.  నీవు ఏ మతస్థుడవయినా  నీ గ్రంథము ఏదో నీకు తెలుసు కదా!  అలాంటప్పుడు ఇతర మతస్థులు వచ్చి  'నీ దగ్గరకు వచ్చిన సత్య గ్రంథమును కాదని, వారి వద్దయున్న గ్రంథమే సత్యమైనదని' చెప్పితే  వారి మాటలను నీవు వినవద్దు అని చెప్పుచూ  "నీ

వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరించకు” అని దేవుడే చెప్పాడు.

దేవుడు మనుషులనందరినీ ఒక్క మతముగా పుట్టించవలయునని తలచియుంటే అలాగే పుట్టించేవాడు. అయితే దేవుడు అలా చేయలేదు. ఎవరి మతములో వారుండుటకు వారికి ధర్మ శాసనమయిన గ్రంథమును ఇచ్చి దాని ప్రకారమే జీవించమన్నాడు. అలాగని ధర్మాలు వేరుగా లేవు **దేవుడు ఒక్కడే, ధర్మము ఒక్కటే.** అన్ని మతములలో ఒకే ధర్మమున్నా దానిని చెప్పడము వేరుగాయుండడము వలన వేరు మత ధర్మమని మనుషులు అనుకొన్నారు. ఒకే ధర్మమును మూడు రకములుగా చెప్పవచ్చును. అప్పుడు ఆ ధర్మమును మూడు వేరువేరు మతములదని చెప్పవచ్చునా? ఒకే మాటను మూడు విధములుగా చెప్పవచ్చును. అప్పుడు ఆ మాట మూడు వేరువేరు జాతులదని చెప్పవచ్చునా? ఒకే మాటను ముందు వెనుక పదములను మార్చి చెప్పవచ్చును. అలాగే భావమును వేరే మాటలలో చెప్పవచ్చును. పదములను ముందు వెనుకల మార్చి చెప్పినా ఒక్కటే, భావమును వేరే మాటలలో చెప్పినా ఒక్కటే. ఉదాహరణకు ఒకే భావమున్న మూడు రకముల మాటలను చూస్తాము.

| | | | |
|---|---|---|---|
| **నా** | **ఆరోగ్యము** | **బాగా** | **ఉన్నది.** |
| **బాగా** | **వుంది** | **నా** | **ఆరోగ్యము.** |
| **నాకు** | **ఏ** | **రోగము** | **లేదు.** |

ఈ మూడు మాటలు వేరువేరుగా కనిపించినా ఒకే భావమును కల్గియున్నవి. అంతేగానీ వీటిని మూడు మతములకు చెందిన మూడు వేరువేరు వాక్యములని చెప్పుటకు వీలులేదు కదా! అట్లే దేవుని ధర్మము

మూడు రకములుగా చెప్పినా అది ఒక్కటే భావమును కల్గియుండును. అంతేగానీ భావములో మార్పుయుండదు. ఒకే ధర్మమును మూడు విధముల కన్పించునట్లు చెప్పినా, దేవుడు ఒక్కడే ఆయన ధర్మము ఒక్కటేయని తెలియవలెను. అట్లు తెలియలేనివారు మా మతధర్మము వేరు, వారి మతధర్మము వేరనీ, మిగతా మత ధర్మములకంటే మా మతధర్మమే ఉత్తమమైనదని చెప్పుకొనుచుందురు. వారి మాటలను నమ్మవద్దని ఖురాన్ గ్రంథములో చెప్పినట్లు ఇంతవరకు చూచాము.

(5-48) వాక్యములో ఇంకా కొంత వ్రాయబడియున్నది. **"మీలో ప్రతి ఒక్క సంఘానికి ఒక ధర్మ శాసనాన్ని మరియు ఒక జీవన మార్గాన్ని నియమించియున్నాము. ఒకవేళ అల్లాహ్ తలచుకొంటే మిమ్ములను అంతా ఒకే ఒక సంఘముగా రూపొందించి యుండేవాడు. కానీ మీకు ఇచ్చిన దానితో (ధర్మముతో) మిమ్ములను పరీక్షించటానికి అలా చేశాడు. కావున మీరు మంచి పనులు చేయుటలో ఒకరితో ఒకరు పోటీ పడండి. అల్లాహ్ దగ్గరకే మీరంతా పోవలసియున్నది. అప్పుడు ఆయన మీకున్న భేదాభిప్రాయములను గురించి మీకు తెలియజేస్తాడు"** అని వాక్యములో గలదు. మూడు మతములలో నిన్ను ఏ మతములో పుట్టించాలో ఆ మతములోనే దేవుడు పుట్టించాడు. దేవుడు మూడు మతములు లేకుండా ఒకే మతముగా అందరినీ పుట్టించాలనుకొనియుంటే భూమిమీద మతము లేకుండా చేసేవాడు. అయితే మీకు ఇచ్చిన మతధర్మముతోనే మీరు జీవించటానికి మార్గాన్ని కల్పించాడు. మిమ్ములను మీకిచ్చిన ధర్మములోనే మెలగమన్నాడు. అట్లు కాకుండా భేదాభి

ప్రాయములను చూపు వానిని దేవునివద్దకు పోయినప్పుడు వాని తప్పును అప్పుడు చూపును. ఇప్పుడు మతముల మధ్య భేదములను చూపిన వానికి తగిన శిక్ష దేవుని తీర్పులో యుండును. ఈ విషయమును 5-48 ఆయత్‌లో అందరికీ అర్థమగులాగున చెప్పియున్నా, అదియూ ఖురాన్ గ్రంథములోనే చెప్పియున్నా ముస్లీమ్‌లు మా అంతిమ దైవగ్రంథమే మిగతా గ్రంథములకంటే గొప్పదియనీ, మా మతము గొప్పదియనీ, మీ మతములను వదలి మా మతములో చేరండని చెప్పడమును చూస్తే వారు మా గ్రంథమని చెప్పుకొను ఖురాన్ గ్రంథమునే చదువలేదని తెలియుచున్నది. ఒకవేళ వారు ఖురాన్ గ్రంథమును చదివియుంటే మా గ్రంథము గొప్పయనీ, మా మతము గొప్పయనీ వారు చెప్పరు. చనిపోయిన తర్వాత దేవుని తీర్పు కఠినముగా యుంటుందని తెలియనివారే అలా చెప్పుచుందురు. అలా చెప్పు వారికి వారి గ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 5-48 ఆయత్‌ను చదవమని చెప్పండి.

## గగన యాత్ర (మేరాజ్)

**ప్రశ్న :- ముస్లీమ్‌లు ఐదు పూటల నమాజ్ చేయుచుందురు. అందరూ చేయకున్నా కొందరు విధిగా ఐదుపూటల నమాజ్ చేయుచుందురు. వారి ప్రార్థన (నమాజ్) ఐదుపూటల చేయవలెనని చెప్పుచుందురు. దానికి ఏమయినా కారణము కలదా?**

**జవాబు :-** హిందువులలో పురాణగాథలున్నట్లు, ఆ గాథలలో ఎందరో దేవతలున్నట్లు, ఆ దేవతలు వరములో లేక శాపములో ఇచ్చువారున్నట్లు, ఆ దేవతల శాపము తీరుటకు ఇన్ని యజ్ఞములు చేయాలనో లేక వరములు నెరవేరుటకు ఇన్ని దినములు తపస్సు చేయాలనో చెప్పినట్లు, అలాగే

శాపగ్రస్తులు తమ శాపములు లేకుండా పోవుటకు యజ్ఞములను చేసినట్లు లేక వరముల కొరకు తపములు చేసినట్లు, ముస్లీమ్‌లలో కూడా ఐదు నమాజులకు ఒక పురాణ కథలాంటి దానిని చెప్పారు. దానినే ముహమ్మద్ ప్రవక్తగారి "గగన యాత్ర" లేక "మేరాజ్" అని పేరు పెట్టి చెప్పారు.

హజరత్ ముహమ్మద్ (సఅసం) గారు ప్రవక్త అయి 10 సంవత్సరాలు గడిచాయి. ఈ పది సంవత్సరాలు కూడా వారు ధర్మ ప్రచారానికే వినియోగించారు. ఎన్ని కష్టాలొచ్చినా ధైర్యంగా ఎదుర్కొంటూ ముందుకు సాగిపోయారు. కాని జనాబ్ అబూతాలిబ్, బీబీ ఖతీజా (రజి) గార్ల మరణాలు ప్రవక్త (సఅసం) గారికి చాలా బాధను కలిగించాయి. తాయఫ్ వారు పెట్టిన కష్టాలు వారి బాధను ఇంకా ఎక్కువ చేశాయి. జనాబ్ అబూతాలిబ్, బీబీ ఖతీజా (రజి) గార్లు మరణించిన సంవత్సరమునకు ప్రవక్త (సఅసం) శోక సంవత్సరం (అముల్ హుజ్న్) గా అభివర్ణించారు.

అదే సంవత్సరం ఒకనాటి రాత్రి ముహమ్మద్ (సఅసం) దైవ నామస్మరణ తరువాత, కాబతుల్లా వద్ద నిద్రించారు. ఇంకా వారికి పూర్తిగా నిద్దర పట్టలేదు. అంతలో జిబ్రీల్ దూత 'బురాఖ్' అనే స్వర్గవాహనంతో ప్రత్యక్షమై వారిని మేలుకొలిపి, దైవ ఆహ్వానాన్ని అందజేశారు. తరువాత ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ను 'జమ్‌జమ్' బావివద్దకు తోడుకొనిపోయి, అక్కడ పడుకోబెట్టి వారి రొమ్మును ఛేదించి, హృదయశుద్ధి గావించి, అందులో దివ్య జ్ఞానజ్యోతిని నింపి, యధావిధి గావించారు. ఆ తరువాత 'బురాఖ్' నెక్కి తన్ను వెంబడించ వలసిందిగా జిబ్రీల్ దూత ప్రవక్తను కోరారు. ముహమ్మద్ ప్రవక్త (సఅసం) 'బురాఖ్' నెక్కి 'జిబ్రీల్' (అ) వెంట 'జెరూషలేమ్' బయలు దేరారు. దారిలో వారు 'యస్‌రబ్' 'మదయీన్' 'సినాయి'లలో కాసేపాగుతూ 'జెరూషలేమ్' లోని 'బైతుల్ ముఖద్దస్' చేరుకున్నారు.

అక్కడొక పెద్ద జన సమూహం ప్రవక్త (సఅసం) రాకకై ఎదురు చూస్తుండింది. వారు వచ్చిన వెంటనే ఆ జనసమూహమంతా బారులు తీరి నిలబడింది. 'జిబ్రీల్' దూత ముహమ్మద్ (సఅసం) ను 'ఇమామ్' స్థానములో నిలబెట్టి ప్రార్థనను నిర్వహించవలసిందిగా కోరారు. వారి అభ్యర్థన మేరకు మహాప్రవక్త (సఅసం) రెండు రకాల నమాజును నిర్వహించారు. అందరూ మహాప్రవక్త గారి నాయకత్వాన ప్రార్థనను ముగించారు. తర్వాత జిబ్రీల్ దూత "రసూలుల్లా! మీ వెనుక ప్రార్థనను సలిపిన వారందరూ ఎవరో తెలుసా? వీరందరు వెనుకటి దైవప్రవక్తలు. ఈనాడు వారందరికీ మీరు నాయకులయ్యారన్న మాట. దాన్ని నిరూపించ టానికే దేవుడు ఈ ఏర్పాటును గావించాడు" అని తెలియజేశారు. ఆ మాటలు విన్న మహా ప్రవక్త చాలా సంతోషించారు. ఆ తర్వాత ముహమ్మద్ ప్రవక్త 'బురాఖ్' నెక్కి 'జిబ్రీల్' వెంట గగన ప్రయాణమును సాగించారు.

ప్రయాణము మెరపులాగా సాగిపోతున్నది. ఆకాశవీధిలో ఒకచోట బాగా సింగారించుకున్న ఓ సుందరాంగి ఎదురై, మహాప్రవక్త (సఅసం) ను సైగ చేసి పిలిచింది. కానీ వారామెవైపు చూడకుండానే ముందుకు సాగి పోయారు. అది గమనించిన జిబ్రీల్ దూత ముసిముసి నవ్వుతో 'రసూలుల్లా! మీరామె వైపు చూడకపోవటం చాలా మంచిదైంది. లేకుంటే మీ ఉమ్మతీలందరూ ఆమె ప్రభావానికిలోనై యుండేవారు" అని వివరించారు. ఆ మాటలను విన్న మహాప్రవక్త (సఅసం) "ఈమె ఎవరూ?" అని ప్రశ్నించారు. "ఈమె ప్రపంచానికొక చిహ్నము. మానవులనందరినీ తనవైపు మళ్ళించుకొనే స్వభావమామెకుంది. ఆమె వ్యామోహానికి లోను కానివారు ధన్యులౌతారు" అని జిబ్రీల్ (అ) సమాధానమిచ్చారు. అలా కొంత దూరం వెళ్ళిన తరువాత చేతికర్ర సహాయముతో నడుస్తున్న ఓ

ముసలమ్మ ఎదురై తనవైపు రావలసిందిగా ప్రవక్త (సఅసం) ను కోరింది. కానీ వారామె పిలుపును కూడా ఖాతరు చెయ్యక ముందుకు సాగిపోయారు. "జిబ్రీల్! ఈ ముసలమ్మ ఎవరూ?" అని ప్రవక్త ప్రశ్నించారు. దానికి సమాధానంగా "ఈమె కూడా ప్రపంచానికి మరొక చిహ్నం, ఈమె వయస్సును బట్టి ప్రపంచము యొక్క ఆయువు ఇంకా ఎంత మిగిలివున్నది ఊహించుకోవచ్చు." అని జిబ్రీల్ వివరించారు. మరి కొంతదూరం వెళ్ళిన తరువాత ఓ యువకుడు ఎదురై తన వద్దకొచ్చి పోవలసిందిగా ప్రవక్త (సఅసం) ను కోరాడు. కాని మహాప్రవక్త (సఅసం) అతని వైపు చూడకుండానే తమ ప్రయాణమును కొనసాగించారు. "ఈ యువకుడెవడు?" అని ప్రవక్త జిబ్రీల్ దూతను ప్రశ్నించారు. "ఇతడు మానవులనందరిని పెడదారిని పట్టిస్తున్న షైతాన్" అని జిబ్రీల్ దూత ప్రవక్త (సఅసం) కు సమాధానమిచ్చారు.

ప్రయాణం అతివేగంగా సాగింది. ఇక ఇరువురూ మొదటి ఆకాశమును చేరుకున్నారు. జిబ్రీల్ దూత ఆకాశ ద్వారమును తెరువ వలసిందిగా దర్బాన్ (ద్వారపాలకుడు)ను కోరారు. దర్బాన్ తలుపులను తెరిచాడు. మహా ప్రవక్త మొదటి ఆకాశంపై అడుగు పెట్టారు. వెంటనే వారి దృష్టి ఎదురుగా కూర్చొనివున్న మహాపురుషునిపై పడింది. వారి ముఖము తేజోవంతంగా ప్రకాశిస్తున్నది. వారికిరువైపులా పెద్ద జన సమూహం కూర్చొని వుంది. కానీ వారు తమ కుడివైపునున్న వారిని చూచి సంతోషిస్తుండడం, ఎడమవైపునున్న వారిని చూచి బాధపడుతుండడం మహాప్రవక్త గమనించి "జిబ్రీల్! ఎవరీ మహానుభావుడు? ఏమిటీ వింత దృశ్యం?" అని ప్రశ్నించారు. అందుకు జిబ్రీల్ దూత "రసూలుల్లా! వీరు మీ తండ్రిగారైన హజరత్ ఆదం (అ) వారికిరువైపులా వున్న వారు వారి

సంతానం. కుడివైపునున్న వారు పుణ్యాత్ములు. ఎడమ వైపునున్న వారు పాపాత్ములు. పుణ్యాత్ములైన తమ సంతానాన్ని చూచి ఆనందించడం, పాపాత్ములైన వారిని చూచి బాధపడడం జరుగుతున్నది" అని వివరించారు. తర్వాత ఇరువురూ హజరత్ ఆదం వద్దకెళ్లారు. ముహమ్మద్ ప్రవక్తను, జిబ్రీల్ దూత ఆదం అలైహిస్సలాంకు పరిచయం చేశారు. ఆదిమానవులైన హజరత్ ఆదం అలైహిస్సలాం ముహమ్మద్ ప్రవక్తకు మహానందంతో స్వాగత మిచ్చి గౌరవించారు.

తరువాత ఆదం అలైహిస్సలామ్‌తో సెలవు తీసికొని, ఇరువురూ రెండవ ఆకాశమును చేరుకున్నారు. రెండవ ఆకాశంపై ముహమ్మద్ ప్రవక్త (సఅసం) హజరత్ 'ఈసా' (అ), హజరత్ 'ఎహ్యా' (అ) ప్రవక్తలను కలుసుకున్నారు.

ఆ పిదప మూడో ఆకాశము పైకి తీసుకువెళ్ళడం జరిగింది. అక్కడ ఆయన (స) హ్రజత్ యూసుఫ్ (అ.స.) ను చూసి సలామ్ చేశారు. ఆయనకు జవాబుగా ప్రతి సలాము చేస్తూ ఆయనకు శుభాకాంక్షలు తెలిపి ఆయన (స) గారి దైవదౌత్యాన్ని ధృవీకరించారు.

ఆ తరువాత ఆయన్ను (స) నాల్గో ఆకాశము పైకి తీసుకొని వెళ్ళడం జరిగింది. అక్కడ దైవప్రవక్త (స) ఇద్రీస్ (అ.స.) ను చూసి సలామ్ పలికారు. జవాబుగా ఇద్రీస్ (అ.స) ప్రతి సలాము చేస్తూ ఆయనకు శుభాకాంక్షలు తెలుపుతూ ఆయన (స) దైవదౌత్యాన్ని ధృవీకరించారు.

ఆపై అయిదో ఆకాశానికి వెళ్ళగా, అక్కడ ఆయన (స) హ్రజత్ హారూన్ బిన్ ఇమ్రాన్ (అ.స.)ను చూశారు. ఆయనకు సలామ్ అందించారు. జవాబుగా హారూన్ (అ.స.) ప్రతి సలాము చేస్తూ శుభాకాంక్షల్ని అందజేస్తూ ఆయన (స) దైవదౌత్యాన్ని ధృవపరిచారు.

దైవప్రవక్త (స)ను ఆరవ ఆకాశం పైకి గొనిపోగా, అక్కడ ఆయన (స) హజ్రత్ మూసా బిన్ ఇమ్రాన్ (అ.స)ను చూడడం జరిగింది. ఆయనకు సలాము అందించగా ప్రతి సలాము చేస్తూ మర్హబా అని శుభాకాంక్షల్ని అందించారు. మహాప్రవక్త (స) గారి దైవదౌత్యాన్ని ధృవపర్చడం జరిగింది. అయితే, ఆయన ముందుకు నడువగా మూసా (అ.స) ఏడ్వనారంభించారు. మీరెందుకు ఏడుస్తున్నారని ప్రవక్త (స) అడుగగా, ఆయన, "నా తరువాత ఓ యువకుడు ప్రభవింపజేయబడ్డాడు. అతని సమాజం, నా సమాజం కంటే సంఖ్యలో అధికంగా ఉండి స్వర్గ ప్రవేశం చేస్తుంది. ఆ కారణంగా నాకు ఏడుపు ఆగలేదు" అని అన్నారు.

అంతలో ముహమ్మద్ ప్రవక్త (సఅసం) కు, స్వర్గం (జన్నత్) నర్కం (దోజఖ్) లను చూపించవలసిందిగా జిబ్రీల్ దూతకు దైవాదేశం అయింది. దైవాదేశం మేరకు జిబ్రీల్ దూత మహాప్రవక్త (సఅసం)ను మొదట దోజఖ్ వద్దకు పిలుచుకొని పోయి, పాపాత్ములనుభవిస్తున్న శిక్షలను చూపించారు. నరక బాధలనుభవిస్తున్న జనులను చూచి మహాప్రవక్త చాలా బాధపడ్డారు. తరువాత ఇరువురు జన్నత్ వద్దకెళ్ళారు. స్వర్గలోకములో పుణ్యాత్ములను భవిస్తున్న సౌఖ్యాలను చూచి మహాప్రవక్త (సఅసం) చాలా ఆనందించారు.

ఆ తరువాత అక్కడనుండి బయలుదేరి 'సిద్ రతుల్ మున్తహా' అనే సరిహద్దును చేరుకున్నారు. జిబ్రీల్ దూత ఆ సరిహద్దు వద్దనే ఆగిపోతూ "రసూలుల్లా! ఇక్కడినుండి నేను ఒక అడుగు కూడా ముందుకు వేయలేను. అంతటి శక్తి నాకు లేదు. అసలు ఇంతవరకు ఈ హద్దును దాటి ఎవ్వరేగానీ వెళ్ళలేదు. ఆ శక్తి దేవుడు మీకొక్కరికే ప్రసాదించాడు. ఇక మీరు ముందుకు వెళ్ళవచ్చు" అని తెలియజేశారు.

మహాప్రవక్త 'సిద్‌రతుల్ మున్‌తహా' నుండి 'రఫ్‌రఫ్' అనే మరొక వాహనంపై పయనించి దేవుని ఆస్థానము (అర్ష్)ను చేరుకున్నారు. సర్వ లోకాలకు ప్రభువైన అల్లాహ్ తన ప్రవక్తను సలామ్ చేసి ఆహ్వానించాడు. ఎన్నో అద్భుతాలను, మహిమలను చూపించి ఆనందపరిచాడు. ఈ సందర్భములో అతిముఖ్యమైన కొన్ని ఆదేశాలను కూడా దేవుడు వారికంద జేశాడు. ఇదే సందర్భములో 50 పూటల నమాజ్‌ను కూడా ఫరజ్ (విధి) గావించాడు. ఆ తరువాత మహాప్రవక్త దేవునితో సెలవు తీసుకొని మహ దానందంతో భూలోకానికి తిరుగు ప్రయాణమయ్యారు.

హజరత్ మూసా (అ) ఎదురై దేవుని ఆస్థాన విశేషాలను వివరించ వలసిందిగా కోరారు. ముహమ్మద్ ప్రవక్త (సఅసం) జరిగినదంతా వారితో వివరించారు. ముహమ్మదు (సఅసం) కు లభించిన ఔన్నత్యానికి మూసా (అ) ఆశ్చర్యబోయారు. తరువాత మహాప్రవక్త (సఅసం) తో "ఆర్యా! మీ ఉమ్మతీలు 50 పూటల నమాజును సలుపలేరు. బనీ ఇస్రాయీలతో నాకున్న అనుభవము కొద్ది మీకు చెపుతున్నాను. వెళ్ళి అల్లాహ్‌ను అర్థించి, నమాజు సంఖ్యను తగ్గించుకోండి" అని సలహానిచ్చారు. మూసా ప్రవక్త (అ.స) సలహా మేరకు ముహమ్మద్ ప్రవక్త (సఅసం) అల్లాహ్ సన్నిధిన చేరి నమాజు సంఖ్యను తగ్గించవలసిందిగా అభ్యర్థించారు. ప్రవక్త అభ్యర్థన మేరకు దేవుడు నమాజు సంఖ్యను సగానికి తగ్గించాడు. నమాజు సంఖ్య తగ్గించుకొని మహాప్రవక్త తిరుగు ప్రయాణమయ్యారు. కానీ వారికి మూసా ప్రవక్త (అ.స) మరలా ఎదురై "25 పూటల నమాజును కూడా మీ ఉమ్మతీలకు బరువే. వెళ్ళి ఇంకా తగ్గించుకోండి" అని సలహా యిచ్చారు. అలా కొన్నిసార్లు జరిగింది. తుదకు ఐదు పూటల నమాజు మాత్రమే ఫరజ్ గావించబడింది. ఈ ఐదు పూటల నమాజ్‌కు పదంతల పుణ్యము ఒసంగబడుననే వాగ్దానము కూడా వారికి లభించింది.

ఇక మహాప్రవక్త (సఅసం), మహానందముతో బురాఖ్‌పై ప్రయాణం చేసి మక్కాకు తిరిగి వచ్చేశారు. ఇదంతా కేవలం ఆ రాత్రిలోని ఒక ఘడియ లోనే జరిగిపోయింది.

తెల్లవారిన తర్వాత మహాప్రవక్త (సఅసం) తమ గగన యానమును గురించి సహాబీల కెరుక పరిచారు. సహాబీలందరూ ఎట్టి సంకోచము లేకుండా విశ్వసించడమేగాక, మహాప్రవక్తకు మేరాజ్ వంటి ఔన్నత్యంను ప్రసాదించినందులకు దేవునికి కృతజ్ఞతల నర్పించారు.

ఇది ముస్లీమ్‌లలో ప్రాకియున్న కథ. ఒక విధముగా ఇదంతయూ దాదాపు అరగంట కాలము లేక అంతకంటే తక్కువ సమయములో ఒక దిన రాత్రి స్వప్నములో జరిగిన సంఘటనగా యున్నది. జాగ్రత్తలో (మెలుకువలో) అయినా, స్వప్నములో అయినా దేవుని ఆదేశము జ్ఞాపకము వుంటే తప్పక ఆచరించవలసిందే. అందువలన దైవాదేశము ప్రకారము నేడు **ఐదుపూటల నమాజ్‌ను (ప్రార్థనను)** ఆచరించడము గొప్ప కార్యమే యగును. దేవుని ఆజ్ఞ మీద ఎంత గొప్ప నమ్మకమున్నదో ఇందుమూలముగా తెలియుచున్నది. ఇతర మతములలో లేని ప్రార్థనా విధానమును చూచి ప్రశంసనీయవలసిందే. ఈ ఒక్క ప్రార్థనలోనే మిగతా వారికంటే దేవుని మార్గములో ముస్లీమ్‌లు చాలా దగ్గరగా యున్నారని చెప్పవచ్చును. ముహ్మమద్ ప్రవక్తగారు ఐదుమార్లు విధిగా ఆచరించడమును చూచిన మిగతా ముస్లీమ్‌లందరూ అదే విధానమును అనుసరించారు. ప్రవక్తగారి ప్రకారము దినమునకు ఐదుమార్లు నమాజ్ ఎందుకు చేయాలి? అను ప్రశ్నకు వారు మేరాజ్ (గగన యాత్ర) కథను చెప్పుచున్నారు.

ముస్లీమ్‌లు ఐదు నమాజ్‌లకు కారణమును చెప్పిన విధానములో అనగా ముహమ్మద్ ప్రవక్తగారు గగనయాత్ర చేసినప్పుడు జరిగిన

సమాచారములో **నాలుగు** అనుమానాలు వచ్చాయి. **ఒకటి,** ఏడు ఆకాశాల విషయములో అనుమానము వచ్చినది. ఏడు ఆకాశములు పైన లేవు అవి మన శరీరములోనే ఉన్నాయని మేమే చాలామందికి నిరూపణగా చెప్పాము. అంతేకాక ఖురాన్ గ్రంథములో **సూరా 2, ఆయత్ 186లో 'దేవుడు నీకు అత్యంత సమీపమున ఉన్నాడు. నీవు చెప్పే ప్రతిమాటను వింటున్నాడు'** అని ఉన్నది. అలాంటప్పుడు ఎక్కడో పైన ఏడు ఆకాశములనడములో అనుమానము వచ్చినది. **రెండు,** రెండవ ఆకాశములో ఈసా (ఏసు) ఉన్నాడని చెప్పడము కూడా అనుమానము వచ్చినది. ఏసు దేవుని అవతారములలో రెండవ అవతారమని కొన్ని నిదర్శనములతో సహా నేనే చెప్పియుండడము వలన కొంత అనుమానము రావడము జరిగినది. **మూడు,** ఆరవ ఆకాశములో మూసా ప్రవక్త యున్నాడని చెప్పారు. మూసా ప్రవక్త ఉండడమేకాక ముహమ్మద్ ప్రవక్తను చూచి ఏడ్చాడని చదివాము. ముహమ్మద్ ప్రవక్తను చూచి మూసా అసూయతో ఏడ్చినట్లు నాకు అర్థమయి నది. అది కూడా ఒక అనుమానమే! మూసా ప్రవక్త మహాజ్ఞానిగాయుండి ఎందుకు ఏడ్చాడు? అను సంశయము ఏర్పడుచున్నది. చివరి **నాల్గవ** అనుమానములో సాక్ష్యాత్తు అల్లాహ్ ఏడవ ఆకాశములో ఉండడము, అల్లాహ్ ప్రవక్తగారికి సలామ్ చేయడము చదివాను. అల్లాహ్‌కు అందరు సలామ్ చేయవలెను గానీ అల్లాహ్‌యే సలామ్ చేయడమేమిటి?యని అనుమానము వచ్చినది. ఈ అనుమానములను తీర్చుటకు ముస్లీమ్ పెద్దలనే అడగాలనుకొన్నాను.

ఒక దినము జమాయాతె ఇస్లామ్ తెగకు సంబంధించిన ఒక ముస్లీమ్ పెద్దను అడిగాను. అతన్ని అడిగితే మొదటికే మోసము అన్నట్లు

అతను **"మేరాజ్ (గగన యాత్ర) అనునది జరుగలేదు. అల్లాహ్ అనేకమార్లు నమాజ్‌లను గురించి తగ్గించి చెప్పలేదు. అల్లా మాట్లాడాడు అంటే అది తప్పు అవుతుంది. అల్లాహ్ ఏ మనుషులతో మాట్లాడడు, అల్లాహ్ మాట్లాడడు అని ఖురాన్ గ్రంథములోనే (3-7) లో చెప్పబడియున్నది. ఐదు నమాజులు ముస్లీమ్‌లు విధిగా చేయవలెననునది వాస్తవమే అయినా అది అల్లాహ్ చెప్పినది కాదు. ఖురాన్ గ్రంథమును జిబ్రయేల్ చెప్పినప్పుడే జిబ్రయేల్ గారే ఐదు నమాజ్‌ల విషయము చెప్పియుంటాడు. అది తెలియక ఐదు నమాజుల విషయమును ఒక కథలాగ అల్లి ప్రవక్తగారు గగన యాత్ర చేసినట్లు, జిబ్రయేల్ తీసుకపోయినట్లు వ్రాశారు. అది అల్లిన కథయేగానీ జరిగిన వాస్తవము కాదు. మేరాజ్ (గగన యాత్ర) మీద మాకు కూడా సంశయమే, అయితే మేము ముస్లీమ్ మతములోవుండి ఇటువంటి అనుమానములు వెలిబుచ్చకూడదు. నాలోయున్న సత్యమును నేను చెప్పాను. అంతకంటే నాకు ఎక్కువగా ఏమీ తెలియదు. వేరే ముస్లీమ్‌లను అడిగినా, నేను చెప్పినది కూడా చెప్పరు. మేరాజ్ కథయే నిజమంటారు"** అని చెప్పాడు.

ఆ మాటలు విన్న తర్వాత సత్యమును తెలియాలను కుతూహలము ఎక్కువయినది. అప్పుడు ఖురాన్ గ్రంథములో సూరా రెండు, ఆయత్ 186లో అల్లాహ్ (దేవుడు) చెప్పిన విషయము జ్ఞాపకము రావడము జరిగినది. అందులో **"దేవుడు నీకు అత్యంత సమీపమున యున్నాడు. నీలోని ప్రతి మాటను వింటున్నాడు. అలాగే వాడు అడిగితే వారికి జవాబిస్తాను"** అని ఉండడము వలన నా ప్రశ్నకు జవాబు తప్పక దొరుకుతుంది అను నమ్మకముండేది. అయితే ఈ మధ్య ఒకరోజు నేను వ్రాసిన **"నిగూఢ తత్వార్థ బోధిని"** అను గ్రంథమును తెరచి చూడడము

జరిగినది. అందులో గ్రంథము తెరుస్తూనే ఒక పద్యము కనిపించినది. వేమన వ్రాసిన ఆ పద్యమునకు ఎవరూ వ్రాయని విధముగా అర్థమును నేనే వ్రాశాను. ఆ పద్యమును చూస్తూనే మేరాజ్ (గగన యాత్రలో) నున్న సంశయములన్నియూ ఒక్కమారు తీరిపోయినవి. అప్పుడు ఖురాన్ గ్రంథములో (2-186) లో యున్న వాక్యము తిరిగి గుర్తుకొచ్చినది. నీ ప్రశ్నకు జవాబు దొరికిందా!యన్నట్లు ఖురాన్‌లోని ఆ వాక్యము గుర్తు రావడము ఆశ్చర్యమయినది. అప్పుడు దేవుడు మనుషులకు జ్ఞానమును ఎలా అయినా తెలియజేస్తాడు అని తెలిసినది. ఆ గ్రంథములో నాకు కనిపించిన పద్యము దానికున్న భావమును క్రింద తెల్పుచున్నాను చూడండి.

అయిదు వర్ణములనె యఖిలంబు తెలిసిన
నయిదునందు ముక్తి యమరియుండు
నయిదులోన నున్న యతడెపో యఖిలము
విశ్వదాభిరామ వినుర వేమా.

**భావము :-** ప్రకృతి అయిన పంచభూతములచే నిర్మింపబడిన శరీరమందే అఖిల జీవరాసులకు అధిపతియైన ఆత్మను తెలియవలయును. పంచభూత నిర్మాణ శరీరమునకు బయట ఎంత వెదకిన అఖిల జీవులకు కారణమైన వాడు తెలియడు. పంచభూతములచే పంచీకరణ చెందిన శరీరమునందు మూల పురుషుడైన ఆత్మను తెలిసిన, శరీరము బయట పంచభూతములలో అణువణువునా వ్యాపించి ఉన్న పరమాత్మను తెలియనగును. కావున "అయిదు వర్ణములనె అఖిలంబు తెలిసిన అయిదునందు ముక్తి అమరి ఉండు" అన్నారు.

శరీరాంతర్గతమున సర్వజీవులకు కారణమైన ఆత్మను తెలిసిన, శరీరము బయట ఉన్న అయిదు భాగములైన పంచభూతములలో వ్యాపించిన వాడు తెలియును. బయట అయిదు భాగములందు ఇమిడి ఉన్న పరమాత్మయే సర్వమునకు కారణము. అందువలన 'అయిదులోనున్న అతడెపో అఖిలము' అన్నారు. అయిదు వర్ణములను శరీరముగా తెలిపి మిగతా అయిదు భాగములను శరీర బయట పంచభూతములుగా తెలియ వలయును. పూసల మధ్యలో పూసలకు ఆధారమై ఉన్న దారము కనిపించనట్లు, పంచభూతములలోనే కనిపించక వ్యాపించి ఉన్నవాడు పరమాత్మని తెలియవలయును.

పద్యమును చూచారు కదా! ఒకప్పుడు ఈ పద్యమునకు మరియు కష్టమైన అనేక వేమన పద్యములకు వివరమును వ్రాసిన వాడిని నేనే అయినా అది ఐదుపూటల నమాజ్ విషయములో జ్ఞానమును అందిస్తుందని అనుకోలేదు. ఇప్పుడు సమయానికి ఐదుపూటల నమాజుకు జ్ఞానమును అందించినది. అంతేకాక మేము వ్రాసిన **"ఆత్మలింగార్థము"** అను గ్రంథములోని "పంచతత్త్వములను పంచీకరించక" అను పద్యము కూడా జ్ఞప్తికి రావడము జరిగినది. ఆ పద్యము కూడా నా ప్రశ్నలకు జవాబులు దొరకడములో సహాయమునందిచినట్లయినది. క్రింద ఆ పద్యమును, దాని భావమును చూడండి.

పంచతత్త్వములను పంచీకరించక
మంచియతుల మన్న మాటలన్న
కుంచమందు గజము గ్రుడ్డు పెట్టిన విధంబు
అఖిల జీవసంగ ఆత్మలింగ.

**భావము :-** సమస్త శరీరములలో నాశనమగు జీవాత్మతో కలిసి నివాసము చేయుచున్న నాశనము కాని ఓ ఆత్మా! వినుము. పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఎట్లు సృష్టించబడినవీ, అవి ఒక్కొక్కటి ఏ విధముగా ఐదు భాగములుగా విభజింపబడినదీ, అలా విభజింపబడిన 25 భాగములు ఒకదానితో మరొకటి కలిసి ఎలా శరీర భాగములుగా ఏర్పడినది తెలియడమే సాంఖ్యము అంటాము. పంచతత్త్వములను పంచీకరించి సాంఖ్యమును తెలియనివారు మరియు శరీరములోని ఆత్మ తన శక్తిచేత శరీర భాగములను ఎలా పనిచేయించుచున్నది తెలియకనే మేము జ్ఞానులమని అనుకొంటే, గంపక్రింద ఏనుగు గ్రుడ్డు పెట్టినట్లుండు నంట. ఏనుగును గొలుసులుతో బంధించి గంపక్రింద నిలబెట్టినప్పటికీ అది గ్రుడ్డు పెట్టదు. దీనినిబట్టి చూస్తే ఏనుగు గంప క్రింద గ్రుడ్డు పెట్టడము ఎంత అబద్ధమో, అలాగే శరీర అవయవముల వివరము తెలియనివాడు జ్ఞాని అనుట కూడా అంతే అబద్ధమగును.

ఈ విధముగా ఐదుకు సంబంధించిన ఆధ్యాత్మికమంతయూ జ్ఞాపకము రాగా తర్వాత భగవద్గీతయందలి క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగమున 24వ శ్లోకము గుర్తుకు వచ్చినది. దానితో ఐదు పూటల నమాజును గురించిన సంశయములన్నియూ తీరిపోయినవి. క్రింద శ్లోకమును చూడండి.

శ్లో॥ 24. య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోపి నస భూయోభిజాయతే ॥

**భావము :-** "పంచభూతముల ప్రకృతిని, ఒకడే అయిన పురుషున్ని విశధముగ తెలియగలిగి, ప్రకృతి గుణములను బాగా తెలియగల్గితే సదా వర్తించు వాడయినా వానికి కర్మలంటవు, జన్మలుండవు."

ఈ శ్లోకమును దాని భావమును భగవద్గీతలో గీటురాయిగా కనిపించినది. గీటురాయి ద్వారా దేనియందైనా జ్ఞానమును, అజ్ఞానమును తెలియవచ్చును. ఈ విధముగా ఒక్కొక్కటి ఐదుకు సంబంధించిన అనగా ప్రకృతికి సంబంధించిన జ్ఞానమంతయు జ్ఞాపకము రాగా, చివరగా పంచ అక్షరమైన **"ఓం"** జ్ఞాపకము వచ్చినది. పంచ అనగా ఐదు భాగములుగా యున్న ప్రకృతి. అక్షరము అనగా నాశనము కాని ఆత్మయని చెప్పవచ్చును. పంచాక్షరియనగా ప్రకృతికి నాశనము కానిదని అర్థము. పంచ భూతములుగా యున్న ప్రకృతికి నాశనము కానిది అక్షరుడు, అక్షరున్నే ఆత్మయని అంటున్నాము. పంచభూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదుకు జీవుడు నాశనమగుచున్నాడు. అందువలన **జీవున్ని క్షరుడు** అని అంటున్నాము. పంచభూతములకు నాశనముకాని వానిని దేవుడు అని అనవచ్చును లేక ఆత్మయని కూడా అనవచ్చును. సర్వజీవరాశులకు చావుపుట్టుకలను ఈ ఐదు భాగములుగాయున్న ప్రకృతియే చేయుచుండును. దానికి కారణభూతుడుగా మరియు సాక్షి భూతుడుగా దేవుడుండును. ఈ విషయమును భగవద్గీతలో విజ్ఞాన యోగమున ఆరవ శ్లోకమున చెప్పియున్నారు, చూడండి.

శ్లో॥ 6 : *ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ ।*
*అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా ॥*

**భావము :–** " సర్వ జీవరాశులకు జన్మను ఈ ప్రకృతియే చేయుచుండును. నేను జీవరాశుల చావుపుట్టుకలకు కారణముగాయున్నాను. కార్యముగా ఐదు భాగములుగా యున్న ప్రకృతియేనని తెలియవలెను."

పంచభూతముల ప్రకృతికి నాశనముకాని వానిని గురించి అనగా ఆత్మకు గుర్తుగా లేక దైవమునకు గుర్తుగా **"ఓం"** అను అక్షరమును శబ్ద రూపమైన దానిని గుర్తుగా పెట్టుకొన్నాము. అలాగే పంచభూతములకు అనగా జీవులను నాశనము చేయు ప్రకృతి భాగములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను వాటికి ఒక్కొక్క దానికి ఒక్కొక్క శబ్దరూపమైన అక్షరమును గుర్తుగా ఉంచుకొన్నాము. పంచ భూతములకు పంచ (ఐదు) గుర్తులు గలవు. అవి వరుసగా ఇట్లు గలవు.

**ఆకాశమునకు - న**

**గాలి - మః**

**అగ్ని - శి**

**నీరు - వా**

**భూమి - య**

ఐదుకు నాశనము కాని వాడు ఆత్మ (అక్షరుడు)కు గుర్తు "ఓం". ఈ విధముగా చెప్పుకొంటే ఐదుకు నాశనము కాని వానిని పంచాక్షరి అంటున్నాము. పంచ+అక్షరి=ఐదుకు నాశనము కానిది ఆత్మయని అర్థము. దానినే **"ఓం నమః శివాయ"** అని అంటున్నాము. ఐదు భూతములను విభజించి ఆకాశమునకు నాశనము కానివాడు ఆత్మయనీ, గాలికి నాశనము కానివాడు ఆత్మయనీ, ఇట్లు మిగతా మూడింటికి నాశనము కానివాడు ఆత్మయని చెప్పుచూ, ఆయనకు నా ప్రార్థనయని చెప్పుచున్నాము. దానిని

ఆచరణలో **ఆకాశమునకు నాశనముకాని వానికి ఇదే నా ప్రార్థనయని తెల్లవారక ముందే ప్రార్థన మొదలిడి, తర్వాత గాలికి నాశనముకాని వాడయిన దైవమునకు నా ప్రార్థనయని రెండవ ప్రార్థన, అగ్నికి నాశనము కాని వానికి నా ప్రార్థనయని మూడవ ప్రార్థన. నీరుకు నాశనముగాని ఆత్మకు ప్రార్థనయని నాల్గవ ప్రార్థన, అట్లే భూమికి నాశనముగాని అక్షర పురుషునికి నా ప్రార్థనయని ఐదవ ప్రార్థన చేయడము మొదట కృత యుగములోనే ఉండేది.** కృతయుగమునుండి ద్వాపరయుగము వరకు మతములు లేవు. ఇందూసమాజము ఒక్కటే యుండేది. ఇందూ సమాజములో మొదట కృతయుగములో ఐదు ప్రార్థనలుండేవి. యజ్ఞములు, వేదాధ్యయణములు, తపస్సులు ఉండేవి కావు. శబ్ద, రూప, స్పర్శలు లేని ఏకాగ్రత చింతన తప్ప ఏమీ ఉండేవికావు. ప్రకృతికి అతీతుడైన దేవున్ని ఐదు భాగములుగా యున్న ప్రకృతి చేత పూజించుచున్నామని ఐదుమార్లు ఏకాగ్రతతో యుండేవారు. ఏకాగ్రతను విడదీసి చూస్తే ఏక+అగ్రత= ఏకాగ్రత. ఏక అనగా ఒక్కటియని అగ్రత అనగా ఒకటికంటే ముందుది, లేక ఒకటిపైన ఉండేది సున్నాయని లేక శూన్యముయని అర్థము. శూన్యమైన మనస్సు కల్గియుండడమే ఆనాటి ప్రార్థన. మనస్సులో ఏ చింత, ఏ జ్ఞాపకము లేకుండాయుండడమును **ఏకాగ్రత ప్రార్థన లేక ఏకాంత ప్రార్థన** అని అనెడివారు. ఆ విధముగా రోజుకు ఐదుమార్లు ఏకాగ్రత ప్రార్థన చేయడము కృతయుగములోని జ్ఞానములో ఉండేది. కాల గమనమున ఏకాగ్రత ప్రార్థన, ఐదుమార్లు ప్రార్థన లేకుండా పోయినది.

కృతయుగములో ప్రాతఃకాల ప్రార్థనతో మొదలయి సూర్యాస్తమ యము లోపలే ఐదు ప్రార్థనలు చేసెడివారు. తెల్లవారక మునుపే ఒక

ప్రార్థన తర్వాత నాలుగు ప్రార్థనలు పగలు చేసెడివారు. అది ఆనాటి ఇందువుల ప్రార్థనలుగా ఉండేవి. తర్వాత అవి పోయి వాటి స్థానములో యజ్ఞ, దాన, వేద, తపస్సులు వచ్చినవి. ఏకాగ్ర ప్రార్థనే లేకుండా పోయినది. కృతయుగములో ఐదు ఆరాధనలు సూర్యుని ద్వారా వచ్చినవేయని అంతకుముందు అవి లేవని తెలియుచున్నది. సాధారణ మనుషులు కూడా ఆ రోజులలో ఐదు ఆరాధనలు చేసెడివారు. సూర్యుడు ఆదియందు మనువుకు చెప్పిన జ్ఞానములో **బ్రహ్మయోగము, కర్మయోగము, భక్తియోగము** ను గురించి చెప్పాడు. మొదటిదయిన బ్రహ్మయోగమునే ఆ రోజు ఐదుమార్లు చేసెడివారు. ఐదు బాహ్యేంద్రియములను అణచివేసి చేసెడి ప్రార్థనకు బ్రహ్మయోగము అని పేరు పెట్టబడినది. ఐదు జ్ఞానేంద్రియముల సంబంధము లేకుండా చేయు యోగము ఐదుమార్లు చేయడము కృతయుగములో ఉండేది. అప్పుడు బ్రహ్మయోగమును గురించి చెప్పిన వాడు సూర్యుడే. అదే సూర్యుడే కలియుగములో ముహమ్మద్ ప్రవక్తగారికి జిబ్రయేల్ అను పేరుతో జ్ఞానమును చెప్పడమైనది. అప్పుడు తాను పూర్వము చెప్పిన బ్రహ్మయోగమునే చెప్పాడు. పూర్వము ఐదుమార్లు చేయమని చెప్పినది ఇప్పటి జిబ్రయేల్ కనుక ఇప్పుడు కూడా అదే విషయమును చెప్పినట్లు అర్థమగుచున్నది. అయితే ఐదుపూటల ప్రార్థనను చేయుచున్నా ఐదు జ్ఞానేంద్రియములకు సంబంధము లేకుండా చేయడము లేదు. అందువలన ప్రార్థనలోని అసలయిన విషయముగానీ, అర్థముగానీ తెలియకుండా పోయినది. అందువలన నేడు చేయుచున్న ప్రార్థన తపస్సు క్రిందికి జమకట్టబడుచున్నది. యోగము క్రిందికి జమకట్టబడలేదు. సూర్యుడే కృతయుగములో మనువుకు, కలియుగములో ముహమ్మద్ ప్రవక్తకు

జ్ఞానమును చెప్పడమైనది. అయితే జిబ్రయేల్‌యే సూర్యుడని, సూర్యుడే జిబ్రయేల్‌యని ఎవరికీ తెలియదు. సూర్యుడు జిబ్రయేల్ ఒక్కటేయని నాకు ముందే తెలుసు, కావున ఐదు పూటల నమాజ్ విషయము సూర్యుడు చెప్పినదేయని తెలిసి పోయినది. అయితే పూర్వమున్న ఏకాగ్రత నేటి ప్రార్థనలో లేకుండా పోయినది. ఇంత విన్న తర్వాత మేము మీ మాట వినము అని కొందరు అనవచ్చును. అయితే నా మాటను వినమని నేను చెప్పలేదు కదా! ఎవరికి దేవుడు ఎంత అందిస్తే అంతే అర్థము కాగలదు అని నేను అనుకొంటున్నాను.

**ప్రశ్న :- పూర్వముండి లేకుండా పోయిన ఐదు ఆరాధనలు, అధర్మములు వృద్ధి చెందినప్పుడు లేకుండా పోయి ఉండవచ్చును. దేవుడు భగవంతునిగా అవతరించి ధర్మములను నెలకొల్పిన తర్వాత జ్ఞానమంతా వెలుగులోనికి వచ్చినట్లు, ఐదు ఆరాధనలు కూడా అమలులోనికి వచ్చియుండవలయును కదా! కృష్ణుడు భగవంతునిగా వచ్చి పోయినప్పుడుగానీ, ఏసుగా వచ్చి నప్పుడుగానీ పూర్వమున్న ఐదు ఆరాధనలను చెప్పలేదు కదా! రెండుమార్లు వచ్చినప్పుడు చెప్పలేదు. అలాగే దైవగ్రంథములు మూడు వచ్చాయి. ఆ మూడులో కూడా చెప్పలేదు. అలాంటప్పుడు ముందు ఆరాధనల విషయము ఎలా తెలుస్తుంది?**

**జవాబు :-** సంపూర్ణ జ్ఞానము దేవుని మూడు అవతారములలో చెప్పును. ఒక అవతారములో చెప్పినది మరొక అవతారములో చెప్పవచ్చును, చెప్పక పోవచ్చును. రెండు అవతారములలో చెప్పకున్నా మూడవ అవతారములో అయినా చెప్పును. గ్రంథముల విషయముకు వస్తే ఒక గ్రంథములో వ్రాసినది మరొక గ్రంథములో లేకపోవచ్చును. అయితే మూడు

గ్రంథములలో ఏదో ఒకచోట ఉండును. ఐదు ఆరాధనల విషయానికి వస్తే మొదటి రెండు గ్రంథములలో చెప్పకున్నా తర్వాత మూడవ గ్రంథము ఖురాన్‌లో చెప్పియున్నారు కదా! అయితే అది అర్థముకాకనో, అవగాహన లేకనో ప్రార్థనలో ఏకాగ్రత లేకుండా పోయినది. నమాజ్ తన అర్థమును కోల్పోయి మార్పు చెంది తపస్సువలె యున్నది. ఇది గ్రంథములలోని విషయము కాగా, దేవుడు భగవంతునిగా మూడుమార్లు రావలసియున్నది. ఇప్పటికి రెండుమార్లు వచ్చినా, ఐదు ఆరాధనలను గురించి ఏమి చెప్పలేదు. చివరిగా మూడవ అవతారములో తప్పక ఐదు ఆరాధనలను, వాటి విధానమును పూర్తిగా చెప్పునని అనుకొందాము.

## అంతిమ ఘడియ తీర్పు

**ప్రశ్న :- చాలామంది ముస్లీమ్‌లు చెప్పు విధానములో మనిషి చనిపోయిన తర్వాత అతను పూడ్చిపెట్టబడిన సమాధిలోనే ఉంటాడు. అలా చనిపోయిన వారంతా వుంటారు. ఏదో ఒక రోజు ప్రళయము ఏర్పడినప్పుడు చనిపోయిన వారందరిని సమాధుల నుండి దేవుడు లేపును. ఆ దినము మనిషి తన జీవితములో చేసుకొన్న పాపపుణ్యములను లెక్కవేసి పాపమును చేసుకొన్న వారిని నరకమునకు, పుణ్యము చేసుకొన్న వారిని స్వర్గమునకు పంపునని చెప్పుచుందురు. అలా సమాధులనుండి అందరిని లేపి తీర్పు తీర్చబడు అంత్య దినము వస్తుందియని చెప్పుచుందురు. ఇది నిజమేనా?**

**జవాబు :-** ఏ విషయమునయినా గీచి చూచుటకు గీటురాయి కలదు. గీటురాయి సంధించి చూస్తే అందులోని సత్యాసత్యములు తెలియును. సత్యము జ్ఞానము, అసత్యము అజ్ఞానము. ఈ విషయమై అంతిమ దైవ గ్రంథములోని సూరా 45, ఆయత్ 32ను చూస్తాము **(45-32)**

**"నిశ్చయముగా అల్లాహ్ (దేవుని) వాగ్దానం సత్యము. అంతిమ ఘడియను గురించి ఎలాంటి సందేహము లేదు." అని అన్నప్పుడు మీరన్నారు. "ఆ అంతిమ ఘడియ ఏమిటో మాకు తెలియదు. అది కేవలం ఒక ఊహాగానము తప్ప మరేమీ కాదని మేము భావిస్తున్నాము. మేము దానిని ఏమాత్రము నమ్మే వారము కాము"** ఈ వాక్యమును చూస్తే దేవుడు చెప్పిన 'అంతిమ ఘడియ' విషయములో ఎలాంటి అనుమానము లేదు. దేవుడు చెప్పినది సత్యమే అయితే దానిని అర్థము చేసుకోవడములో మనుషులు అసత్యములో యున్నారు. దేవుడు అంతిమ ఘడియయని అన్నాడు. అంతేకాక కొన్ని ఆయతులలో అంతిమదినము ప్రళయము ఏర్పడుతుంది. భూమి బ్రద్దలవు తుంది. భూమి, ఆకాశము ప్రళయము అంతిమ దినమున వస్తున్నది. ఆ అంతిమ దినమును అంతిమ ఘడియను ఎవరూ తప్పించుకోలేరు. ఆ దినము ఎంత బాధపడినా నిన్ను కాపాడేవాడుగానీ, నీ మొర వినేవాడుగానీ ఎవడూ ఉండడు. ఆ దినము నిన్ను సమాధినుండి బయటికి అల్లా తీస్తాడు. అంతిమ దినమున నీవు నీ జీవితములో చేసుకొన్న పాపపుణ్యములకు దేవుని చేత తీర్పు తీర్చబడుతుంది. తీర్పునుబట్టి నీకు స్వర్గ నరకములు నిర్ణయించబడుతాయి. దేవుని తీర్పునుండిగానీ, అంతిమ దినమునుండి గానీ ఎవడూ తప్పించుకొనుటకు వీలులేదు. తప్పించుకోవాలని ప్రయత్నము చేయుటకు కూడా అవకాశముండదు. పుట్టిన ప్రతి మనిషికీ, ప్రతి ప్రాణికీ అంతిమదిన తీర్పు గలదు.

ప్రశ్న :- **మీ జవాబులో ఖురాన్ వాక్యమున్నది కదా! అందులో దేవుడు చెప్పిన అంతిమ ఘడియ గురించి ఎలాంటి అనుమానము లేదు. అది సత్యము అని మీరన్నప్పుడు "అంతిమ ఘడియ గురించి మేము నమ్మము,**

**అదేమిటో మాకు తెలియదు" అని వారన్నారు. వారు అలా ఎందుకు అన్నారు?**

**జవాబు :-** దేవుడు ఏ విషయమును చెప్పినా సత్యమే అయివుండును. అయితే అది అర్థము కావాలంటేనే కొద్ది కష్టముగా యుండును. వారు చెప్పినది కూడా నిజమే. వారు ప్రళయములో సమాధులనుండి చనిపోయిన వారిని లేపుదురని చెప్పడము అసత్యముగా, అశాస్త్రీయముగాయున్నది. వారి మాటను నేను కూడా సమర్థించుచున్నాను. నేను ఈ విషయములో చాలామంది ముస్లీమ్‌లను అడిగాను. వారు అందరూ ఒకే మాటగా ప్రళయములో దేవుడు గోరీల నుండి మనుషులను లేపుననీ, అంతవరకు చనిపోయిన వారందరూ సమాధులలోనే ఉందురని చెప్పుచున్నారు. నేను వారిని అనేక ప్రశ్నలు వేశాను. వారు ఏ ప్రశ్నకు సరియైన జవాబు చెప్పలేకున్నారు. అయినా చివరకు మా పెద్దలు చెప్పినమాటే మా మాటయని అంటున్నారు. వారి పెద్దలు తప్పుదారి పట్టియుంటే మొత్తము ముస్లీమ్ సమాజమే తప్పుదారి పట్టినట్లగును. వారితో నేను అడిగిన ప్రశ్నల విధానమును వారు నాకు చెప్పిన సమాధానమును క్రింద పొందుపరుస్తూ వ్రాయుచున్నాము చూడండి.

**నేను :-** మనిషి చనిపోతే సమాధిలో లేక గోరీలో (గుంతలో) పెట్టి పూడ్చి వేయుచున్నాము. అప్పుడు పూడ్చిపెట్టినది చనిపోయిన వాని శరీరమునా లేక చనిపోయిన వానిని సజీవముగా పూడ్చుచున్నామా?

**వారు :-** చనిపోయిన వాని శరీరమును సమాధిలో పెట్టి పూడ్చుచున్నాము. వానిని సజీవముగా ఉన్నప్పుడు పూడ్చలేదు.

**నేను :-** చనిపోయిన నిర్జీవ శరీరమును పూడ్చిపెట్టితే ప్రళయ కాలములో

సజీవముగా ఎందుకు లేస్తున్నాడు? ఎప్పుడో జరుగబోవు దానిని మీరు ఎందుకు ఊహించుకొని చెప్పుచున్నారు?

**వారు :-** మా పెద్దలు చెప్పినదే చెప్పాము. మా పెద్దలు చెప్పినది వినాలన్నారు, తిరిగి ప్రశ్నించకూడదు అన్నారు. అందువలన మేము ఎప్పుడూ తిరిగి ప్రశ్నించి అడుగలేదు. మా సాంప్రదాయములో మా పెద్దలను తిరిగి ప్రశ్నించకూడదు, చెప్పింది వినాలి. చెప్పింది సత్యమే ఉ ంటుందని నమ్ముతున్నాము.

**నేను :-** గుంతలో పూడ్చిన శరీరము ఆరు నెలలకు కుళ్ళిపోతుందా లేదా మీరే చెప్పండి.

**వారు :-** కుళ్ళిపోతుంది. కుళ్ళిపోయిన శరీరము తిరిగి సజీవముగా లేస్తుంది. అది దేవుడు చేసే పని కదా! మనుషులు లేపలేదు కదా! దేవుడు లేపుచున్నాడు కాబట్టి చనిపోయిన వారు సజీవముగా లేస్తున్నారని అనుకొంటున్నాము.

**నేను :-** దేవుడు కూడా తన ధర్మమునకు విరుద్ధమైన పనులు ఎప్పుడూ చేయలేదు. దేవుడు తన ధర్మములను తెలియజేస్తూ ఒక జీవుడు శరీరమును ధరించి కొంత కాలము జీవించగా, అందులో బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము, తదుపరి మరణము అనునవి వరుసక్రమముగా ఏర్పడునని చెప్పియున్నాడు. ఇవి ఒక శరీరములో జరుగు దశలుగా చెప్పాడు. దేవుడు చెప్పిన ఈ మాట ప్రకారము ప్రత్యక్షముగా ఈ దశలు శరీరమునకు జరుగుచున్నవి, అందరికీ తెలిసిన విషయమే. ఆ విషయమును ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో చెప్పడమైనది. దానినే గీటురాయిగా తీసుకొని ఈ విషయములో జ్ఞానమును అజ్ఞానమును

తేల్చి చెప్పవచ్చును. భగవద్గీతలో సాంఖ్యయోగమునందు 13వ శ్లోకము చూడుము.

శ్లో॥ 13. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తర ప్రాప్తిర్ధీర స్తత్రన ముహ్యతి ॥

**భావము :–** "జీవాత్మకు ఏ విధముగా ఈ దేహములో బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము అను దశలు ఒకదాని తర్వాత మరొకటి వరుస క్రమముగా జరుగుచున్నవో అట్లే దేహమును వదలి పోవడము (చనిపోవడము) కూడా జరుగుచున్నది. సదా జరుగు ఈ కార్యమునకు జ్ఞానియైన వాడు ఎవడూ చింతించడు. తర్వాత అదే అధ్యాయమున 27వ శ్లోకమున జన్మించినవాడు చనిపోక తప్పదు. చనిపోయిన వాడు జన్మించక తప్పదని చెప్పిన విషయము కలదు చూడండి.

శ్లో॥ 27. జాతస్య హిధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్యచ ।
తస్మాద పరిహార్యేర్థే నత్వం శోచితు మర్హసి ॥

భావము :– **"జన్మించినది ఎప్పటికయినా చచ్చుటకే, చచ్చుట ఎప్పటికయినా పుట్టుట కొరకే. అనివార్యమైన ఈ సంగతి గురించి నీవు (ఎవడు) చింతించడు".** చనిపోయిన వాడు తప్పక పుట్టునని పుట్టినవాడు తిరిగి చనిపోవునని ఇది అనివార్య సంగతియని దేవుడే ప్రథమ దైవగ్రంథమందు చెప్పియున్నాడు. ఈ విధముగా దేవుడు చెప్పియుండగా దేవుడు 'మనిషి శరీరమును పూడ్చి పెట్టిన సమాధి నుండి సజీవముగా అదే శరీరముతోనే లేపును' అనుట దేవున్ని కూడా అసత్యమునకు అంటగట్టినట్లగును. సమాధులలో ఎముకలు కూడా వుండవు. శరీరమును వదలిన జీవుడు వేరే శరీరములో జన్మించిన సంఘటనలు ఎన్నో ఉన్నాయి. మనుషులు

తప్పు భావములో యున్నారని తెలిపిన దేవుడు ఆ విషయములో సత్యమును తెలియుటకు చనిపోయిన వాడు ఇంకొక చోట పుట్టిన తర్వాత అతనికి పూర్వ జన్మ జ్ఞాపకమును కల్గించుట వలన గతజన్మలో ఫలానా మనిషిగా యుంటినని చెప్పుచున్నాడు. అది ప్రత్యక్ష సత్యముగా కనపడుచుండగా, ప్రళయములో అంతిమ దినమున సజీవముగా లేపుననుట అసత్యమని తెలియుచున్నది.

**వారు :-** మీ మాటను చూస్తే వాస్తవమే అనిపించుచున్నది. అదే ఖురాన్ గ్రంథమందు సూరా 22, ఆయత్ 1లో ఇలా వ్రాసియుంది. **(22-1) "మానవులారా మీ ప్రభువునందు భయభక్తులు కల్గియుండండి. నిశ్చయముగా ఆ అంతిమ ఘడియ యొక్క భూకంపము ఎంతో భయంకర మైనది."** (ఇది "దివ్యఖురాన్ సందేశం తెలుగులో" అను గ్రంథములో వ్రాయబడినది. 'అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్' అను దానిలో ఇదే వాక్యమే ఇలా కలదు చూడండి.) **(22-1) "ప్రజలారా మీ ప్రభువుకు భయపడండి. నిశ్చయంగా ప్రళయ సమయాన జరిగే ప్రకంపనం మహా భీకర విషయం"** అని వ్రాసియుంది. ఈ రెండు వాక్యములలో దాదాపు ఒకే విషయముండడమే కాక, అంతిమ ఘడియలో జరుగు ప్రళయం భయంకరమైనదియనీ, భీకరమైనదనీ చెప్పియున్నారు. ఈ వాక్యమును బట్టి ప్రళయము సంభవించునప్పుడు అందరికీ అంతిమ ఘడియ వచ్చినట్లే కదా! అంతిమ ఘడియలో ప్రళయమన్నది కలదనేగా అర్థము. ప్రళయము వస్తే అంతా నాశనమగుననే కదా! అర్థము. అంతవరకు సమాధులలో నున్నవారు ప్రళయ కాలములో అనగా అంతిమ కాలములో సమాధులనుండి బయటికి వస్తారని చెప్పిన మాటను నమ్మవచ్చును కదా!

**నేను :-** భూప్రళయము అంటే బయట భూమి కంపించుననీ, సముద్రములు చీలిపోవుననీ, అగ్ని పర్వతములు ప్రేలిపోవునని ఎందుకు అనుకోవాలి?

ఖురాన్ గ్రంథములో దేవుడు చెప్పిన విషయములను బాగా గ్రహించగలిగి నప్పుడు ఒక ఉద్దేశ్యములోనికి రావలెను. అట్లుకాకుండా జరగని వాటిని జరిగినట్లు ఎందుకు ఊహించుకోవాలి? దేవుడు ప్రళయము అని చెప్పితే నీకు తెలిసిన ప్రళయమేనని ఎందుకు అనుకోవాలి? దేవుడు (3-7) వాక్యము నందు ఖురాన్ గ్రంథములో సూక్ష్మమైన వాక్యములు ఎన్నో ఉన్నవని తెలిపాడు. సూక్ష్మమైన వాక్యములను సూక్ష్మముగానే అర్థము చేసుకోవలసియుండగా, అట్లుకాకుండా అన్నిటినీ స్థూలముగా అర్థము చేసుకోవడము వలన ఆధ్యాత్మికములో మనిషి దారితప్పిపోతున్నాడు. భగవద్గీతలో (తౌరాతు) గ్రంథములో జ్ఞానమంతయూ శరీర అంతర్గతముగానే చెప్పియున్నాడు. అయితే దానిని చాలామంది శరీరము లోపల చూడకుండా శరీరము బయట చూడడము వలన భగవద్గీత భావము చాలామందికి అర్థము కాకుండా పోయినది. ఇక్కడ ఒక వాక్యమును సూరా 30, ఆయత్ 8 తీసుకొని చూస్తాము. ఈ వాక్యము స్థూలముగా తీసుకొంటే తీసుకో వచ్చును. దానివలన దేవుని జ్ఞానములో తప్పటడుగు వేసినట్లగును. సూక్ష్మముగా అర్థము చేసుకోగలిగితే దేవుడు చెప్పిన భావము బాగా అర్థము కాగలదు. ముందు వాక్యమును చూస్తాము. **(30-8) "ఏమిటి వారు తమ పుట్టుకను గురించి లోతుగా ఆలోచించడము లేదా? దేవుడు భూమి, ఆకాశము వాటి మధ్యలోయున్న సమస్తమును అత్యుత్తమరీతిలో నిర్ణీత కాలము వరకు మాత్రమే సృష్ఠించాడు. గడువు అయిపోయిన తర్వాత తమ ప్రభువును కలుసుకోవలసి యుందను విషయాన్ని మరచిపోయారు."**

ఈ వాక్యములో 'భూమిని ఆకాశమును వాటి మధ్యలోయున్న సమస్తమును అత్యుత్తమరీతిలో సృష్ఠించాడు' అనియున్నది. ఈ మాటను

లోకములో అందరూ స్థూలముగానే చెప్పుకొనుచుందురు. అలా చెప్పు కోవడము వలన మనిషి దేవుని జ్ఞానమును అర్థము చేసుకోలేక పోయాడు. అందువలన "ఏమి మనిషి తమ పుట్టుకను గురించి లోతుగా ఆలోచించడము లేదా?" అని మొదటనే అన్నాడు. భూమి, ఆకాశము అనగానే బయట కనిపించు దానిమీదనే అందరి ధ్యాస పోవును. మేము అట్లు కాకుండా సూక్ష్మవాక్యమును సూక్ష్మముగానే అర్థము చేసుకొంటున్నాము, కావున భూమి అనగా మనిషి శరీరమునకున్న కాళ్ళు, పాదములు అని వెంటనే అనుకొంటున్నాము. ఆకాశము అంటూనే మనిషి శరీరముపైన గల తలను అనుకొంటున్నాము. ఆకాశము భూమి అని చెప్పగానే కాళ్ళు మొదలుకొని తలవరకు గల మనిషి శరీరము అని అనుకొంటున్నాము. భూమి ఆకాశము వాటి మధ్యలోనున్న సమస్తము అని చెప్పగానే తలనుండి పాదముల వరకు గల అన్ని అవయవములని, మొత్తము శరీరమని అనుకొంటున్నాము. ప్రతి శరీరము ఒక నిర్ణీత కాలము వరకు (మరణము వరకు) బాగుండునట్లు తయారు చేయబడియుంటుంది. ఎప్పుడు శరీరము సరిగా పనిచేయలేదో అప్పుడు మరణము అను నిర్ణీత గడువు దగ్గర పడినట్లేయని అర్థము. గడువు అయిపోయిన తర్వాత అనగా శరీరముతో జీవించు గడువు అయిపోయిన తర్వాత మరణించి దేవునిలోనికి ఐక్యము కావాలని మోక్షమును పొందాలని మనుషులు మరచిపోయారు. తిరిగి కర్మల ఫలితముగా భూమిమీదనే మరొక శరీరమును ధరించుచున్నారు. అందువలన మొదట పుట్టునప్పుడే తమను గురించి తాము బాగా ఆలోచించ వలసియున్నది. అందువలన తమ పుట్టుకను గురించి బాగా ఆలోచించ లేదా!యని హెచ్చరిక చేసినట్లు చెప్పాడు. ఈ వాక్యము మొత్తము సూక్ష్మముగా అర్థమయితేనే ఇందులోని జ్ఞానము తెలియబడుతుంది గానీ, స్థూలముగా అర్థమయితే జ్ఞానము ఒక్క ముక్కగానీ అర్థము కాదు.

'భూమి ఆకాశము వాటి మధ్యలోనున్న సమస్తము' అని ఖురాన్ గ్రంథములో చాలామార్లు చెప్పారు. అయితే భూమిని భూమిగానే ఆకాశమును ఆకాశముగానే అర్థము చేసుకొంటున్నారు. వాటి మధ్య సమస్తము అనగా కనిపించే ప్రపంచమంతాయని అందరు అనుకోవడము జరుగుచున్నది. తమ శరీరమునే పాదములనుండి తలవరకు చెప్పు భావములోనే భూమి ఆకాశము, వాటి మధ్యనున్న సమస్తము అని చెప్పాడు. **అంతిమ ఘడియ** అనగా! **మరణ సమయము** అని తెలియలేకపోయారు. మరణ సమయములో మరణము పొందినప్పుడే రెండవ జన్మ వాడు చేసుకొన్న కర్మనుబట్టి నిర్ణయింపబడును. కర్మనుబట్టి వాడు భూమిమీదనే కష్టములనుగానీ, సుఖములనుగానీ అనుభవించవలసియుండును. అందువలన అంతిమ దినమున అల్లా వానికి తీర్పు తీర్చును అని వ్రాసి యున్నారు. అంతిమ దినమున సమాధులనుండి లేపబడుదురు అని చెప్పడములో చనిపోయిన రోజే తల్లిగర్భము నుండి పుట్టిన శిశు శరీరములో చేరి ఎరుకలోనికి రావడమును సమాధినుండి బయటికి తీయబడుదురు అని చెప్పారు.

ప్రతి మనిషికీ మరణ సమయము తప్పకవచ్చును. అందువలన అంతిమ ఘడియనుండి ఎవరూ తప్పించుకోలేరు అని అన్నాడు. చనిపోయిన వెంటనే రెండవ జన్మలో కష్టముల అనుభవమా లేక సుఖముల అనుభవమా లేక రెండు కలయిక జీవితమా అని నిర్ణయించబడి మనము చేసుకొన్న దానినిబట్టి రెండవ జన్మకు కర్మ తయారగును. అదియే అంతిమ ఘడియ తీర్పు అని చెప్పారు. ఈ విధానము అందరికి ఒకే విధముగా యున్నది కావున అంతిమ ఘడియ తీర్పునుండి తప్పించుకొనుటకు ఎవరికీ సాధ్యపడదు అని చెప్పారు. చనిపోవునప్పుడు శరీరము శిథిలావస్థకు

చేరియుండును. తలనుండి కాళ్ళవరకు పని చేయని స్థితిలో శరీరముండును. కావున దానినే ప్రళయము అన్నారు. గత జన్మ కర్మలనుబట్టి రెండవ జన్మ జీవితము నిర్ణయింపబడుచున్నది. అందరికీ జరుగు విధానము ఒక్కటే ఎప్పుడో అంతిమ దినము అనుకునే దానికంటే ఎప్పుడు మరణము వస్తుందో అప్పుడే అంతిమ ఘడియ, అంతిమ దినము అనుకొంటే సరిపోతుంది. ప్రతి మనిషి పాపమును కష్టముల రూపములో, పుణ్యమును సుఖముల రూపములో ఇక్కడే భూమిమీదనే అనుభవించుచున్నాడు. భూమిమీద అనుభవించు కష్టములనే నరకము అని అంటున్నాము. అట్లే భూమిమీద అనుభవించు సుఖములను స్వర్గము అంటున్నాము. భూమిమీదనే జీవితములోనే ప్రతి మనిషి నిత్యము కష్టసుఖములను అనుభవించుట వలన స్వర్గ నరకములను మనిషి ఇక్కడే అనుభవిస్తున్నాడని చెప్పవచ్చును. స్వర్గలోకము, నరకలోకము ప్రత్యేకముగా లేవనీ ఆ రెండు భూమిమీదనే కష్టసుఖముల రూపములో మనుషులు అనుభవిస్తున్నారని తెలియవలెను. ఇంతవరకు మేము చెప్పినదే తన మాటలలో దేవుడు చెప్పాడుగానీ వేరే ఏమీ చెప్పలేదు.

దేవుడు చెప్పిన సూక్ష్మ జ్ఞానమును అర్థము చేసుకోలేక మరణావస్థను ప్రళయ కాలమున బయట భూమి ఆకాశములో ప్రళయము జరుగునని మనిషి అనవసరముగా అనుకొన్నాడు. బయటి ప్రపంచమయిన ఆకాశము, భూమికి ఎప్పటికీ ప్రళయమురాదు. **విశ్వము నశించదు, దేవుడు నశించదు.** ప్రకృతి పరమాత్మయను రెండూ శాశ్వితముగా ఉండునవే గానీ నాశనము చెందునవి కావు. బయటి ప్రపంచమువలె మన శరీరము ఒక ప్రపంచము వలెయున్నది. ప్రకృతియొక్క పంచభూతములతో మన శరీరము తయారయినది. భూమికి గుర్తుగా పాదములు, ఆకాశమునకు గుర్తుగా

తల అందులోని మనస్సు, బుద్ధి, చిత్తము, అహము గలవు. అట్లే మిగతా గాలి, అగ్ని, నీరుకు గుర్తుగా మిగతా శరీరమంతయూ యున్నది. పంచ భూతములతో కూడుకొన్న బయటి ప్రపంచమును తయారు చేసినట్లే పంచ భూతములతోనే మనిషి శరీరమును కూడా దేవుడు తయారు చేశాడు. ఈ విధముగా మనిషి శరీరములో జరుగు మార్పును, దేవుడు చేయు పనులను, కర్మలనుబట్టి విధించు శిక్షలను చెప్పియుంటే కష్టసుఖములను స్వర్గలోకము నరకలోకములని మనిషి ఊహించుకొన్నాడు. అట్లే ఆకాశము, భూమి అంటే కాళ్ళు తలయని కాకుండా బయట ప్రపంచములోని భూమి, ఆకాశములుగా పోల్చుకొన్నాడు. ఇట్లు దేవుడు సూక్ష్మమును నీలోయుండు దానిని చెప్పితే మనిషి స్థూలముగా అర్థము చేసుకొంటున్నాడు. తనకు సంబంధములేని విషయములను లెక్కించుకొనుచున్నాడు.

## స్వర్గ, నరక, పర లోకములు

**వారు :-** స్వర్గలోకము, నరకలోకములు లేవంటారా? ఆ రెండిటినీ భూమిమీదనే అనుభవిస్తున్నామా? అయితే పరలోకము అనునది ఏమిటి?

**నేను :-** మనిషికి దేవుడు జ్ఞానమును చెప్పే విధానములో కొన్ని పదములను చెప్పాడు. ఆ పదములను మనిషి తన ఇష్టమొచ్చినట్లు అర్థము చేసుకొన్నాడు. స్వర్గము అనగా సుఖము అని అర్థము. అట్లే నరకము అనగా కష్టము లేక దుఃఖము అని అర్థము. 'లోకము' అంటే అనుభవించునది యని అర్థము. స్వర్గలోకము అనగా సుఖములను అనుభవించునది అని అర్థము అంతేగానీ అది అక్కడేయని చెప్పుటకు వీలులేదు. మనిషి సుఖములను ఎక్కడ అనుభవిస్తుంటే అక్కడే స్వర్గలోకమని చెప్పవచ్చును. అట్లే నరకలోకము అంటే దుఃఖములను అనుభవించునదియని అర్థము.

అంతేగానీ ఇక్కడ అక్కడ గలదని చెప్పుటకు వీలులేదు. మనిషి ఎక్కడ దుఃఖములను అనుభవిస్తుంటే అక్కడే నరకలోకము కలదని చెప్పవచ్చును. మనిషికి రెండే అనుభవములున్నవి. ఒకటి సుఖము, రెండు దుఃఖము. ఈ రెండు అనుభవములు తప్ప బయట ప్రపంచములో ఏమీ లేదు. ఈ రెండు అనుభవములకంటే వేరే అనుభవము ఒకటి గలదు. అది ఇట్లున్నదని చెప్పుటకు వీలుండదు. దుఃఖముకానిది, సుఖముకానిది రెండిటికీ వేరయినది. రెండిటికీ వేరుగాయున్న అనుభవమును దేవునియందు ఐక్యమైనవాడు అనుభవించుచుండును. ఆ అనుభవము సుఖ దుఃఖముల కంటే వేరయినది. అందువలన దానిని 'వేరు' అని చెప్పుటకు బదులుగా 'పర' అని అన్నారు. అనుభవమును లోకము అంటారు కదా! సుఖదుఃఖముల కంటే వేరుగాయున్న అనుభవమును "పరలోకము" అని అనవచ్చును. పరలోకము అనగా దేవునియందైక్యమగునది లేక మోక్షము అని అనవచ్చును. ముక్తిని పొందడము లేక మోక్షమును పొందడమును లేక దేవునియందైక్యమగుటను పరలోకమును పొందినట్లే. పరలోక ప్రాప్తి యని కూడా అనవచ్చును.

పరలోకము అను దానిని గురించి అనగా దైవానుభవమును గురించి అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో ఏమన్నాడో చూస్తాము. సూరా ఆరు, ఆయత్ 32లో ఏముందో చూస్తాము. **(6-32) "ఇహలోక జీవితము ఒక ఆట, మరియు కాలక్షేపము మాత్రమే. దైవభీతి కలవానికి పరలోకవాసమే అత్యంత శ్రేష్ఠమైనది. ఏమీ మీరు అర్థము చేసుకోలేదా?" (12-109) "మేము నీకంటే పూర్వము దివ్యజ్ఞానము (వహీ) ఇచ్చిపంపిన వారందరూ పురుషులే. వారు నగర వాసుల లోని వారే. ఏమీ మీరు భూమిలో సంచారము చేయలేదా?**

**తమ పూర్వీకుల గతి ఏమయిందో చూడడానికి దైవభీతి కలవారికి పరలోక వాసమే ఎంతో మేలయినది. ఏమి? మీరిది అర్థము చేసుకోలేదా? (29-64) "ఈ ప్రపంచ జీవితము కేవలము వినోద కాలక్షేపము మరియు క్రీడ మాత్రమే. అసలు పరలోక గృహ జీవితమే వాస్తవమైన జీవితము. ఇది వారు తెలుసుకొంటే ఎంతో బాగుండేది. (42-20) "ఎవడు పరలోక ఫలాన్ని కోరుకొంటాడో, మేము అతనికి అతని ఫలములో వృద్ధి కలుగజేస్తాము. ఎవడయితే ఇహలోక ఫలాన్ని కోరుకుంటాడో మేము అతనికి దానినే ఇస్తాము. అతనికి పరలోక ప్రతిఫలములో ఎలాంటి భాగము ఉండదు."** ఈ విధముగా పరలోకమును గురించి కొన్ని వాక్యములను అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో చెప్పడమైనది. దీనినిబట్టి స్వర్గలోకము వేరు, నరకలోకము వేరనీ, పరలోకము వేరని తెలియవలెను.

మనిషి స్వర్గమును, నరకమును ఎక్కడయినా అనుభవించవచ్చును. అనగా భూమిమీదనే ఎక్కడయినా అనుభవించవచ్చును. ఎక్కడ అనుభవిస్తే అదే అతని లోకమగును. అట్లే దేవుడు ప్రపంచమంతటా అణువణువునా వ్యాపించియున్నాడు. ఆయనయందు ఐక్యమైనవాడు తిరిగి శరీరమును ధరించడము అంటూ యుండదు. అనగా అతనికి జన్మలుండవు. జన్మలున్నాయి అంటే వాడు స్వర్గనరకములను అనుభవించువాడై యుండాలి. అనుభవించే కర్మ లేనివాడు, దేవునియందైక్యమైన వాడు కూడా దేవునివలె అంతటా వ్యాపించి పోవును. అప్పుడు వాడు ఇక్కడున్నాడు అక్కడ లేడు అని చెప్పుటకు వీలులేదు. అట్టివాడు దేవునిలో యున్నాడు కనుక దేవునివలె అంతటా యుండును. వాడు దేవున్ని అనుభవించుచున్నాడు కావున

పరలోకమును పొందినవాడని చెప్పవచ్చును. 'లోకము' అన్నంతమాత్రమున ఏదో దేశములాంటిదియని అనుకోకూడదు. **'లోకము' అనగా 'అనుభవము'** అని అర్థము లేక అనుభవించడము అని అర్థము. అన్ని అనుభవములకంటే దేవుని అనుభవము వేరుగాయుండును కనుక పరలోకము అని చెప్పు చున్నారు. మరొక్క విషయమును మరువకూడదు. అదేమనగా! దేవున్ని అనుభవించడమును పరలోకము అని అనుచున్నాము కదా! దేవున్ని అనుభవించే దానికి వీలవుతుందాయని కొందరడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! దేవునియందైక్యమయిన వాడు దేవునికంటే వేరుగాయుండడు. అందువలన వాడు ప్రత్యేకముగా యుండి అనుభవించేది ఏదీ లేదు. దేవునియందైక్యమై యుండును. ఆ విషయమును మనము అర్థము చేసుకోవలెనని ఇంతకుముందు చెప్పిన వాక్యముల చివరిలో **'ఏమి మీరిది అర్థము చేసుకోలేరా'** అని అన్నారు. ఇంకా ఇంకొక వాక్యము చివరిలో **'ఇది వారు అర్థము చేసుకొనియుంటే ఎంతో బాగుండేది'** అని కూడా అన్నాడు. అందువలన ప్రతి విషయమును స్థూలముగా అర్థము చేసుకోకూడదు. సూక్ష్మముగా అర్థము చేసుకోవలెను. అప్పుడయితేనే దేవుని జ్ఞానము అర్థము కాగలదు. దేవుని జ్ఞానము అభౌతికముగా యున్నది. అట్లే ప్రపంచ జ్ఞానమంతయూ భౌతికముగాయున్నది. భౌతికము అంటే కనిపించునది, అభౌతికము అంటే కనిపించనిదియని అర్థము. దేవుడు అభౌతికుడు అందువలన సూక్ష్మముగానే అర్థము చేసుకోవాలి.

## దేవుని చిహ్నము

అభౌతికమయిన దేవున్ని గుర్తించుటకు భౌతికమైన చిహ్నమును తయారు చేశాడు. కనిపించని రాజుగారి ఉంగరమును రాజముద్రయని

అన్నట్లు, రాజముద్రను చూచి రాజుగారిని చూచినట్లు గౌరవింతురు. అలాగే కనిపించని దేవున్ని కనిపించే చిహ్నాముగా గుర్తించి గౌరవించవలెను. రాజుగారి వేలి ఉంగరమును రాజముద్రగా గుర్తించినట్లు, రాజముద్రను చూస్తూనే రాజుగారిని చూచినట్లు రాజముద్రను గౌరవించి రాజాజ్ఞను ఆచరించుచుందురు. దేవుడు రాజువలె కనిపించనివాడుగా యున్నట్లు రాజముద్రను అనుసరించి రాజముద్ర గలవారు చెప్పినట్లు వినుచు రాజాజ్ఞవలె వారి మాటను గౌరవించి చేయుచుందురు. రాజుకున్న గౌరవము రాజముద్రకుండును. దేవుడు కనిపించని వాడు అయినందున కొన్ని దేవుని పనులను ఇతరులతో ఆచరింపజేయుటకు దేవుని ముద్రను తయారు చేయవలసివచ్చినది. రాజు తన చేతి వేలికి ధరించిన ఉంగరము అయినందున రాజుగారి ఉంగరమునకు విలువయున్నది. అలాగే దేవుని జ్ఞానముచేత నిర్మితమైనది దేవుని చిహ్నాముగాయున్నది. దేవుని ముద్ర దేవుని జ్ఞానము చేత తయారు చేయబడినదిగా యుండడమేకాక, దేవుని ముద్ర ఏ మతమునకు సంబంధించినదై యుండదు. రాజముద్ర వ్యక్తులకు సంబంధించినదిగా ఎట్లుయుండదో అట్లే దేవుని ముద్ర మతములకు సంబంధించినదిగా యుండదు. రాజాధికారముతో తయారయినది, రాజాధికారముతో కూడుకొన్నది రాజముద్ర అన్నట్లు దేవుని శక్తితో కూడుకొన్నదిగా దేవుని ముద్రయుండును. దేవుని ముద్రయనగా దేవుని చిహ్నాము అనియు, దేవుని గుర్తు అనియు, దేవుని అధికారము అనియు, దేవుని శక్తియనియు చెప్పవచ్చును.

**ప్రశ్న :- దేవుని ముద్ర అనిగానీ, దేవుని చిహ్నాము అనిగానీ మేము ఎక్కడా వినలేదు. ఎక్కడా చూడలేదు. మీరు చెప్పునది కట్టుకథ లాగయున్నది. మీమాట వాస్తవమేయని మేము ఎలా నమ్మాలి? దానికి ఏదయినా ఆధారమున్నదా?**

**జవాబు :-** ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో అక్షర పరబ్రహ్మయోగమందు చెప్పిన కొన్ని శ్లోకముల అర్థ సముదాయము వలన **'దేవుని ముద్ర'** ఇలా యుందని చెప్పవచ్చును. భగవద్గీతలో దేవుని చిహ్నము నిగూఢముగా కనిపించకుండాయుండునట్లున్నది. అక్షర పరబ్రహ్మయోగములో కొన్ని శ్లోకములతో అనుబంధమైయున్నది. ద్వితీయ దైవగ్రంథములో 'దేవుని ముద్ర'ను గురించి వాక్యముగలదు. భగవద్గీతలో కనిపించక నిగూఢముగా యున్న దేవునిముద్ర బైబిలు గ్రంథములో కనిపించునట్లు చెప్పబడినది. తర్వాత కొంత కాలమునకు వచ్చిన అంతిమ దైవగ్రంథములో **'దేవుని చిహ్నము'** అను పదమును రెండుమూడు చోట్ల వాడినా దాని అవగాహన మనుషులలో లేకుండా పోయినది. దేవుని ముద్రను (చిహ్నమును) గురించి భగవద్గీత అక్షర పరబ్రహ్మయోగము అను అధ్యాయమున యుండగా, **ద్వితీయ దైవగ్రంథమున యోహాను వ్రాసిన ప్రకటన గ్రంథములో అధ్యాయము 9, వాక్యము 4న దేవుని ముద్రను గురించి చెప్పియున్నారు.** తర్వాత వచ్చిన **ఖురాన్ గ్రంథమందు సూరా 22 ఆయత్ 32లో చెప్పబడినది.** అక్కడ **"దేవుని చిహ్నములను భక్తిగలవారు గౌరవింతురు"** అనియున్నది. మిగతా చోట **2-158 వాక్యములోనూ మరియు 5-2 లోనూ దేవుని చిహ్నములను గురించి వ్రాసియున్నా** అక్కడ చెప్పినది సరియైన భావములో లేదనీ, అది జిబ్రయేల్ చెప్పిన వాక్యము కాదనీ తెలియుచున్నది. భగవద్గీతలోనూ, బైబిలులోనూ అర్థమయినట్లు ఖురాన్ గ్రంథములో అర్థము కావడము లేదు.

భగవద్గీతా గ్రంథములో అక్షరపరబ్రహ్మయోగమున కనిపించక దేవుని చిహ్నము చెప్పబడియున్నది. 40 సంవత్సరముల క్రితము నేను బైబిలును, ఖురాన్ గ్రంథమును చూడకముందు అక్షర పరబ్రహ్మయోగములో నిగూఢముగా నిక్షిప్తమయియున్న **'దేవుని ముద్ర'**ను బయటికి తీసి

దృశ్యరూపముగా బొమ్మను గీచి చూపించాము. మా మొదటి రచన **'ప్రబోధ'**లో దేవుని ముద్రగా యున్న బొమ్మను 1978లోనే వ్రాశాము. 1980లో 'ప్రబోధ' గ్రంథమును అచ్చువేశాము. అప్పటికే 40 యేండ్ల క్రితమే మాచేత **'దేవుని చిహ్నము'** రూపము దాల్చినది. 1978లో మా ద్వారా దేవుని చిహ్నము తయారయినది. అప్పటినుండి ఆ చిహ్నమును తల నుదుటి భాగమున ధరించుచున్నాము. 'దేవుని ముద్ర' ఎప్పుడు తయారయినదో, ఎప్పుడు దేవుని ముద్రను నుదుటి భాగమున ధరించు చున్నామో, అప్పటినుండి **'త్రైత శకము'** అను పేరు వచ్చినది. త్రైత శకము ప్రారంభమయి ఇప్పటికి 38 సంవత్సరములు. ప్రతి సంవత్సరము యుగాది పండుగ రోజునుండి త్రైత శక సంఖ్య మారుచూ వచ్చుచున్నది. **'త్రైత శక క్యాలెండర్', 'త్రైత శక పంచాంగము'** కూడా తయారగుచున్నవి. రేపు రాబోయే యుగాది నుండి త్రైత శకము 39గా మారనున్నది. త్రైత శకము మొదలయినప్పటి నుండి **'త్రైత సిద్ధాంతము'**ను బోధించుచున్నాము. ముస్లీమ్‌లు తమ ఖురాన్ గ్రంథములోని సూక్ష్మవాక్యములను ఎలా అర్థము చేసుకోలేకపోయారో, అలాగే హిందువులు తమ భగవద్గీత జ్ఞానమును అర్థము చేసుకోలేకపోయారు. అందువలన మేము భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయములో 16, 17 శ్లోకములను ఆధారము చేసుకొని, ఆ శ్లోకములలోయున్న **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల ఆధారముతో **'త్రైత సిద్ధాంతము'**ను ప్రకటించి, అప్పటినుండి ఇప్పటి వరకు దానినే ప్రచారము చేయుచున్నాము. హిందూమతములో ఇంతకు ముందే అద్వైత సిద్ధాంతకర్త ఆది శంకరాచార్యులు గలరు. అలాగే విశిష్టాద్వైత సిద్ధాంతకర్త రామానుజాచార్యులు గలరు. ద్వైత సిద్ధాంతకర్త మధ్వాచార్యులు కూడా కలరు. కేరళ రాష్ట్రమునుండి శంకరాచార్యుల వారు తన అద్వైతమును ప్రచారము చేశాడు. తమిళనాడు నుండి రామానుజా

చార్యులు తన విశిష్టాద్వైతమును ప్రచారము చేశాడు. కర్ణాటకలో ఉడిపి నుండి మధ్వాచార్యుల వారు తన ద్వైతమును ప్రచారము చేశారు. అయితే అప్పుడు హిందువులందరూ మా సిద్ధాంతకర్తలు అని గొప్పగా చెప్పు కొన్నారు. వారిని పూజించారు. నేడు మేము గత 38 సంవత్సరాలుగా త్రైత సిద్ధాంతమును బోధించుచున్నాము.

అయితే హిందువులు నన్ను హిందువుగానే ఒప్పుకోలేదు. 'త్రైతము' అనగానే క్రైస్థవుల జ్ఞానము అని ఆరోపించుచున్నారు. మేము చెప్పు జ్ఞానము హిందువులదా, క్రైస్థవులదాయని చూడకుండా మేము రచించిన భగవద్గీతను హిందూ ముసుగులోయున్న బైబిలు అని అన్నారు. నన్ను ఏకంగా క్రైస్థవ బోధకుడు అని గ్రుడ్డిగా అనడము జరిగినది. ఎవరు ఎన్ని ఆరోపణలు చేసినా 'త్రైత సిద్ధాంత జ్ఞానము' చాలా వేగముగా భూమిమీద ప్రాకిపోవుచున్నది. కంసునికి తెలియకుండా ప్రక్కనే రేపల్లెలో కృష్ణుడు పెరిగినట్లు చాలామంది స్వామీజీలకు తెలియకుండానే త్రైత సిద్ధాంత జ్ఞానము పెరిగిపోవుచున్నది. ఇప్పటికి వందలు, వేలు, దాటి లక్షలలో ప్రయాణిస్తూ త్వరగా చివరకు నూరు లక్షల స్థాయికి చేరనున్నది. కొందరు మమ్ములను క్రైస్థవులు అనినవారే వారి తప్పును తెలుసుకొని చివరకు త్రైత సిద్ధాంత జ్ఞానము గొప్పదని మా జ్ఞానమునకు గుర్తయిన 'దేవుని చిహ్నాము'ను నుదుటిమీద ధరించుచున్నారు. త్రైత శకమునుండి త్రైత సిద్ధాంత జ్ఞానము ప్రచారమగుచున్నది. త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించిన వారు మేమే అయినందున మేము వేగముగా ప్రచారము చేయుచున్నాము. మా జ్ఞానము **'త్రైత సిద్ధాంతము'**, మా చిహ్నాము **'దేవుని చిహ్నాము'** అని ఈ జ్ఞానమును తెలిసిన వారందరూ దేవుని చిహ్నామును ముఖము మీద ధరించుచున్నారు.

'దేవుని చిహ్నము' ఒక మతమునకు సంబంధించినది కాదు. మేము మొదట భగవద్గీత **అక్షర పరబ్రహ్మ యోగమును చూచి దేవుని చిహ్నమునూ, భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగమును చూచి త్రైత సిద్ధాంతమును బయటికి చెప్పగలిగాము.** అయినా ఇది హిందూమతములో ఉద్భవించినది, చెప్పినవాడు హిందువు అని అనుకొనుటకు వీలులేదు. ఈ జ్ఞానము, ఈ చిహ్నము ఒక మతమునకు పరిమితి కాదు. మేము మొదట భగవద్గీత చదివాము. అప్పుడు ప్రపంచములో ఎవరికీ అర్థముకాని ధోరణిలో నాకు భగవద్గీత అర్థము కావడము జరిగినది. తర్వాత నేను చెప్పు జ్ఞానము, నేను బోధించు వాక్యములు బైబిలులోనూ, ఖురాన్ గ్రంథములోనూ నేను ఆ గ్రంథములు చదివినప్పుడు కనిపించాయి. నేను చెప్పు జ్ఞానమే ఆ రెండు గ్రంథములలో యుండుట వలన ఆ రెండు గ్రంథములు చాలా సులభముగా నాకు అర్థము కావడము జరిగినది. నేను గత 40 సంవత్సరములనుండి బోధిస్తూ "దేవుని జ్ఞానము దేవునికి తప్ప మనుషులకు తెలియదు. దేవుడే జ్ఞానమును చెప్పగలిగితే ప్రజలకు జ్ఞానము తెలుస్తుంది" అని చెప్పెడివాడిని. అదే విషయమే ఖురాన్ గ్రంథములో సూరా మూడు ఆయత్ ఏడు (3-7) లో ఉండడము చూచి నాకు ఆశ్చర్యము వేసింది. **'దేవుడు అనుకొంటే నిన్ను ఒక్కచోటే ఉంచగలడు. దేవుడు అనుకొంటే నిన్ను అంతటా ఉంచగలడు'** అని 40 సంవత్సరముల క్రితము ఒక వాక్యమును వ్రాశాము. అదే వాక్యమే ఖురాన్ గ్రంథములో **'దేవుడు అనుకొంటే నిన్ను జ్ఞానమార్గములో పంపగలడు. దేవుడు అనుకొంటే నిన్ను అపమార్గములో పంపగలడు'** అను వాక్యము చూచి నా వాక్యములు అనేకము బైబిలు, ఖురాన్ గ్రంథములలో ఉండడమును చూచి ఆశ్చర్యమయి నది. నేను 1980లో **'జనన మరణ సిద్ధాంతము'** అను క్రొత్త జ్ఞానమును వ్రాశాను. ఆ రోజులలో చాలామందికి ఆ జ్ఞానము అర్థము కాలేదు.

దానిమీద ఎందరో వైద్యులు, ఎందరో విజ్ఞానవేత్తలు విమర్శలు చేశారు. అయినా నేను చెప్పు జ్ఞానము సత్యము అని అన్నాను. అదే విషయమునే ఖురాన్ గ్రంథములో 6-95లో ఉండడమును చూచి నేను చెప్పిన జ్ఞానమే అక్కడున్నదని సంతోషించాము. ఇలా ఎన్నో విషయములు ఆ రెండు గ్రంథములలో యున్నవని తెలిసినది.

ఈ మధ్య కాలములో దాదాపు రెండు సంవత్సరముల క్రితము ఖురాన్ గ్రంథమును చూస్తూయుండగా (22-32) లోనూ, (5-2) లోనూ **'దేవుని చిహ్నము'** అను వాక్యము కనిపించింది. నేను ఎప్పుడో 40 సంవత్సరముల క్రిందట 'దేవుని చిహ్నము' అని క్రొత్తపేరు చెప్పియున్నానని అనుకొన్నాను. అయితే అది క్రొత్త పేరు కాదు, పాత పేరేయని తెలిసి పోయినది. తర్వాత కొన్ని నెలలకు బైబిలు గ్రంథమును చూస్తూయుండగా యోహాన్ ప్రకటనల గ్రంథములో 9వ అధ్యాయమున 4వ వచనములో 'దేవుని ముద్ర నొసలు మీద ధరించడము' అని ఉండడము చూచి చాలా ఆశ్చర్యమయినది. ఆ వాక్యమును చాలామంది క్రైస్థవులు కూడా చూడలేదు. వారికి ఆ వాక్యము తెలియనే తెలియదు. మేము 40 సంవత్సరముల నుండి చేయు పనినే అక్కడ చెప్పడము చాలా వింతగా తోచినది. యోహాన్ ప్రకటనల గ్రంథములో **(9-4) "నొసళ్లయందు దేవునిముద్ర లేని మనుష్యులకే తప్ప భూమిపైనున్న గడ్డికైననూ, ఏ మొక్కకైననూ, మరి ఏ వృక్షముకైననూ హాని కలుగజేయకూడదని వాటికి ఆజ్ఞ ఇవ్వబడెను"** అని కలదు.

దేవుని ముద్రను మేము ఒక్కరమే కాక నా జ్ఞానము తెలిసిన వారందరూ ధరించడము జరుగుచున్నది. దేవుని ముద్ర ధరించని వారినే

బాధించమని వారికి తప్ప  గడ్డికైనా, చెట్లకయినా హాని కలిగించకూడదని దేవుని ఆజ్ఞ అయివుండడమును చూస్తే  మాకు తెలియకుండానే మేము దేవుని ముద్ర ధరించుచున్నందుకు, అది ఎంత మేలో అప్పుడు అర్థమయినది. దేవుని ముద్ర ధరించిన వారికి ఎన్నో బాధలు లేకుండా పోయాయని ఆ వాక్యముతో తెలిసిపోయినది.  ఈ విధముగా మా జ్ఞానము మిగతా రెండు గ్రంథములలో కనిపించడము వలన, మేము అందరము ధరించు చిహ్నము (ముద్ర) రెండు గ్రంథములలో ఉండడము వలన  ఈ జ్ఞానము, ఈ చిహ్నములు  ఒక మతమునకు సంబంధించినవి కావు అని తెలిసిపోయినది. మా త్రైతసిద్ధాంత జ్ఞానమంతయూ ఒక మతమునకు పరమితమైనది కాదనీ, ఇది మూడు మతములకు సంబంధించి యున్నదని అర్థమయి పోయినది. అప్పటినుండి మా జ్ఞానము ఒక్క హిందువులకే కాదు  మిగతా మతముల వారికి కూడా అవసరమేయని చెప్పుచున్నాము.  మేము 1978లో దేవుని జ్ఞానమును అనుసరించి అక్షర పరబ్రహ్మయోగములోయున్న రాత్రి పగలు, శుక్లపక్ష, కృష్ణపక్షములు, ఉత్తరాయణ, దక్షిణాయణముల జ్ఞానమును బట్టి, మనిషికున్న కర్మలనుబట్టి, అట్లే మనిషికున్న గుణములనుబట్టి మొత్తము దైవజ్ఞానమునుబట్టి దేవుని చిహ్నమును గీయడము జరిగినది.  దానితోపాటు జీవాత్మ ఆకారమును, జీవాత్మ ఆకారముతోపాటు మనస్సు, బుద్ధి, చిత్తము యొక్క ఆకారములను సులభముగా చిత్రించగలిగాము.

సూక్ష్మముగాయున్న మనస్సుకు, బుద్ధికి, చిత్తమునకు, అహము నకు, జీవునికి ఆకారములను చూపడమేకాక దేవుని ముద్ర ఆకారము అందరికీ తెలిసిపోవునట్లు గీచి చూపడమైనది.  అప్పటినుండి నా బోధలు అన్నియూ వేరుగా ప్రత్యేకముగా కనిపించినవి.  దానివలన మేము వ్రాయు జ్ఞానమంతయూ క్రొత్తదిగా సంచలనాత్మకముగా యుండుట వలన  నన్ను

అందరూ **"సంచలనాత్మక రచయిత"** అని అన్నారు. నేను అప్పటినుండి ఇప్పటి వరకు 80 గ్రంథములను వ్రాయడము జరిగినది. ఇది 77వ గ్రంథము. త్వరలో నూరు (100) గ్రంథములు వ్రాయబడుతాయని అనుకొంటున్నాను. నేను అన్ని గ్రంథములలోనూ **'త్రైత సిద్ధాంత జ్ఞానము'**ను ఆధారము చేసుకొని వ్రాశాము. అట్లే 'దేవుని ముద్ర'ను చూపుతూ గ్రంథములు వ్రాశాము. త్రైత సిద్ధాంతము భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగమున కలదని అక్కడ నుండి తీసి చూపాము అని అనుకొనేవాడిని. అయితే భగవద్గీత సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము, తర్వాత అది ప్రథమ దైవగ్రంథముగా రూపొందినది. తర్వాత అదే జ్ఞానమే అనగా సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే తర్వాత చెప్పబడినది. అదే జ్ఞానమే బైబిలు, ఖురాన్‌గా తయారయినది. మూడు గ్రంథములలోని జ్ఞానము ఒకే దేవునికి సంబంధించినదని చెప్పుచునే యున్నాము. **దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే.** అటువంటప్పుడు 'త్రైత సిద్ధాంతము' భగవద్గీతలో యున్నప్పుడు, మిగతా రెండు గ్రంథములలో కూడా అదే ఉండవలెను కదా!యని ఆలోచన వచ్చినది. భగవద్గీతలో అక్షర పరబ్రహ్మయోగమున గల దేవుని చిహ్నము తర్వాత రెండు గ్రంథములలో యున్నట్లు తెలిసిపోయింది. భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున గల త్రైత సిద్ధాంతము, క్షర, అక్షర, పురుషోత్తమ జ్ఞానము మిగతా గ్రంథములలో కూడా ఉంటుందియని అనుకొన్నాము. భగవద్గీతలో త్రైత సిద్ధాంతము గల పురుషోత్తమ ప్రాప్తి యోగమున గల 16, 17 శ్లోకములను చూస్తాము.

*శ్లో॥ 16.* *ద్వావిమౌ పురుషౌ లోకేక్షర శ్చాక్షర ఏవచ ।*
*క్షర స్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ॥*

**భావము :- "భూమిమీదగల పురుషులలో క్షరుడు, అక్షరుడు అను వారు**

**గలరు. సర్వజీవరాసులందు జీవుడుగా క్షరుడు గలడు. అక్షరుడు జీవునితోపాటు (క్షరునితో పాటు) శరీరములోనే యున్నాడు. జీవాత్మ నాశనము అగు క్షరుడుగా చెప్పబడ్డాడు. ఆత్మ నాశనము కాని ఆత్మగా చెప్పి అక్షరునిగా చెప్పబడ్డాడు. క్షరుడు, అక్షరడు ఇద్దరు శరీరమందు గలరు."**

శ్లో॥ 17. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

భావము :- **"క్షరుడు అక్షర పురుషులకంటే ఉత్తముడగు పురుషుడు అన్యముగా మూడవవాడుగా శరీరములోనే గలడు. అతనినే పురుషోత్తముడు అని అంటున్నాము. అతనినే పరమాత్మయని అంటున్నాము. పరమాత్మ శరీరములోయుంటూ ముల్లోకములు అవహించియున్నాడు. అతనినే దేవుడు అని అంటున్నాము."** క్షరుడు జీవాత్మకాగా, అక్షరుడు ఆత్మకాగా, పురుషోత్తముడుగా పరమాత్మ యున్నాడు. ఈ రెండు శ్లోకములు భగవద్గీతలోయున్నా అందులో త్రైత సిద్ధాంతమున్నదని ఎవరూ తెలియ లేకపోయారు. మిగతా రెండు గ్రంథములకు భగవద్గీత ఆధారముగా యున్నదనీ, మిగతా రెండు గ్రంథములు భగవద్గీతను సత్యగ్రంథముగా అంగీకరించుచున్నాయని, అందులో దైవ జ్ఞానమున్నదని ధృవీకరించు చున్నాయని చెప్పుచున్నారు. భగవద్గీత ఒక జ్యోతి, మార్గదర్శినిగాయున్నది. అట్లే మిగతా రెండు గ్రంథములలో జ్యోతిగా యున్నదనీ, మార్గదర్శకముగా యున్నదనీ చూస్తూనే చెప్పవచ్చును. మూడిటియందు ఒకే జ్ఞానమున్నప్పుడు **"త్రైత సిద్ధాంతము"** మిగతా రెండు గ్రంథములలో తప్పకయుంటుందియని రెండు గ్రంథములలో వెదికాను. మొదట బైబిలు గ్రంథములో మత్తయి సువార్త 28వ అధ్యాయమున 19వ వచనమున మూడు ఆత్మలను

గురించియుందని చూచాను. అది ఇలా కలదు **(మత్తయి 28-19,20) "కాబట్టి మీరు వెళ్ళి సమస్త జనులను శిష్యులుగా చేయుడి. తండ్రి యొక్కయు, కుమారుని యొక్కయు, పరిశుద్ధాత్మ యొక్కయు నామములోనికి వారికి బాప్తిస్మమిచ్చుచూ నేను మీకు ఏయే సంగతులను ఆజ్ఞాపించితినో వాటినన్నిటినీ గైకొనవలెనని వారికి బోధించుడి. ఇదిగో నేను యుగ సమాప్తి వరకు సదాకాలము మీతో కూడా యున్నానని వారితో చెప్పెను"** అని ఉన్నది. ఇక్కడ తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయని కొద్దిగా ముందు వెనుకాల చెప్పడమైనది. కుమారుడు, తండ్రి, పరిశుద్ధాత్మయని వుంటే అందరిలాగా భగవద్గీతలోని 'క్షర, అక్షర, పురుషోత్తమ' అను మూడు ఆత్మల మీదికి దృష్ఠి పోయెడిది. అలా భగవద్గీతలోని శ్లోకము యొక్క విషయమే ఇక్కడున్నది అని తెలియనట్లు కొంత మార్చి చెప్పారు. తండ్రియనగా అక్షరుడు, కుమారుడు అనగా క్షరుడు, పరిశుద్ధాత్మయనగా పరమాత్మయని తెలిస్తే "త్రైత సిద్ధాంతము" బైబిలులో కూడా కలదని అర్థము కాగలదు. భగవద్గీత లోనూ బైబిలు గ్రంథములోనూ ఒకే సిద్ధాంతము కలదని తెలిసిపోయినది. నేను బైబిలును చూడకముందు భగవద్గీతను చూచి అందులో ఎవరూ గుర్తించలేని '**త్రైత సిద్ధాంతము**'ను గుర్తించగలిగాము. తర్వాత భగవద్గీతను అనుసరించి పుట్టిన, భగవద్గీత జ్ఞానముతోనే నిండిన బైబిలులో మూడు ఆత్మల జ్ఞానముంటుందని వెదికినాను. నేను ఊహించినట్లే దొరికినది. తర్వాత ఖురాన్ గ్రంథములో కూడా త్రైత సిద్ధాంతము ఉంటుందని అనుకొన్నాను.

ఖురాన్ గ్రంథమును కూడా చూడను మొదలు పెట్టాను. ఖురాన్ గ్రంథములో కొన్ని వాక్యములు చాలా నిగూఢముగా ఉన్నట్లు తెలిసింది.

సూరా ఐదులోనికి పోయి చూస్తే అందులో **'తౌరాత్ గ్రంథము'** అనుసరించి ఖురాన్ గ్రంథము, బైబిలు గ్రంథమున్నట్లు వ్రాసియుండడమును చూచాను. తౌరాతు గ్రంథము అనగా అప్పుడు అర్థము కాలేదుగానీ, తర్వాత భగవద్గీతయే తౌరాతు గ్రంథమని తెలిసిపోయింది. **ఖురాన్ గ్రంథము 114 సూరాలతో, 6236 వాక్యములతో యున్నది.** అన్ని సూరాలను చూస్తూపోగా **50వ సూరాలో 21వ వాక్యము**నందు **'త్రైత సిద్ధాంతము'** ఉన్నట్లు నేను గుర్తించగలిగాను. భగవద్గీతలో చెప్పినదానికంటే ఖురాన్‌లో చెప్పినది ఒకే సిద్ధాంతమే అయినా కనుగొనుటకు అవకాశము లేకుండా చెప్పారు. ఇక్కడ ఖురాన్‌లో కూడా అదే విధముగా చెప్పబడియున్నది. ఖురాన్‌లో యున్నది త్రైత సిద్ధాంత జ్ఞానమే అయినా బైబిలు, భగవద్గీతకంటే భిన్నముగా కనుగొనుటకు అవకాశము లేకుండా చెప్పారు. ఎట్లు చెప్పినా నేను త్రైత సిద్ధాంతమని పేరుపెట్టి చెప్పిన జ్ఞానము మూడు గ్రంథములలో యుండడమును చూచి సంతోషమైనది. ఖురాన్ గ్రంథములో 50వ సూరాలో 21వ ఆయత్‌నందు గల వాక్యమును చూస్తాము. **(50-21) "ప్రతి జీవాత్మ (ప్రతి ప్రాణి) తోలేవాడితో, మరొక సాక్ష్యమిచ్చే వాడితో సహా వస్తుంది"** మరొక గ్రంథములో **(50-21) " ప్రతి వ్యక్తి తనవెంట తనను తీసుకవచ్చేవాడొకడు, సాక్ష్యమిచ్చే వాడొకడు ఉన్న స్థితిలో హాజరవుతాడు"** అని కలదు. ఈ వాక్యము వేరు విధముగా కనిపించినా ఇది త్రైత సిద్ధాంత వాక్యమని తెలిసిపోయినది. ప్రతి జీవాత్మ లేక ప్రతి వ్యక్తి అని చెప్పబడినది జీవున్ని గురించేయని అర్థమగుచున్నది. జీవాత్మ అనగా నాశనమగు క్షర పురుషుడు అనియూ, తోలేవాడు లేక నడిపేవాడు అనగా అక్షర పురుషుడైన ఆత్మయనియూ, సాక్ష్యముగానున్నవాడు ఏమీ చేయని పురుషోత్తముడు లేక పరమాత్మయనియూ తెలిసిపోవుచున్నది.

మూడు గ్రంథములలోనూ మూడు వాక్యములు చూస్తూనే గుర్తుపట్టలేనంతగా వేరువేరు విధానములుగా చెప్పబడియున్నాయి.

త్రైత సిద్ధాంత వాక్యములు మూడు గ్రంథములలో ఉండడము, అదే గ్రంథములలో **దేవుని చిహ్నము లేక దేవుని ముద్రను** గురించి చెప్పి యుండడమును చూస్తే దేవుని బోధను నేను చెప్పానా, లేక నా బోధను దేవుడు చెప్పాడా అని ఆలోచన వచ్చినది. ఎలాగయితేనేమి ఎవరికీ తెలియదను దేవుని ముద్ర మూడు గ్రంథములలో చెప్పియుండడము నాకు బలమును చేకూర్చినట్లయినది. **నేను గీచిన దేవుని ముద్ర ఆకారము గానీ, దాని పేరుగానీ ఎవరూ వినలేదు, ఎవరూ చూడలేదు. ఎవరికీ తెలియనిది మూడు దైవగ్రంథములలో యుండడమును చూచిన తర్వాత నా జ్ఞానము మీద దేవుని దృష్టియుందని, దేవుని జ్ఞానము మీదనే నేనున్నానను నమ్మకము నాకు కల్గినది. ఏది ఏమయినా దైవగ్రంథములలో గల దేవుని చిహ్నము లేక దేవుని ముద్రయొక్క ఆకారమును చూపిన వ్యక్తిని నేనే అయినందుకు, నా చేత నా ఆత్మ ఆ ఆకారమును గీచినందుకు నా ద్వారా ప్రపంచమునకు దేవుని ముద్ర కనిపించడము నాకు కొంత సంతోషమే కదా!** దేవుని చిహ్నము యొక్క ఆకారము జ్ఞానముతో కూడుకొన్నదై యున్నది. అంతేకాక అందరికీ తెలియని విషయము గ్రంథములో కూడా వ్రాయని విషయము ఒకటి గలదు. అదేమనగా! **ప్రతి మనిషి నుదుటి భాగములో తలయందు దేవుని చిహ్నము అదృశ్య రూపముగా నేను చూపిన ఆకారములోనే గలదు. నేడు దేవుని ముద్ర జ్ఞానమును తెలిసినవారు తమ నుదుటి మీద ధరించగా దానిని జ్ఞానము లేనివారు దేవుని ముద్రను ధరించడము లేదు. అయితే ధరించని వారి తలలో తల మధ్య భాగమున నుదుటికి ఎదురుగా దేవుని చిహ్నము లేక**

**దేవుని ముద్ర అదృశ్యముగా యున్నది. ప్రతి మనిషిలోను, మతము ఏదయినా జ్ఞానమున్నా, జ్ఞానము లేకపోయినా, క్రైస్థవుడయినా, ముస్లీమ్ అయినా, హిందువయినా ప్రతి వానియందు ఎవరికీ కనిపించక వారి తల మధ్య భాగములో మెదడుయందు, పాలభాగమునకు (నుదుటికి) ఎదురుగా లోపల అదృశ్యరూపముగా దేవుని చిహ్నము నిక్షిప్తమై యున్నది. మూడు మతముల గ్రంథములలో అదే దేవుని ముద్రను గురించి వ్రాశాము. ఇంకొక విషయమేమనగా! మనుషుల జాతిలోనేకాక మిగతా అన్ని జాతుల జీవరాశుల తలలో కూడా దేవుని ముద్ర అదృశ్యముగా యున్నదని తెలియుచున్నది.** ఈ దేవుని ముద్రను గురించి భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున మొట్టమొదటి శ్లోకములోనే చెప్పి యున్నారు. దానిని క్రింద చూడండి.

శ్లో॥ 1. ఊర్ధ్వ మూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥

భావము :- **"పైకి వేర్లు క్రిందికి కొమ్మలు గలది, నాశనము లేనిది, వేదములు ఆకులుగా గలది, అర్థము కానిదని చెప్పనట్లు అశ్వర్థము అనుపేరు కల్గిన దేవుని ముద్ర లేక దేవుని చిహ్నము ప్రతి మనిషి శరీరములోనూ గలదు."**

ఈ శ్లోకము యొక్క భావములో ఇంతవరకు అశ్వర్థమనెడి వృక్షము పైకి వేర్లు, క్రిందికి కొమ్మలు కల్గియున్నదని వృక్షమువలె పోల్చుకొన్నాము. **వృక్షముగా పోల్చినదే దేవుని ముద్ర** అని తెలియవలెను. అదే దేవుని ముద్ర భగవద్గీతలోనేకాక బైబిలు, ఖురాన్ గ్రంథములలో కూడా చెప్పబడినది. అంతటి గొప్ప దేవుని ముద్రనే త్రైత సిద్ధాంత జ్ఞానము తెలిసినవారు ధరించుచున్నారు. తెలియనివారు ధరించడము లేదు. పైకి ధరించినా, ధరించక పోయినా అది ప్రతి జీవరాసి శరీరములో తలయందు దేవుని

ముద్ర గలదు. దేవుని చిహ్నమున్నవాడే ప్రాణములతో యుండును. ఎప్పుడు ముద్ర బయటికి పోవుచున్నదో అప్పుడు అతని ప్రాణము కూడా బయటికి పోవును. మనిషి సజీవముగా యున్నాడు అంటే వానిలో దేవుని ముద్ర యుందని, ఎవడు సజీవముగా లేడు అంటే వాని శరీరములో ముద్ర లేదని చెప్పవచ్చును. అంతగా అందరితో ముడిపడి యున్న దేవుని ముద్ర ఎట్లున్నదో దాని ఆకారమును ఇప్పుడు చూస్తాము. దేవుని ముద్రకు మేము పెట్టిన పేరు బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములని అన్నాము.




ఇంతవరకు **'దేవుని చిహ్నము'** లేక **'దేవుని ముద్ర'**ను గురించి చెప్పుకొన్నాము. దేవుని ముద్రను గురించి మూడు గ్రంథములను గీటురాయిగా చేసి గీటురాయి ప్రకారము చెప్పుకొన్నాము. గీటురాయి శాస్త్రీయతను ఉపయోగించుకొని దేవుని చిహ్నమును వివరించుకొన్నాము. **'నుదుటి మీద దేవునిముద్రను ధరించని వానిని తప్ప మిగతా వారిని**

**ఏమి అనవద్దని దేవదూతలకు దేవుడు చెప్పినట్లు'** ప్రకటనల గ్రంథము 9-4 లో గలదు. 'దేవుని ఆజ్ఞ ప్రకారము దేవదూతలు ఐదు నెలల వరకు తేలు కుట్టినంత బాధతో నొప్పించవచ్చునని దేవుని ఆజ్ఞ గలదు.' అయితే 'చంపకుండా బాధించమనీ, చంపే హక్కు ఇవ్వలేదనీ' కూడా చెప్పినట్లు అక్కడే గ్రంథమునందు గలదు. దేవుని చిహ్నమును ధరించకుండా అనవసరముగా దేవదూతలతో బాధలు తెచ్చుకొనుటకంటే దేవుని ముద్రను ధరించి బాధలనుండి తప్పించుకొను ప్రయత్నము చేద్దాము.

## ఉపవాసములు

**ప్రశ్న :- దేవుని ఆరాధనలైనవి ఎన్నో గలవు. మూడు మతములలో మూడు వేరువేరు విధములుగా దేవుని ఆరాధనలు చేయుచున్నారు. హిందువులు 1) యజ్ఞ 2) దాన 3) వేదపఠన 4) తపస్సులు చేయుచుండగా, క్రైస్థవులు చర్చిలో ఆదివార ప్రార్థన చేయుచున్నారు. ముస్లీమ్‌లలోనికి వచ్చి చూస్తే హిందువులకున్నట్లే వారికి కూడా నాలుగు ఆరాధనలు గలవని చెప్పుచున్నారు. వాటిలో 1) నమాజ్ 2) జకాత్ 3) రోజా 4) హజ్‌గా చెప్పుచున్నారు. ఈ నాలుగులో నమాజ్ దేవుని ప్రార్థన. జకాత్ దేవుని మార్గములో దేవుని కొరకు, దేవుని జ్ఞానము కొరకు డబ్బు ఖర్చు పెట్టడము రెండూ దేవుని కార్యములేయగును. అలాగే హజ్ దేవుని కొరకు యాత్ర చేయడములో కూడా భక్తి భావమున్నది. అయితే రోజా అని పవిత్ర దినములలో ఉపవాసముండడములో ఒక కట్టుబాటుగా యున్నది తప్ప అటు దేవునికిగానీ, ఇటు భక్తునికిగానీ ఏ లాభము లేదు. కొందరు భక్తితో ఉపవాసముండగా, కొందరు కట్టుబాటుయను భయముతో ఉపవాస ముందురు. భయముతోగానీ, భక్తితోగానీ ఉపవాసము ఉండడము వలన**

**ఎవరికీ ఏ ప్రయోజనము కనిపించడము లేదు. ఉపవాస కార్యక్రమము ఆరోగ్యవంతమైనదని తెలియుచున్నదిగానీ భక్తి సంబంధమైనదిగా కనిపించ దము లేదు. ఉపవాసము భక్తి సంబంధమైనదేనా అను సంశయమును మీరు తీర్చవలెను.**

**జవాబు :-** మా లెక్కలో దేవుని ఆరాధనలో ముందు స్థానములోయున్నది నమాజ్, తర్వాత రెండవ స్థానములోయున్నది రోజా (ఉపవాసములు). మూడవ స్థానములో యున్నది జకాత్. నాల్గవ స్థానములోనిది హజ్ అని చెప్పవచ్చును. అయితే మరొక విధముగా చెప్పితే నమాజ్, రోజా రెండు సమానమైనవేనని, ఈ రెండు విధిగా తప్పనిసరిగా చేయవలెనని చెప్పవచ్చును. జకాత్, హజ్ రెండు ధనమున్నవాడు చేయునవి. ధనము లేనివారు, పేదవారు చేయలేనివి. అందువలన అవి ముఖ్యమైనవి కావు. డబ్బున్న వారు చేయవచ్చును. డబ్బులేనివారు చేయక పోయినా ఫరవాలేదు. నమాజ్, రోజా (ఉపవాసములు) రెండు అందరూ చేయవలసి యున్నది. అయితే నేడు ముస్లీమ్‌లు నమాజ్, రోజా చేయుచున్నారు. అయినా వాటిని ఎలా చేయాలో అలా చేయడము లేదు. దారిన నడుస్తున్నవారు నడుస్తున్న దారి తప్పి నడిస్తే చేరవలసిన చోటికి చేరము. అలాగే దేవున్ని చేరాలను చింతతో నమాజ్, రోజా చేయుచున్నా వాటిని సక్రమమైన పద్ధతిలో చేయని దానివలన ఊరికి పోవువాడు దారి తప్పి నడిస్తే ఊరికి పోవాలను ఉద్దేశ్యము నెరవేరదు. ఊరికి పోవాలను ఉద్దేశ్యముతో నడిచినా దారితప్పి నడుచుట వలన అడవికి పోయినట్లు, దేవునివద్దకు పోవాలను ఉద్దేశ్యముతో నమాజ్, రోజా (ఉపవాసములు) చేసినా, భావమును వదలి వేరు విధానములో చేయుట వలన, దేవునివద్దకు చేరకుండా మాయవద్దకు (ఇబ్లీసు వద్దకు) చేరుతున్నాము.

ఇప్పటికయినా దారిని మళ్ళించుకొని సరియైన దారిలో నడచు అవకాశమును దేవుడు కల్పించాడు. ఇంతకు ముందు గ్రంథము మొదటనే ప్రార్థన అంటే ఏమిటి? అను అంశములో **'నమాజ్'** అను శబ్దమునకు అర్థమేమియనీ, నమాజ్ అర్థసహితముగా ఎలా చేయాలను విషయము చెప్పియున్నాము. అలా చేస్తే దేవున్ని నిజముగా ప్రార్థించినట్లగును. అప్పుడు ఆ ప్రార్థన వలన ఫలితముంటుందియని చెప్పుకొన్నాము. ఇప్పుడు కూడా **రోజా** అంటే ఏమిటి? అను వివరమును తెలిసి, రోజాను ఎలా చేయవలెనో అలా చేయగలిగితే రోజా వలన ఫలితముంటుంది. రంజాన్‌కు, రోజాకు అవినాభావ సంబంధము కలదు. అందువలన రంజాన్ నెలలోనే రోజాను చేయడము జరుగుచున్నది. రంజాన్‌కు ఉన్న అర్థమే రోజాకు కలదు. ముస్లీమ్ ప్రపంచము పదములకు అర్థమును వదలివేయడము వలన వాటిని గ్రుడ్డిగా ఆచరించడమే తప్ప వివరము తెలిసి ఏదీ చేయడము లేదు. ఉదాహరణకు భార్యభర్త విడిపోవడమును **"విడాకులు"** అను పేరుతో పిలుస్తాము. 'విడాకులు' అను పదములో విడి+ఆకులు అను రెండు శబ్దములు కలవు. రెండు శబ్దములను కలిపితే 'విడాకులు' అవుతుంది. అయితే 'విడాకులు' అను పదమును పలికినంత మాత్రమున అర్థము తెలియకుండా పలికితే ఏమి ప్రయోజనముండదు.

విడాకుల వివరమును తెలిసితే భార్య భర్త భావము ప్రకారము విడిపోయినట్లు అగును. లేకపోతే అర్థము లేని పని వ్యర్థము అన్నట్లుండును. విడాకులకు భార్యభర్త విడిపోవడానికి ఏమి సంబంధమని అడిగితే పెళ్ళి కుదిరిన రోజు పది తమలపాకులను పెళ్ళి కూతురువాళ్ళు పెళ్ళికొడుకు వారికి ఇవ్వగా, అట్లే పెళ్ళి కొడుకువారు పెళ్ళి కూతురు వాళ్ళకు పది

తమలపాకులను ఇస్తారు. ఈ విధముగా ఆకులు ఇచ్చిపుచ్చుకోవడమును సంబంధము ఇచ్చిపుచ్చుకొన్నట్లవుతుంది. భార్యభర్తలు విడిపోవు రోజు ఐదు ఆకుల కొనలు బయటకు పెట్టి పెళ్ళికూతురు వాళ్ళు పెళ్ళికొడుకు వాళ్ళకు ఇవ్వడము, అట్లే పెళ్ళికొడుకు వాళ్ళు పెళ్ళికూతురు వాళ్ళకు ఐదు ఆకుల కొనలు బయటవైపుకు పెట్టి ఇవ్వడము జరుగుతుంది. అలా చేయడము వలన అప్పటికి వారు విడిపోయినట్లేయగును. ఐదు ఆకులు ఇచ్చి ఐదు ఆకులు వారి ప్రక్కే పెట్టుకోవడము వలన, ఇప్పటికి విడిపోయినా తర్వాత కలుసుకోవచ్చని భావము. అట్లు కాకుండా పది ఆకులు వెనక్కు ఇస్తే తిరిగి ఇంకా ఎప్పటికీ కలుసుకోమని అర్థము. ఈ విధముగా విడి+ ఆకులు=విడాకులకు అర్థము కలదు. అర్థము తెలిసి చేస్తే ఆ పనికి విలువయుంటుంది. అర్థము తెలియక చేస్తే ఆ పని వ్యర్థముగా చేసినట్లగును. అర్థము తెలియక పోవడము వలన, ఆ పనులను చేయకుండా వదలి పెట్టడము కూడా జరుగుచుండును. అలా కాలగమనములో విడాకుల ఆచరణ లేకుండా పోయినది. పెళ్ళి కుదిరినప్పుడు పది ఆకులు పుచ్చుకొనే వారు లేరు. విడిపోవాలన్నప్పుడు విడాకులు ఇచ్చుకునే వారు లేరు. 'విడాకుల కార్యము' కాలగమనములో లేకుండా పోయినది. విడాకులు అంటే ఏమిటో తెలియనివారు చాలామంది కలరు. అయితే కార్యము పోయినా 'విడాకులు' అను పేరు మాత్రము ఇంకనూ మిగిలియున్నది. పేరు మిగిలియున్నది కావున తెలియకుండా పోయిన విడాకుల కార్యమును దాని అర్థమును నేడు మనము చెప్పుకొనుటకు వీలయినది. అలాగే పేర్లు కలిగి ఆచరణలున్నా అర్థము లేని కార్యములు చాలా ఉన్నాయి. అర్థము తెలియని దానివలన ఆచరణలను చేయవలసిన విధముగా చేయలేక పోవుచున్నాము. అటువంటి ఆచరణలలో నమాజ్, రోజా రెండు గలవు.

నమాజ్‌ను గురించి అర్థము, ఆచరణ రెండూ తెలుసుకొన్నాము. ఇప్పుడు రోజాను గురించి చెప్పుకోవడములో రంజాన్ పవిత్ర రోజులలో రోజాను ముస్లీమ్‌లందరూ నిర్వర్తించడము తెలిసిన విషయమే. నమాజ్‌ను పూర్తి అర్థముతో చేయనట్లు, రోజాను కూడా భావముతో కూడుకొన్న కార్యముగా చేయలేకపోవుచున్నాము. రోజాను సక్రమముగా నెరవేర్చాలి అంటే రోజాను గురించి సంపూర్ణముగా తెలియవలెను. ఆ నేపథ్యములో రోజాకు రంజాన్‌కు అవినాభావ సంబంధమున్నదని చెప్పుచున్నాము. ముఖ్యముగా ఒక విషయమును మనము గుర్తు పెట్టుకోవాలి. ఇస్లామ్ మతము బయటకు వచ్చి దాదాపు 1400 సంవత్సరములయినది. అప్పటి నుండి నమాజ్, రోజా ఉన్నట్లు ముస్లీమ్‌లకు తెలుసు. అయితే పూర్వము కృతయుగములోనే రోజా, నమాజ్ అను పదములున్నట్లు తెలియుచున్నది. జరుగబోవు కాలములో ఇవి ఉంటాయి అన్నట్లు కృతయుగములోనే స్వచ్ఛమయిన తెలుగు పదములుగా నమాజ్ మరియు రోజా అను పదములు ఉండేవి. **'నమాజ్'** అనగా తెలుగు భాషలో మూడు అక్షరములకు యున్న అర్థమును ముందే తెలుసుకొన్నాము. తర్వాత దేవుని ఆరాధనలో రెండవది 'రోజా' అను పదము. **'రోజా'** అనగా **'జన్మ నాశనము'** అని అర్థము. నమాజ్‌లో నాకు జన్మవద్దు, నాకు జన్మలేదు అను అర్థము గలదని చెప్పుకొన్నాము. రోజా కూడా దాదాపు అదే అర్థమును కలుగజేయు పదముగా యున్నది.

రోజా పదము రంజాన్ అను పదమునుండి పుట్టుచున్నది. రంజాన్ మాసముగానీ, రంజాన్ ఆచరణగానీ ఆ దినములలో లేదు. అయినా రంజాన్ అని తెలుగు భాషలో పదముండెడిది. 'రంజాన్' అను పదము ఆధ్యాత్మికములోనే ఎక్కువ వాడెడివారు. ఆ కాలములో జ్ఞానమును తెలిసిన

జ్ఞానులు  ఇతరులకు దైవజ్ఞానమును బోధించుచూ రంజాన్ అని పలికించెడి వారు.  దైవజ్ఞానము తెలియాలని గురువులవద్దకు చేరి జ్ఞానము తెలియ కోరు వారికి మొట్టమొదటనే రంజాన్ అని వ్రాసి చేతికి కట్టెడివారు.  రంజాన్ అను గుర్తును కల్గియున్న వారందరూ  దేవుని జ్ఞానము తెలియు మార్గములో యున్నవారని  ఇతరులు తెలుసుకొని వారిని గౌరవించెడి వారు.  ఆనాడు దైవజ్ఞానమును తెలియు విధానములో యున్నవారందరూ, ఆధ్యాత్మిక విద్యను నేర్చు విద్యార్థులుగా యున్నవారందరూ 'రంజాన్' అను మూడు అక్షరముల రాగి పలకనో, ఇత్తడి పలకనో తమ చేతికి కట్టుకోవడముగానీ, తమ మెడలో వేసుకోవడముగానీ చేసెడివారు.  కొందరికి ఇప్పుడు మేము చెప్పు విషయముల మీద అనుమానము రావచ్చును.  కల్పించి చెప్పుచున్నారని అనవచ్చును.  మీరు అలా అనుకొన్నా నేను చెప్పినది మంచినే కదా! చెడును చెప్పలేదు కదా!  నీవు జ్ఞానివి కమ్మని చెప్పుచున్నాను తప్ప అజ్ఞానములోనికి పొమ్మని చెప్పలేదు కదా!  ఇంకొక విధముగా నేను మతములను గురించి కూడా చెప్పలేదు కదా!  పూర్వమున్న సత్యమును చెప్పుచున్నాను.  అదే మీకు తెలియనిది నాకు తెలిసినది.  ఎవరికీ తెలియని ఎప్పుడో మాసిపోయిన విషయములను  మీరు ఎలా చెప్పుచున్నారని అడిగినా  దానికి నా సమాధానము చెప్పువాడను నేను కాదు.  నీవు ఏ దేవున్ని ప్రార్థించుచున్నావో, నీవు ఏ దేవుని కొరకు ప్రాకులాడుచున్నావో, నీవు ఏ దేవున్ని గొప్పగా చెప్పుచున్నావో  ఆ దేవుడే చెప్పుచున్నాడనుకో. సత్యమును  తెలియడములో  సంకోచపడవద్దు.

నేను సామాన్య మానవున్నే అయితే నాలోయున్న మధ్యాత్మ తన జ్ఞానమును బయటికి చెప్పదలచుకొన్నది.  అందరిలో మధ్యాత్మ యున్నా నా ఆత్మ నన్ను ఎన్నుకొని నా శరీరము ద్వారా ఎంతో జ్ఞానమును బయటికి

చెప్పడము నా అదృష్టముగా నేను భావించుచున్నానుగానీ నేను చెప్పుచున్నానను ఉద్దేశ్యము నాలో లేదు. ఇప్పుడు మంచి సమయము వచ్చినది నీ దేవుడే నీకు జ్ఞానమును చెప్పుచున్నాడు. ఇప్పుడు అనవసర చింతనలు చేసి జ్ఞానమును తెలియకపోతే ఎప్పటికీ తెలియలేవు. ఇప్పుడు తప్ప తర్వాత చెప్పువారు ఎవరూ ఉండరు. ఇప్పుడు మేము చెప్పుచున్నది 'రంజాన్' అను పదమును గురించి కదా! రంజాన్ గుర్తు ఎవరివద్ద యుండునో అతడు దేవుని జ్ఞానమును తెలియుచున్నాడని అర్థము. ఆ విధముగా ఆ రోజు ప్రజలకు జ్ఞానమును బోధించు గురువులు రంజాన్ పదమును వ్రాసి కట్టెడివారు. 'రంజాన్' అను పదము ఇప్పటి ఇస్లామ్‌లోనిది కదా! యని కొందరు, పవిత్రమైన ఖురాన్ గ్రంథము అవతరించినది రంజాన్ నెలలోనేయని, అందువలన రంజాన్ నెల పవిత్ర దినములుగా యున్నదని, పవిత్ర దినములలో ఉపవాసముండుట రోజాయని అనుచున్నామని చెప్పుకొనుచుందురు.

రంజాన్, రోజా, నమాజ్ అను పదములు ఇస్లామ్‌లో ఈ రోజు ఉండుట వాస్తవమే. అయితే ఆ రోజు కూడా ఈ పదములే తెలుగు భాషలో మంచి అర్థమును కలిగియున్నవని నాకు బాగా జ్ఞాపకమున్నది. ఈ రోజు దైవజ్ఞానములో ఈ పదములున్నట్లే ఆ రోజు కూడా దైవజ్ఞానములోనే ఈ పదములను ఉపయోగించి చెప్పుకోవడము జరిగెడిది. 'నమాజ్' మూడు అక్షరములకు అర్థమున్నట్లే, 'రంజాన్' మూడు అక్షరములకు అర్థము గలదు. రంజాన్ మూడు అక్షరములనుండే రోజా అను రెండక్షరముల అర్థము పుట్టుకొచ్చినది. రోజాను గురించి తెలియుటకు ముందు రంజాన్ అర్థమును గురించి తెలుసుకోవాలి. మొదట భూమి మీద పుట్టిన భాష తెలుగు భాష. తెలుగు భాషలో **'రం'** అంటే **'నాశనము'**

అని అర్థము గలదు. రంజాన్ పదములో రం+జాన్=రంజాన్ అనుట వచ్చినది. **'జా'** అను శబ్దమునకు **'పుట్టుక'** అని అర్థము కలదని ముందు నుండి చెప్పుచున్నాము. **రంజాన్** అనగా **జన్మ నాశనము** అని అర్థము గలదు.

జన్మను నాశనము చేయునది రంజాన్ అను అర్థముగల గుర్తును మనిషి తగిలించుకోవడము వలన కర్మవలన జన్మ కలుగుచున్నదని, జన్మకు కారణమైన కర్మను నాశనముచేయు జ్ఞానమును తెలుసుకొంటున్నానని బయటికి తెలిపినట్లగుచున్నది. వాస్తవముగా దేవుని జ్ఞానము వలన దైవశక్తి లభించుచున్నది. దైవశక్తినే జ్ఞానశక్తి అనీ జ్ఞానాగ్నియని అంటున్నాము. జ్ఞానాగ్ని గురించి భగవద్గీతయందలి జ్ఞానయోగము అను అధ్యాయములో 37వ శ్లోకమున చెప్పియున్నారు చూడండి.

*శ్లో॥ 37. యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేర్జున।*
*జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥*

**భావము:- "అగ్నిలో ఎన్ని కట్టెలైనా కాలి బూడిద అయినట్లు, జ్ఞానమను అగ్నిచేత సర్వకర్మలు భస్మమై లేకుండా పోవుచున్నవి"** ఈ శ్లోకములో చెప్పినట్లు కర్మ జ్ఞానము వలన పోవుట చేత, వాని జన్మకు కారణమైన కర్మ లేకుండా పోవడము వలన, వాడు ఇక జన్మించక దేవుని సన్నిధానములో చేరిపోవును. అనగా దేవునిలోనికి ఐక్యమై పోవును. అప్పుడు వాని కర్మలు జ్ఞానశక్తిలో నాశనమైపోయినవి కావున వాని జన్మలు కూడా నాశనమై పోయినవి. నాశనమునకు బీజాక్షరము **"రం".** అందువలన కొన్ని మరణ మంత్రముల యందు "రం" శబ్దమును ఉపయోగించుచుందురు. జాన్ అనగా పుట్టుక లేక జన్మ అని అర్థము. జ్ఞానము తెలియుట చేత కర్మ కాలిపోయి జన్మ

నాశనమగుచున్నందున, అదే అర్థమును బయటి ప్రజలు గ్రహించునట్లు జ్ఞానమును తెలియుటలో గురువుల వద్ద ఆధ్యాత్మికమును తెలియు వారందరూ, అనగా బ్రహ్మవిద్యా విద్యార్థులందరూ **"రంజాన్"** అను పదమును వ్రాసిన బిల్లను చేతికిగానీ, మెడకుగానీ ధరించెడివారు. దానిని చూచిన వారు వీరు దైవజ్ఞానము తెలియుచున్నారని గ్రహించెడివారు. జ్ఞానము తెలియు వారివద్ద జ్ఞానాగ్నియుండునను ఉద్దేశ్యముతో వారిని గౌరవముగా చూచెడివారు. ఒకవేళ జ్ఞానాగ్ని గలవారిని అగౌరవపరిస్తే జ్ఞానము లేనివానికి కర్మవచ్చి చేరును. అలా వచ్చి చేరు కర్మ ఎలావుండునంటే సాధారణ మనషిని దూషిస్తే వచ్చే కర్మకంటే జ్ఞానిని దూషిస్తే వచ్చే కర్మ పదింతలు ఎక్కువగయుండును. అందువలన పూర్వము రాజులు సహితము జ్ఞానులయిన వారిని గౌరవించెడివారు. నేడు జ్ఞానము యొక్క విలువ తెలియని చిన్న అధికారులు కూడా జ్ఞానులకు విలువ ఇవ్వక హేళనగా, అగౌరవముగా మాట్లాడుచున్నారు. అనవసరముగా కర్మను నెత్తికెత్తు కొంటున్నారు.

పూర్వము జ్ఞానమును కొంతవరకు తెలిసిన వారు కూడా రంజాన్ గుర్తును అలాగే పెట్టుకొనెడివారు. ఒకమారు జ్ఞానములో ప్రవేశించి రంజాన్ గుర్తును ధరించినవాడు తర్వాత దానిని తీసివేసేవాడు కాదు. అదే రంజాన్ కలియుగములో అంతిమ దైవగ్రంథము వచ్చిన నెల యొక్క పేరుగా ఉండునట్లు దేవుడే మనుషులకు జ్ఞాపకము చేశాడు. అందువలన దైవగ్రంథము వలన నెలను పవిత్ర దినములుగా భావించి, పవిత్ర దినములకు 'రంజాన్' అను పేరు పెట్టడము దైవ సంకల్పమేయని అనుకొంటున్నాను. పూర్వము కృతయుగములో జన్మరాహిత్యమును కోరువారు ధరించెడి రంజాన్ నామము కలియుగములో తిరిగి రావడము

మనుషుల అదృష్టమేయని చెప్పవచ్చును. అయినా నేడు రంజాన్ అను పేరులో ఎంత గొప్పతనమున్నదో మనుషులకు తెలియకుండా పోయినది.

రంజాన్ అను పదమును అనుసరించి రోజా అను పదము పూర్వమే యుండేది. రంజాన్ కర్మను కాల్చు జ్ఞానాగ్ని చిహ్నమైతే 'రోజా' అనునది గురు ఉపదేశమునకు గుర్తుగా యుండేది. రెండు పదములు కృత యుగములో జ్ఞానము నేర్చు శిష్యుల వద్దను, జ్ఞానమును బోధించు గురువుల వద్దను ఉండేవి. ఈ రెండు పదముల అవినాభావ సంబంధము ఆ కాలములో ఎట్లు యుండేదో నేటికాలములో కూడా అలాగే కల్గియుండడము ఆశ్చర్యమైన విషయమే. ఏనాడో తెలియకుండా పోయిన శబ్దములను నేడు కలియుగములో కూడా దేవుడు తెచ్చిపెట్టడము సంతోషించవలసిన విషయము. దేవుడు రంజాన్, రోజాను మనుషుల మధ్యలో పెట్టడము వలన ఇప్పుడు వాటిని గురించి, వాటి విలువను గురించి చెప్పుకొను అవకాశము ఏర్పడినది. ఆ పదములే లేకపోతే ఈ దినము వాటిని గురించి చెప్పుకొనువారము కాదు. జిబ్రయేల్ గ్రహము (సూర్యగ్రహము) తాను పూర్వము చెప్పిన జ్ఞానమునే ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పడము వలన ఆ పదములు ముస్లీమ్‌ల మధ్యలో మిగిలియున్నవి. ఆనాడు వాటికున్న జ్ఞాన అర్థము కూడా తెలియబడుచున్నది.

రంజాన్‌లో గల **'రం'** అను శబ్దమునుండి **'రో'** అను అక్షరము, జాన్ అను శబ్దమునుండి **'జా'** అను అక్షరము బయటికి వచ్చినవి. కృతయుగములో జ్ఞానమును బోధించు గురువులు రోజా అను రెండు అక్షరముల గుర్తును చేతియందుగానీ, మెడయందుగానీ ధరించెడివారు. రోజా అను పదమున్న వారు బోధకులని గుర్తు పట్టెడివారు. **రంజాన్ గుర్తుగలవారు జ్ఞానమును తెలియువారు** అని చెప్పబడుచుండగా, **రోజా**

**అను గుర్తు గలవారు జ్ఞానమును బోధించువారని, బోధకులని, గురువులని చెప్పబడెడివారు.** అంతేగాక రోజా అను గుర్తు ధరించిన వారు రంజాన్ అను గుర్తు గలవారికి ఉపదేశమును బోధించెడివారు. ఆ కాలములో ఉపదేశ కార్యము గురువుల వద్ద శిష్యులు పొందెడివారు. గురువుల నుండి శిష్యులుగా యున్నవారు జ్ఞానమును పొందుచున్నామని బయట ప్రపంచమునకు తెలియునట్లు గురు శిష్య సాంప్రదాయములో ఉపదేశ కార్యము ఉండేది. ఆ కాలములో గురువువద్దనుండి జ్ఞానమును సంపూర్ణముగా పొందిన తర్వాత ఉపదేశ కార్యమును చేసెడివారు. జ్ఞానమును బాగా తెలియగలిగినాము అనువారు గురువుల వద్దనుండి ఉపదేశము తీసుకొనెడివారు. నేడు కూడా గురు శిష్య సాంప్రదాయములో ఉపదేశ కార్యము ఉంది. అయితే పూర్వము శిష్యులుగాయున్నవారు రంజాన్ గుర్తును ధరించిన వారు రోజా గుర్తు గల గురువువద్ద జ్ఞానమును సంపూర్ణముగా తెలిసాము అను నిర్ణయమునకు వచ్చిన తర్వాత ఉపదేశమును పొందేవారు. నేడు అలా జరుగడము లేదు. శిష్యులుగా జ్ఞానమును తెలియగోరువారు గురువు వద్దకు పోయిన మొదటి రోజే ఏ జ్ఞానమును తెలియక మునుపే ఉపదేశ కార్యమును చేయుచున్నారు.

అలా చేయు ఉపదేశము పేరుకు మాత్రమే ఉపదేశముగానీ వాస్తవానికి కాదని తెలియుచున్నది. పూర్వము కృతయుగములో చేయు ప్రతి కార్యము అర్థముతో కూడుకొన్నదై ఉండేది. నేడు అలా కాకుండా అన్నీ అర్థములేని కార్యములను చేయుచున్నాము. **'అర్థము లేని పని వ్యర్థము'** అన్నట్లు వ్యర్థమై పోవుచున్నది. ఇప్పుడు గురువులు ఇచ్చే ఉపదేశమునకు పూర్వము అప్పుడు ఇచ్చే ఉపదేశమునకు ఎంతో తేడా యున్నది. పూర్వము జ్ఞానము తెలిసిన గురువుల నుండి ఉపదేశము

నిజమైన ఉపదేశముగా ఉండేది. 'రోజా' అను గుర్తును కల్గిన గురువులు ఉపదేశమును ఇచ్చేవారు. తీసుకొనేవారు జ్ఞానము తెలిసిన 'రంజాన్' గుర్తును ధరించిన వారుగా ఉండేవారు. రోజాలో **జా** అనగా పుట్టుక, **రో** అనగా నాశనమయినది అని అర్థము. రెండు అక్షరములను కలిపితే పుట్టుక నాశనమయినది, పుట్టుక లేదు అను అక్షరమును రోజా కలుగజేయుచున్నది. రంజాన్ అనగా జన్మను నాశనము చేయునది అని అర్థముకాగా, రోజా రంజాన్ శబ్దము నుండి పుట్టినదైనందున రోజాలో జన్మ నాశనమయినదని అర్థము నిచ్చుచున్నది. **రంజాన్ జరుగబోవు భవిష్యత్తును జన్మ విషయములో చెప్పగా, రోజా జరిగిపోయిన భూతకాలమును జన్మ విషయములో చూపుచున్నది.** జన్మ నాశనమగును లేక జన్మను నాశనము చేసుకొంటాను అని జన్మ విషయములో జరుగబోవు భవిష్యత్తును చూపునది రంజాన్ కాగా, జన్మ నాశనమయినదని జరిగిపోయిన భూతకాలమునకు గుర్తుగా రోజా గలదు అని చెప్పుకొన్నాము. రోజా గుర్తును ధరించి గురువులు, రంజాన్ గుర్తును ధరించి శిష్యులు ఉండేవారనీ, గురుశిష్య సాంప్రదాయముల గుర్తుగా రంజాన్, రోజా అను రెండు పదములు ఉండేవని తెలుసుకొన్నాము.

శిష్యులు జ్ఞానమును తెలియగా, గురువులుగా యున్నవారు ఉప దేశమును ఇచ్చెడివారు. ఉపదేశమును విడదీసి చూస్తే ఉప+దేశము= ఉపదేశము అని చెప్పవచ్చును. అలాగే ఉపనదియనీ చెప్పవచ్చును. ఉప అనగా ప్రక్కనగలది, రెండవదియని అర్థము, అట్లే వేరైనదియని చెప్పవచ్చును. ఒక నదికి ఎన్నో ఉపనదులుండును. నదికి ప్రక్కనవుండి నదితో సంబంధపడి యున్నదానిని 'ఉపనది' అంటాము. అట్లే దేశమునకు ప్రక్క దేశముగా యుండి దేశముతో సంబంధపడి యుండునది 'ఉపదేశము'

అని అంటాము. ఒక మనిషి ఒక దేశములో నివాసము చేయుట సహజము. ఒక దేశములో యున్నవాడు మరొక దేశమునకు పోయి నివాసముంటే అతడు ఉప దేశములో ఉపవాసము చేయుచున్నాడని చెప్పవచ్చును. ప్రక్క దేశములో ఉండడమును ఉపనివాసము లేక ఉపవాసము అని చెప్పవచ్చును. ఎప్పుడయితే ఉపదేశమునకు పోతామో అప్పుడు ఉపవాసమున్నామని అర్థము. ఉపవాసము, ఉపనివాసము అని ఎట్లయినా అనవచ్చును. ఉపదేశము అనగా ఇప్పుడు ఉన్న దేశము కాకుండా వేరే దేశము అని అర్థము. ఉపవాసము అనగా చాలామంది అన్నము తినకుండా ఉండడము అని అనుకొంటారు, అది ఏమాత్రము కాదు. అన్నము (ఆహారమును) తినకుండా యుండడమును 'పస్తుయుండడము' అని అంటాము లేక ఒక్క పద్దుగా యుండడము అని అంటాము. అంతేగానీ దానిని ఉపవాసము అని అనకూడదు. నివాసము అనగా ఒకచోట ఉండడము అని అర్థము దానినే ఉపవాసము అని కూడా అంటున్నారు.

ప్రక్క దేశము యొక్క వివరమును తెలిసి, ప్రక్క దేశమునకు ఎట్లు పోవాలో తెలిసి, ప్రక్క దేశములో ఎలా ఉండాలో తెలిసిన తర్వాత ప్రక్క దేశమునకు పోయి అక్కడి అనుభవములను పొందడమును ఉపదేశ అనుభవము పొందినట్లుయగును. జ్ఞానము వలన మనము చూచుకుంటే ప్రకృతికంటే దేవుడు వేరుగా యున్నాడని తెలిసి, దేవునివద్దకు పోవాలంటే యోగమే మార్గముగా యున్నదని తెలిసి, యోగమును ఆచరించువాడు ఎప్పుడో ఒకప్పుడు ప్రకృతి అనుభవమును వదలి, శరీరములోని ఆత్మ అనుభవమును పొందును. అలా క్రొత్త అనుభవమును జ్ఞానము ప్రకారము పొందడమును ఉపదేశములో ఉపవాసమున్నట్లగును. ఆత్మలోని అనుభవమును యోగిగా యున్నవాడు తెలిసినట్లు, గురువునుండి ఉపదేశము

పొందినవాడు ఉపదేశములోని అనుభవములు తెలియుచుండును. అదే నిజమైన ఉపదేశము. అదే నిజమైన ఉపవాసము. ఉపదేశము పొందినవాడు ఉపవాస అనుభవమును పొందును.

అయితే నేడు రంజాన్, రోజా పదములు ఈనాడు ముస్లీమ్ సమాజములో ఉన్నాయి. అయినా వారు దాని అర్థమును తెలియనివారై యున్నారు. అట్లే ఉపదేశము అంటే ఏమిటో తెలియని ముస్లీమ్‌లు నేడు ఉపవాస కార్యమును అందరూ ఆచరించుచున్నారు. అయితే ఉపవాసము యొక్క జ్ఞానార్థము వారికి తెలియదు. ఆధ్యాత్మిక విద్యలోని అర్థమును తెలియక, ఆహారమును తినకుండా ఉండడము ఉపవాసము అని పొరపడు చున్నారు. ఆధ్యాత్మిక విద్యలో ఉపదేశము గలదు, ఉపవాసము గలదు. **శరీరములోనే ఆత్మను అనుభవిస్తూ ఉండడము ఉపదేశములో ఉపవాసము చేసినట్లగుచున్నది.** ఉపవాస విషయమై ఖురాన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 184లో కొంతవరకు చెప్పారు. అయితే అక్కడ అర్థము చేసుకోవలసిన విధముగా ఎవరూ అర్థము చేసుకోలేదనీ, అందరూ తప్పుగా అర్థము చేసుకొన్నారని తెలియుచున్నది. వాక్యములో ఒకచోట "నీవు అనివార్య కార్యముల వలన ఉపవాసము ఉండలేకపోతే దానికి పరిహారముగా ఒక పేదవానికి భోజనము పెట్టాలి" అని అన్నారు. పేదవాడు అంటే 'అజ్ఞాని' యనీ, భోజనము పెట్టడము అంటే 'జ్ఞానమును అందివ్వడము' అని అర్థము. నీవు అనివార్య కార్యముల వలన శరీరములోని ఆత్మ అనుభవము పొందలేకపోతే, దానికి బదులు కార్యముగా జ్ఞానము తెలియనివానికి జ్ఞానము అనబడు ఆహారమును ఇవ్వడము అని అర్థముండగా, మనుషులు మనుషులకు అన్నదానము చేస్తున్నారు. ఖురాన్‌లోని వాక్యమును ఇక్కడ చూస్తాము. **(2-184) "ఉపవాసము**

**నిర్ణయించబడిన రోజులకు మాత్రమే. కానీ మీలో ఎవరయినా వ్యాధిగ్రస్థులైయుంటే లేక ప్రయాణంలోయుంటే వేరే దినాలలో ఆ ఉపవాసములను పూర్తి చేయాలి. కానీ దానిని పూర్తి చేయడము దుర్భరమైన వారు పరిహారముగా ఒక పేదవానికి భోజనము పెట్టాలి. కానీ ఎవరయినా సహృదయముతో మేలు చేయదలిస్తే అది అతని మేలుకే, కానీ మీరు తెలుసుకోగలిగితే ఉపవాసము ఉండడమే మీకు ఎంతో ఉత్తమమైనది."** ఇక్కడ చెప్పిన దానిని బాగా అర్థము చేసుకోవాలి.

గురు శిష్య సాంప్రదాయములో శిష్యుడు జ్ఞానము తెలియువాడు. గురువు జ్ఞానమును బోధించువాడు అని తెలియగలిగాము. అట్లే జ్ఞానము తెలియువాడు 'రంజాన్' గుర్తును, జ్ఞానమును బోధించువాడు 'రోజా' గుర్తును కృతయుగములో ధరించెడివారని తెలుసుకొన్నాము. ఒక మనిషి శిష్యునిగా జ్ఞానమును తెలియగలిగితే వాడు ఉపదేశమును పొందినవాడగును. ఉపదేశమును పొందినవానిని ఆ దేశమును చూచిన వాడనియే చెప్పవచ్చును. ఉపదేశమును అనగా ప్రక్క దేశమును పొందినవాడు లేక ఉపదేశమును చూచినవానిని మరొక విధముగా రంజాన్‌ను పొందినవాడనీ, రంజాన్‌ను చూచినవాడని చెప్పవచ్చును. **'రంజాన్'** అనగా జ్ఞానమును లేక ఉపదేశమును పొందువాడని తెలుసుకొన్నాము. ఎవడయినా ఎప్పుడు ఉపదేశమును పొందునో లేక రంజాన్‌ను పొందునో వాడు ఆ దేశములో అనగా రంజాన్‌లో నివాసముండును (ఉపవాసముండును). నేను చెప్పినది కృతయుగ కాలములోనిదియైనా ఇప్పుడు కూడా అదే విధానమును పాటించవచ్చును. అప్పుడు జరిగిన విషయము వాస్తవమేననుటకు

సాక్ష్యముగా ఖురాన్ గ్రంథము గీటురాయిగాయున్నది. ఈ గీటురాయిని బట్టి నేను చెప్పినది కట్టుకథ కాదు వాస్తవ విషయమేనని తెలియుటకు సూరా 2లో, 185వ ఆయత్‌ను చూస్తాము. ఇంతకుముందు ఇదే సూరాలో 184వ ఆయత్‌ను చెప్పియున్నాము. ఇప్పుడు 185ను (దివ్య ఖురాన్ సందేశము తెలుగు భాషలో) అను గ్రంథము నుండి చూస్తాము. **(2-185) "రంజాన్ నెల! అందులో దివ్యఖుర్ఆన్ మానవులకు మార్గ దర్శకత్వముగా అవతరింపజేయబడినది. మరియు అందులో సన్మార్గమును చూపే మరియు సత్యాసత్యములను వేరు పరచే స్పష్టమైన ఉపదేశాలున్నాయి. కావున మీలో ఆ నెలను పొందిన వ్యక్తి ఆ నెలంతా విధిగా ఉపవాసముండాలి. కానీ వ్యాధిగ్రస్థుడైన వాడు, ప్రయాణములో ఉన్నవాడు ఆ ఉపవాసాలను వేరే దినము లలో పూర్తి చేయాలి. అల్లాహ్ మీకు సౌలభ్యము చేయకోరు చున్నాడేగానీ, మిమ్ములను కష్టపెట్టదలచుకోలేదు. ఇది మీకు ఉపవాస దినాలను పూర్తి చేయటానికి మరియు మీకు సన్మార్గం చూపినందుకు మీరు అల్లాహ్ మహానీయతను (ఘనతను) కొనియాడటానికి మరియు మీరు కృతజ్ఞతలు తెలుపుకోవటానికి!"**

"అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్" లో ఈ విధముగా 185వ వాక్యమును వ్రాశారు చూడండి. **(2-185) "రంజాను నెల ఖుర్ఆన్ అవతరింపజేయబడిన నెల. ఇది మానవులందరికీ మార్గ దర్శకత్వము. అందులో సన్మార్గముతో పాటు సత్యాసత్యములను వేరు పరచే స్పష్టమైన నిదర్శనాలున్నాయి. కనుక మీరు ఎవరు**

**ఈ నెలను చూస్తారో వారు ఉపవాసముండాలి. అయితే రోగగ్రస్తునిగానో, ప్రయాణికునిగానో ఉన్నవారు ఇతర దినాలలో ఈ లెక్కను పూర్తి చేయాలి. అల్లాహ్ మీకు సౌలభ్యాన్ని సమకూర్చదలచుకున్నాడేగానీ మిమ్ములను కష్టపెట్టదలచటము లేదు. మీరు ఉపవాసాల నిర్ణీత సంఖ్యను పూర్తి చేసుకోవాలన్నదీ, తాను అనుగ్రహించిన సన్మార్గ భాగ్యానికి ప్రతిగా ఆయన గొప్ప తనాన్ని కీర్తించి, తగు రీతిలో మీరు ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకోవాలన్నది అల్లాహ్ అభిలాష"**

ఇదే ఆయత్ (వాక్యము) "ఖుర్ఆన్ మజీద్" గ్రంథములో ఈ విధముగా గలదు చూడండి. **(2-185) "రంజాన్ నెల ఎంత శుభ ప్రదమైనదంటే, అందులో ఖుర్ఆన్ అవతరించింది. అది మానవులకు మార్గదర్శకత్వము. అందులో సన్మార్గానికి సంబంధించిన స్పష్టమైన నిదర్శనాలున్నాయి. ఇంకా అది సత్యాసత్యాలను వేరు పరిచే గీటురాయి. కనుక మీలో ఆ నెలను పొందిన వ్యక్తి ఆ నెలంతా ఉపవాసముండాలి. అయితే వ్యాధిగ్రస్థుడైనవాడు లేదా ప్రయాణంలో యున్నవాడు వేరే దినాలలో వీటిని పూర్తి చేయాలి. అల్లాహ్ మీకు సౌలభ్యము కలుగజేయాలనుకొంటున్నాడు. ఆయన మిమ్ములను కష్టపెట్ట దలచుకోలేదు. మీరు మీ లెక్కను పూర్తి చేసుకోవటానికి, ఈ సన్మార్గానికిగానూ మీరు అల్లాహ్ గొప్పదనాన్ని, ఘనతను**

**కొనియాడడానికి మీరు కృతజ్ఞులై దాసులుగా మెలగటానికి (ఇదంతా చేయబడింది.)**

మరొక గ్రంథము "ఖుర్ఆన్ భావామృతము" అను దానియందు ఇదే వాక్యము ఇలా కలదు చూడండి. **(2-185) "రంజాన్ ఖుర్ఆన్ అవతరించిన నెల. ఈ గ్రంథము మానవాళికి మార్గదర్శిని. ఇందులో ఋజుమార్గమును తెలిపే, సత్యాసత్యాలను, మంచి చెడులను వేరుపరచి చూపే స్పష్టమైన బోధలున్నాయి. కనుక ఇకనుండి మీలో రంజాన్ నెలను పొందేవారు ఈ నెల అంతా విధిగా ఉపవాసము పాటించాలి. అయితే రోగగ్రస్థులు, ప్రయాణికులు (తప్పిపోయిన) ఉపవాసాలను ఇతర దినాలలో పాటించి (ఆ సంఖ్యను) పూర్తి చేయాలి. దేవుడు మీకు సౌలభ్యము చేకూర్చదలచాడుగానీ మిమ్మల్ని ఇబ్బంది పాలుచేయాలని భావించడము లేదు. మీరు ఉపవాసాల సంఖ్యను పూర్తి చేసుకోవడానికి , దేవుడు మీకు సన్మార్గం చూపినందుకు ఆయన ఔన్నత్యాన్ని కొనియాడటానికి, ఆయనకు కృతజ్ఞులుగా ఉండడానికి గాను ఈ సౌలభ్యం ప్రసాదించాడు."**

ఇప్పటికి వరుసుగా తెలుగు అనువాదము చేసిన నాలుగు ఖుర్ఆన్ గ్రంథములలోని వాక్యములను తీసి వ్రాసి చూపించడము అయినది. నాలుగు గ్రంథములలోనేకాక మిగతా గ్రంథములలో కూడా ఈ వాక్యములు మేము పెద్దగా గుర్తించి వ్రాసిన వాక్యమే యున్నది. ఎవరయినా కొద్దిగా బుద్ధిని ఉపయోగించి చూస్తే **'రంజాన్ నెలను పొందడము'** అను పదము

కొంత విచిత్రముగాయున్నది. 'రంజాన్' అనగా 'జ్ఞానము' అని చెప్పాము కదా! "జ్ఞానమును తెలియువాడు రంజాన్ గుర్తును ధరిస్తాడు" అని చెప్పాము కదా! ఇక్కడ అదే అర్థము సరిపోవులాగ పదములు వాడబడినవి. నాలుగు గ్రంథములు చూచినా నాలుగు గ్రంథములలోనూ అలాగేయున్నది. **"ఉప దేశము పొందినవాడు ఉపవాసముండును"** అని చెప్పినట్లు, ఈ వాక్యము లలో అదే అర్థమును తెలియునట్లు **"రంజాన్‌ను పొందినవాడు"** అని చెప్పి యున్నారు. ఈ మాటతో ఇంతవరకు నేను చెప్పినది సత్యమని తెలియు చున్నది. ఇంతవరకు నా మాటను నమ్మనివారు, ఇక్కడ వ్రాసిన వాక్యములతో ఉపదేశము అనినా, రంజాన్ అనినా ఒకే అర్థము కల్గిన పదములని తెలియుటకు అవకాశమున్నది. అట్లే **'ఉపవాసము'** అంటే బయటి అర్థము ప్రకారము 'ఆహారము తినకుండా ఉండడము' అని అనుకోకుండా, అంతరార్థము ప్రకారము **'దైవ చింతన'** చేయడమేనని తెలియుచున్నది.

ఖుర్ఆన్ గ్రంథములో రెండవ సూరాలోనే 185వ ఆయత్‌ను ఇంతవరకు చూచాము. 186వ ఆయత్‌లో మనిషికి అర్థముకాని దైవ సంబంధ విషయములను మనిషి తన శరీరములోని ఆత్మను అడిగితే 'ఎంతటి జ్ఞాన విషయమునయినా తెలుపగలదు' అను విషయమును చెప్పియున్నారు. దేవుడు ఎక్కడో పైన ఆకాశములో ఉన్నాడు అని అనుకోకుండా **'నీకు అత్యంత సమీపములోనే యున్నాడు'** అని వాక్యములో చెప్పడమేకాక, నీవు దైవసంబంధమైన ఏ ప్రశ్నను అడిగినా దానికి సమాధానము ఇచ్చునని యున్నది. అయితే అందరికీ ఆయన సమాధానము ఇవ్వడు. ఎవడయితే దేవుడు తన శరీరమందే యున్నాడని విశ్వసించు చున్నాడో వానికి మాత్రమే సమాధానమిచ్చును. ఒకమారు ఆ వాక్యమును

చూస్తే అందులో ఏముందో మీరే గ్రహించవచ్చును. **(2-186) "నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే నేను వారికి అతి సమీపములోనే ఉన్నాను. పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపును విని జవాబిస్తాను. కాబట్టి వారు సరైన మార్గము పొందటానికి నా ఆజ్ఞను అనుసరించాలి. మరియు నాయందు విశ్వాసము కలిగియుండాలి అని చెప్పు"** ఈ వాక్యమును చూస్తే అందరికీ ఆయన సమీపములోనేయున్నా పిలిచేవాడు పిలిచినప్పుడే నేను పలుకుతాను అనడములో ఆయన అందరికీ పలుకడనీ, ఆయన మీద విశ్వాసము గలవానికి మాత్రమే పలుకగలడని అర్థమగు చున్నది. అలా మనిషి పిలుపు వినిన ఆత్మ దైవికమైన జవాబును ఇచ్చును. ప్రపంచ సంబంధమైన వాటికి జవాబు ఇవ్వడని తెలియవలెను. తర్వాత 187వ ఆయత్‌లోనున్న సమాచారముతో నేడు ముస్లీమ్‌లందరు రంజాన్ నెలలో పగలుపూట అన్నము తినకుండా ఉపవాసము చేయుచున్నారు. అయితే ఈ 187వ వాక్యమును అలాగే అందరూ (ముస్లీమ్‌లు) అర్థము చేసుకొన్నారు. అందువలన ముస్లీమ్‌లందరు **'రోజా'** అను పేరుతో అల్లాహ్ ఆరాధనలో ఒక ఆరాధనగా నెల రోజులపాటు ఉపవాసముంటున్నారు.

రంజాన్ నెలలో ముస్లీమ్‌లు ఆచరించు 'రోజా' అను ఉప వాసములను దేవుడు చెప్పాడా? అంటే దేవుడు చెప్పినట్లు ఎక్కడా కనిపించలేదు. మనుషులు చేయు ఉపవాసములతో దేవునికి పనిలేదు. అంతేకాక 187వ ఆయత్‌లో పగలు ఉపవాస విషయమేకాక, రాత్రిపూట భార్యాభర్తలు ఒకరినొకరు కలుసుకొను విషయమును కూడా చెప్పినట్లు గలదు. భార్యాభర్తలు శారీరకముగా కలుసుకొను విషయముగానీ,

మనుషులు ఉపవాసముండు విషయముగానీ దేవునికి సంబంధ విషయము కాదు. అటువంటప్పుడు దేవుడు ఎందుకు ఈ విషయములను గురించి చెప్పియుండును? అని ప్రశ్న రాగలదు. ఇప్పుడు రెండవ సూరాలోని 187వ ఆయత్‌ను ఇక్కడ చూస్తాము. **(2-187) "ఉపవాస రాత్రులందు మీరు మీ భార్యలతో కలుసుకోవడము మీ కొరకు ధర్మ సమ్మతము చేయబడినది. వారు మీకు దుస్తులు, మీరు వారికి దుస్తులు. మీరు రహస్యముగా ఆత్మద్రోహానికి పాల్పడుచున్నారనే సంగతి అల్లాహ్‌కు తెలుసు. అయినప్పటికీ ఆయన క్షమా గుణముతో మీ వైపుకు మరలి, మీ తప్పును మన్నించాడు. ఇకనుండి మీరు మీ భార్యలతో ఉపవాస రాత్రులందు రమించ డానికి, అల్లాహ్ మీ కొరకు రాసిపెట్టిన దానిని అన్వేషించటానికి మీకు అనుమతివ్వంది. తొలిజాములోని తెలుపు నడిరేయి నల్లని చారలోనుండి ప్రస్ఫుటమయ్యేవరకు తినండి, త్రాగండి. ఆ తర్వాత వీటినన్నిటిని పరిత్యజించి రాత్రి చీకటి పడేవరకు ఉపవాసము ఉండండి. ఇంకా మీరు మస్జిద్‌లలో "ఎతెకాఫ్" పాటించే కాలములో మాత్రము మీ భార్యలతో సమాగమం జరుపకండి. ఇవి అల్లాహ్ నిర్ధారించిన హద్దులు. మీరు వాటి దరిదాపులకు కూడా పోకండి. ప్రజలు అప్రమత్తముగా ఉండేటందుకుగానూ అల్లాహ్ తన ఆయతులను ఇలా విడమరచి చెప్పుచున్నాడు."**

ఈ ఆయత్‌లో 90 శాతము భార్యాభర్తలు ఒకరినొకరు కలుసుకొను విషయముండగా, పది శాతము రాత్రి తినండి, త్రాగండియని పగలు

ఉపవాసముండండియని చెప్పియున్నారు. ఈ విషయమును అందరూ ప్రపంచ సంబంధముగానే చూస్తున్నారు. అయితే ముస్లీమ్‌లకు అర్థమయినది పది శాతము చెప్పిన రాత్రి తినండి, పగలు తినవద్దండి అని చెప్పినదే నూరు శాతము అర్థమయినది. ఈ ఆయత్‌లో చెప్పిన 90 శాతము భార్యాభర్తల సంబంధమును వదలివేసి పదిశాతము రాత్రిపూట తినండి అను విషయమునే చెప్పుకొనుచూ దానినే అందరూ ఆచరిస్తున్నారు. మేము ఈ ఆయత్ చూచిన తర్వాత ప్రపంచ సంబంధముగా అర్థము చేసుకొంటే ఈ విషయమును దేవుడు ఎందుకు చెప్పాడు? ఈ విషయములు ప్రపంచ విషయములైనప్పుడు ఈ విషయములతో దేవునికి ఏమి పని ఉండును? అని ఆలోచించాము. ఈ వాక్యముకంటే ముందు 186వ వాక్యమును చెప్పియున్నందున ఆ వాక్యము ప్రకారము 187వ ఆయత్ మనుషులకు అర్థము కాలేదని తెలిసినది. 'పగలు ఉపవాసము' అను విషయము పూర్తి దైవ సంబంధమైనదని తెలిసిపోయినది. వెనక్కు పోయి 184, 185వ వాక్యములను చూచిన తర్వాత 'ఉపవాసము' అనగా తినే తిండికి సంబంధించిన విషయము కాదనీ దైవికమైన యోగమని, అలా ప్రపంచ ధ్యాస లేకుండాపోయి దైవచింతనలో యుండడము ఉప వాసమగుననీ, దానికి కావలసిన జ్ఞానమును గురువువద్ద నుండి పొందడము ఉపదేశము అనీ, ఉపదేశమును పొందినవాడు, ఉపవాసము ఉండ వలసిందేనని తెలిసి పోయినది. ఉపదేశమునే 'రంజాన్' అని చెప్పినట్లు, రంజాన్, రోజా అను పదములు ఖుర్‌ఆన్ గ్రంథముకంటే ముందే కృతయుగములోనే చెప్పబడినవని తెలిసిపోయినది. దానిప్రకారము నిజమైన ఉపదేశమును పొందిన వానిని 185వ వాక్యములో **రంజాన్‌ను పొందినవాడు** అని వ్రాయబడియుండడము మా భావమునకు చాలా

దగ్గరయినది. అప్పుడు 187వ వాక్యములో వ్రాసిన భార్యాభర్తలు కలుసుకోవడమును ధర్మసమ్మతము చేయబడినదని చెప్పియుండడమును గురించి ఆలోచించగా కొంత విషయము అర్థమయినది. అదేమనగా! అక్కడ చెప్పినది భార్యాభర్త శరీర సంబంధముగా కలుసుకోవడమును గురించి కాదు. భార్యాభర్తలు కలుసుకోవడానికి అనగా లైంగిక విషయముల దగ్గర కూడా దైవ సంబంధమైన ధర్మము ఉంటుందా? యని ప్రశ్న రాక తప్పదు. అలా ప్రశ్నించుకొని చూస్తే ఆ విషయములో దేవుడు ఏమీ చెప్పలేదు అనీ, ఆ పనులన్నియూ వారివారి కర్మలనుబట్టి ముందే నిర్ణయింపబడి యుండునని చెప్పక తప్పదు. ప్రతి చిన్న ప్రపంచ విషయము ముందే వ్రాసిపెట్టబడిన కర్మపత్రము ప్రకారము జరిగి తీరవలసిందే. ఈ విషయములో ధర్మమనునది ఉండదు. ఆ విషయము మీద దేవుడు ఎటువంటి ధర్మనిర్ణయము చేయలేదు. వాక్యమును మనము సరిగా గ్రహించుకోలేదు.

గ్రంథ ప్రారంభమందే మూడవ సూరా మొదటిలోనే ఏడవ ఆయత్‌లో ఈ గ్రంథములో **ముతషాబిహాత్** వాక్యములున్నవని గ్రంథమును బోధించిన జిబ్రయేల్‌గారే చెప్పడమైనది. జ్ఞానమును వాక్యరూపములో బోధించగా అది గ్రంథరూపమై ప్రజలలోనికి పోయినప్పుడు దానిని సరిగా అర్థము చేసుకోలేకపోతే చేసిన పని వ్యర్థమగునని జిబ్రయేల్ మొదటే తాను చెప్పిన వాక్యములలో ముతషాబిహాత్ (సూక్ష్మ అర్థములుగల) వాక్యములున్నవని చెప్పడమైనది. జిబ్రయేల్ ముందే చెప్పినా చాలామంది ముస్లీమ్‌లు ముతషాబిహాత్ వాక్యములున్నట్లుగానీ, వాటికి సూక్ష్మమైన అర్థమున్నది అనిగానీ, బయటికి చెప్పుకోవడము లేదు. ఎవడయినా సూక్ష్మముగా వివరము చెప్పువాడు ఉంటే ఇవి మనుషులు చెప్పు విషయములు కావు దీని అర్థము దేవునికే తెలుసు అని వానిని హేళన చేయుచున్నారు.

మనుషులు స్వయముగా చెప్పలేరు అని నేను కూడా ఒప్పుకొంటాను. అయితే మనిషిలోయున్న దేవుడు చెప్పవచ్చును కదా!యని ఎవరూ అనుకోవడము లేదు. ఈ విధముగా ముతషాబిహాత్ వాక్యముల వివరము మనుషులు తెలియలేక పోయారు.

దేవుడు ముతషాబిహాత్ వాక్యములను చెప్పకుండా స్థూలమైన ముహ్కమాత్ వాక్యాలే చెప్పియుంటే బాగుండేది కదా!యని కొందరు అడుగ వచ్చును. దానికి నా సమాధానము ఏమనగా! దేవుడు అన్నీ తెలిసిన వాడు. ఆయన మనుషులు చదివే వాక్యము మనుషులకు సులభముగా అర్థము కాకూడదనే అటువంటి సూక్ష్మ అర్థముగల వాక్యములను పెట్టాడు. అటువంటి వాక్యములను తెలియాలని ఎవడు తపన పడునో, వానికి 2-186 వాక్యములో చెప్పినట్లు తానే వాని శరీరములోనుండే తెలియజేయును. కష్టమైన వాక్యములు దేవుని మీద నమ్మకము లేనివారికి అర్థము కాకూడదనే ఉద్దేశ్యముతోనే దేవుడు ఉంచడము జరిగినది. నేడు ఎంతో ముస్లీమ్ సమాజము భూమిమీద గలదు. కొన్ని కోట్ల సంఖ్యలో ముస్లీమ్‌లు ఉండగా, అందులో లక్షలు, వేలు, నూర్లు, పదుల సంఖ్యలో కూడా కొన్ని విషయములు సక్రమముగా అర్థమైన వారున్నారని చెప్పలేము. ముస్లీమ్‌లలో ఒక క్రమశిక్షణ గలదు. ఏ ఇతర మతములలో లేని క్రమశిక్షణ ముస్లీమ్‌లలో యుండుటను గొప్పగా చెప్పుకోవచ్చును. అటువంటి గొప్పతనము మిగతా మతములలో లేదనియే చెప్పవచ్చును. అయితే వారి పెద్దలు ఎలా చెప్పితే అలా వినడము క్రమశిక్షణే అయితే అది ప్రపంచ విషయములలో గొప్పగానే కనిపించుచుండును. కనిపించే విధముగా పెద్దల మాటప్రకారము నడువ గల్గుట గొప్ప పనియేయగును. అదే పరమాత్మ (దేవుని) విషయములోనికి వచ్చేటప్పటికి (6-91) ఆయత్‌లో **"నేను చెప్పిన జ్ఞానము మీకుగానీ, మీ**

**పెద్దలకుగానీ తెలియదు"** అని దేవుడే చెప్పియుండుట వలన దేవుని జ్ఞానము వారి పెద్దలకు కూడా తెలియదనియే చెప్పవచ్చును. అందువలన దేవుని జ్ఞాన విషయములో పెద్దలు చెప్పినట్లు వింటాము అనే క్రమశిక్షణే నష్టమును చేకూర్చినది. ప్రపంచ విషయములో గొప్పగా చెప్పబడిన క్రమశిక్షణ జ్ఞాన విషయములో జ్ఞానమును తెలియకుండా చేసినది. పెద్దలు చెప్పినట్లు వినడము వలన వారు చెప్పిన కొన్ని తప్పు భావములు అందరికీ ప్రాకి పోయినవి. ఉపవాస విషయములో అదే జరిగినది. అట్లే భార్యాభర్త కలయిక అను విషయములో అదే జరిగినది.

సూరా రెండు 184, 185 ఆయత్‌లలో చెప్పిన, చెప్పబడిన **'ఉపదేశము'** ఏమిటో అక్కడగల **'ఉపవాసము'** ఏమిటో తెలియకుండా పోయినది. అదే విధముగా 187వ ఆయత్‌లో 90 పాళ్ళు భార్యాభర్తల కలయిక విషయము చెప్పితే అది దంపతుల శారీరక కలయిక క్రిందికి పోల్చుకొన్నారు. అలా అనుకొనే ముందు ఈ విషయములో దేవునికి సంబంధము లేదు కదా! దేవుడు చెప్పునది జ్ఞాన విషయము కదా! కర్మకు సంబంధించిన ప్రపంచ విషయము ఎందుకు చెప్పును? అని కొద్దిగయినా ఆలోచించలేకపోయారు. మనిషికి ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా కష్టములు సుఖములు శరీరములోని జీవునికి చేరుచుండును. ఆహార విషయమునకు వస్తే వాడు చేసుకొన్న కర్మను అనుసరించి వానికి ఏ ఆహారము దొరకవలెనో అది నిర్ణయము ముందే జరిగిపోయివుండును. దేనిని ఎప్పుడు తినవలెనని వ్రాసిపెట్టబడియుంటే అది అప్పుడే లభించును. సుఖ దుఃఖములను ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా మనిషి అనుభవించుట జరుగుచున్న సత్యము. నాలుక ద్వారా రుచి అనే సుఖమును అనుభవించవలసి యుండును. మనిషి ఏ మతస్థుడయినా గానీ అది పైన విషయమేగానీ

లోపల మాత్రము అందరికీ అన్ని మతముల వారికీ ఒకే విధానము గలదు. ఒకే నాలుక ద్వారా మనిషి **రుచి** యను సుఖమునో కష్టమునో అనుభవించ వలసి యుండును. మనిషి ఆహారము నాలుకకు సంబంధించినది. అంటే శరీర ఇంద్రియ సంబంధమైనది. అలాగే భార్యాభర్త శరీర కలయికకు సంబంధించిన విషయము, ఐదు జ్ఞానేంద్రియములలో చర్మమునకు సంబంధించినది. ఇక్కడ ముస్లీమ్‌కని, హిందువుకని, క్రైస్థవులకని వేరువేరు విధానము ఉండదు. శరీరమున్న వారికందరికీ ఒకే విధానముండును. శరీరములో ఐదు జ్ఞానేంద్రియములు వరుసగా ఇలా గలవు. 1) కన్ను, 2) ముక్కు, 3) నాలుక, 4) చెవి, 5) చర్మము. ఈ ఐదు ప్రపంచ సుఖ దుఃఖములకు ద్వారములలాంటివి. వీటివలననే శరీరములోని జీవునికి కష్టసుఖములు చేరుచుండును. ఆహార సుఖము **నాలుక** ద్వారా లోపలి జీవునికి చేరగా, భార్యాభర్తల కలయిక సుఖము **చర్మము** అను జ్ఞానేంద్రియము ద్వారా చేరును. ఈ ఐదు అవయవ సుఖదుఃఖములు మనిషి చేసుకొన్న కర్మనుబట్టి యుండును. ఈ విషయములను దేవుడు మనిషిని జన్మకు పంపినప్పుడే తన తీర్పులో కర్మపత్రముగా వ్రాసి పంపియుండును. కర్మపత్రములో ముందే వ్రాసిన దానిప్రకారమే ఆహారముగానీ, భార్యభర్తలు ఉండడము గానీ జరుగుచుండును. మధ్యలో దేవుడు వీటి జోక్యము చేసుకోడు. జీవుని కర్మనుబట్టి ఆత్మ వానిని తోలుచుండగా, అల్లాహ్ (దేవుడు) సాక్షిగా చూస్తూ యుండును. ఇదే విషయమే సూరా 50, ఆయత్ 21 (50-21)లో చెప్పడమైనది. అక్కడ చెప్పిన వాక్యమును మనుషులు మరువకూడదు.

సుఖదుఃఖములకు అతీతమైనది నిద్ర. దేవుడు మనిషికి కష్ట సుఖములను కర్మబద్ధము చేశాడుగానీ నిద్రను కర్మకు అతీతము చేశాడు.

అందువలన నిద్రలో సుఖము ఉండదు, కష్టము ఉండదు. సుఖదుఃఖ కర్మలు అమలు కానప్పుడు మనిషి నిద్రలోనికి పోవును. మనిషి పగలు మెలుకువగల్గి కర్మలు ఆచరించునట్లు, రాత్రిపూట కర్మలకు అతీతముగా నిద్రపోవునట్లు దేవుడు నిర్ణయించాడు. నిద్రలో శరీరము అను ప్రకృతి (స్త్రీ), పురుషుడు అనబడు ఆత్మ రెండు ఏకమైపోవును. అప్పుడు పురుషుడుగా యున్న ఆత్మగానీ, ప్రకృతి (స్త్రీ)గాయున్న శరీరముగానీ వేరువేరుగా లేకుండా ఒకటిగాయుండును. దానినే 'స్త్రీ పురుషుల కలయిక' అని అంటారు. శరీరములో నివశించు ఆత్మ శరీరముతో కలిసిపోయినప్పుడు నిద్రయగును. అట్లే శరీరమే ఆత్మలో కలిసినప్పుడు కూడా నిద్రయేయగును. అందువలన ఆత్మ శరీరమును కలియవచ్చును. శరీరము ఆత్మను కలియవచ్చును. ఇక్కడ మీకు అర్థమగుటకు శరీరమును ప్రకృతియనీ, ఆత్మను పురుషుడనీ చెప్పడమైనది. భగవద్గీత గ్రంథములో ప్రకృతివలన తయారయిన శరీరమును స్త్రీ అంశయనీ, ఆత్మను, జీవాత్మను, పరమాత్మను ముగ్గురు పురుషులని చెప్పడమైనది. ఆత్మ పురుషుడని చెప్పుచూ ఆత్మ, శరీరము కలిసినప్పుడు నిద్రయగును. అప్పుడు శరీరములో సుఖదుఃఖములను జీవుడు అనుభవించుట లేదు.

సూరా రెండు ఆయత్ 187లో ప్రకృతి ఆత్మలో కలియవచ్చును. ఆత్మ ప్రకృతిలో కలియవచ్చును అను విషయమును 'మీకు మీ భార్యలు దుస్తులు, మీ భార్యలకు మీరు దుస్తులు' అని చెప్పారు. భార్య అనగా భరించబడునది ప్రకృతియనీ, భర్త అనగా భరించువాడు ఆత్మయని తెలియ వలెను. నిద్రను భార్యాభర్తల కలయికగా చూడవలెను. మనిషి రాత్రి పడుకొని నిద్రపోయేదానికి శరీరములో దేవుడు నిర్ణయించాడు. దానినే 'ధర్మసమ్మతము చేయబడినది' అని చెప్పాడు. రాత్రిపూట నిద్ర పోయేది ధర్మసమ్మతము. అందువలన రాత్రిపూట నిద్రపోవడము వలన పాపము

రాదు. పగలు పూట నిద్ర అధర్మము. పగలు నిద్ర ధర్మసమ్మతము కానిది. పగలు నిద్ర పోవువారిని 'మీరు రహస్యముగా ఆత్మద్రోహానికి పాల్పడు చున్నారని' చెప్పాడు. అందువలన రాత్రిపూట నిద్రపోవడము ధర్మసమ్మతము చేయబడినది. అయితే తొలిజాములోని తెలుపు చీకటి నుండి కనిపించే వరకు అనగా, **నాలుగు నుండి ఆరుగంటల వరకు** రెండు గంటలు మీ కొరకు దేవుడు తెల్పిన జ్ఞానమును, వ్రాసిపెట్టబడిన దైవగ్రంథములలో అన్వేషించటానికి అనుమతివుంది అని చెప్పాడు. తెల్లవారుజామున రెండు గంటల కాలము దేవుని జ్ఞానమును గ్రంథములలో వెదకి తెలుసుకొనుటకు దేవుడు అనుమతి ఇచ్చాడు. అందువలన ఆ సమయములో మేల్కొనడము ధర్మసమ్మతమే. మిగతా రాత్రి మేలుకోవడము పగలు చేయవలసిన పనులు రాత్రి చేయడము అధర్మమగును. 'తొలి జాములో తెల్లని సారలు కనిపించే వరకు తినండి, త్రాగండి' అని వున్నది కదా!యని కొందరు అడుగవచ్చును. దానికి నా జవాబు ఇలా కలదు. మీ కొరకు వ్రాసిపెట్టబడిన దానిని అన్వేషించండి అని చెప్పి, ఆ పని చేయవలసింది తెల్లవారు జామున యని చెప్పి, అప్పుడు మీకు చదువువస్తే చదవండి. చదువు రాకపోతే ఇతరుల ద్వారా వినండి అని చెప్పాడు. **'చదవండి, వినండి'** అని చెప్పు మాటను చాటుగా తినండి, త్రాగండియని చెప్పారు. దైవజ్ఞానమంతా అలాగే చెప్పబడుచూ వుంటుంది. దానిని **బుద్ధి శ్రద్ధ** కల్గినవాడు తెలియ గలడు అని (3-7) లో చెప్పడమైనది. తెల్లవారిన తర్వాత వినేది, చదివేది వదలి దానిని ఆచరించుచూ యోగమును (ఉపవాసమును) చేయవలెను. యోగము (ఉపవాసము) అనగా జీవాత్మ, ఆత్మతో కలిసి నివశించడము అని అర్థము. ఆత్మ, జీవాత్మ కలిసియుండు దానిని 'యోగము' అని అంటాము. దానినే వాక్యములో ఉపవాసము అని చెప్పాడు. **పగలు**

## యోగము, రాత్రి నిద్ర, తెల్లవారు జామున జ్ఞానము తెలియుట

మనిషికి ధర్మసమ్మతము చేయుటయని ఈ వాక్యములో తెలిసినది. దేవుడు చెప్పిన విషయమును సూక్ష్మముగానే యోచించాలి గానీ, స్థూలముగా యోచించితే అక్కడ చెప్పిన జ్ఞాన రహస్యము తెలియకుండా పోతుంది. కొందరు పెద్దలు తాము చెప్పు జ్ఞానమును స్థూలముగా చెప్పక సూక్ష్మముగా చెప్పారు.

ఉదాహరణకు కాల జ్ఞానమును (భవిష్యత్తును) వ్రాసిన పోతులూరి వీరబ్రహ్మముగారు తాను చెప్పు జ్ఞాన విషయమును ఎలా సూక్ష్మ జ్ఞానముగా చెప్పాడో, ఆయన చెప్పిన పదములు, వాక్యములు జ్ఞానమే అయినా ఎలా అర్థము కాకుండా యున్నదో ఒకమారు చూడండి.

**ఆహా !బ్రహ్మాండమైనది ఆది మంత్రము మన బ్రహ్మంగారు చెప్పినది పెద్ద మంత్రము.**

**1) రెక్క ముక్కులేని పక్షి రేయి పగలు తపస్సు చేసి ఒక్క చెరువు చేపలన్నీ ఒకటే మ్రింగెను. "ఆహా"**

**2) ఇంటి వెనుక తుట్టె పురుగు ఇంటిలోని అందరిని మ్రింగె, చూడవచ్చిన జనులనెల్ల చూచి మ్రింగెను. "ఆహా"**

**3) కాళ్ళు చేతులు లేనివాడు కడువ ముంత చేత పట్టి నిండు బావి నీళ్ళన్ని ఒకడే ముంచెను "ఆహా"**

**4) ఏటి మీద స్వాతి కొంగ వేటలాడుచురాగ చాటునున్న మీనుపిల్ల అట్లే మ్రింగెను "ఆహా"**

**5) చెప్పినాడు వీరదాసు చోద్యముగాను ఆత్మ తత్త్వము, గొప్పవారు దీని భావము విప్పి చెప్పితే చాలు "ఆహా"**

**దీని అర్థమేమనగా :-** గొప్ప మంత్రము బ్రహ్మముగారు చెప్పినది. ఆ మంత్రము మన శ్వాసయే. శ్వాస లోనికి ప్రవేశించినపుడు **"సో"** అను శబ్దముతో, బయటికి వచ్చునపుడు **"హం"** అను శబ్దముతో చలించుచున్నది. ఈ రెండు శబ్దములు కలిసి **"సోహం"** అను శబ్దము ఏర్పడినది. ఈ శబ్దము మహిమకలది కావున దీనిని మంత్రము అని చెప్పాడు. మరియు అక్షర సమ్మేళనములతో కూడుకొన్నది కావున మంత్రము అని చెప్పబడినది. "సోహం" అను మంత్రము ఆది మంత్రముగా మారుచున్నది. అది ఎట్లున్నదనగా! "సో" అను శబ్దమునందు చివరిగా **"ఓ"** అను శబ్దమున్నది. "హం" అను శబ్దమునందు చివరిగా **"మ్"** అను శబ్దమున్నది. ఒక్కమారు శ్వాస లోపలికి పోయి బయటికి వస్తే "సోహం" అను మంత్రము ఏర్పడు చున్నది. ఆ సోహం మంత్రమునందే **"ఓమ్"** అను శబ్దము ఇమిడి ఉన్నది. కావున "సోహం" తల్లి, "ఓమ్" శిశువు. "ఓం" ప్రపంచ పుట్టుకలో మొదట పుట్టిన శబ్దము కావున దీనిని ఆది మంత్రము అనుట సంభవించి నది.

**1) రెక్క ముక్కు లేని పక్షి రేయి పగలు తపస్సు చేసి**
**ఒక్క చెరువు చేపలన్ని ఒకటే మ్రింగెను.**

**వివరము :-** ముక్కు పుటములందు ప్రవేశించు శ్వాసకు ఆకారము లేదు. కావున 'రెక్క ముక్కులేని పక్షి' అని చెప్పారు. శ్వాస రేయి పగలు విడువక సోహం అను మంత్రమును జపించుచున్నది. కావున 'పక్షి రేయి పగలు తపస్సు చేసే' అని చెప్పారు. ఈ శ్వాసయే శరీరములోనికి ప్రవేశించి కుంభకము ద్వారా నిలిచి శరీరములోనున్న కదలికలను (చైతన్యముల) అన్నిటినీ నిలిపి వేయుచున్నది. కావున 'చెరువులో అనేక విధములుగా చలించు చేపలన్నిటిని మ్రింగెను' అని చెప్పారు.

**2) ఇంటి వెనుక తుట్టె పురుగు ఇంటిలోని అందరిని మ్రింగె.**
**చూడవచ్చిన జనులనెల్ల చూచి మ్రింగెను.**

**వివరము :-** శ్వాస ఎల్లవేళల "సోహం" అను శబ్దము చేయుచున్నది. కావున 'గీ' మని అరచు తుట్టె పురుగుగా చెప్పినారు. శ్వాసకు ఆధారము శరీరములో కనపడక ఉన్న బ్రహ్మనాడిలోని చైతన్యము. కావున 'ఇంటి వెనుక తుట్టె పురుగు' అని చెప్పినారు. ఇల్లు అనగా శరీరము. శ్వాస కుంభకము ద్వారా శరీరములోనున్న వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపాన వాయువులన్నియూ బంధింపబడుచున్నవి. కావున 'ఇంటిలోనందరిని మ్రింగెను' అని చెప్పియున్నారు. శ్వాస కుంభించిన తర్వాత ఊపిరితిత్తులు ఖాళీవల్ల రెండు లేక మూడుసార్లు కొద్దికొద్దిగా బయటి గాలి లోపలికి ప్రవేశించి, ప్రవేశించిన గాలి తిరిగి బయటికి రాక నిలుచుట వలన 'చూడవచ్చిన జనులనెల్ల చూచి మ్రింగెను' అని చెప్పినారు.

**3) కాళ్ళు చేతులు లేనివాడు కడవ ముంత చేత పట్టి**
**నిండు బావి నీళ్ళన్ని ఒకడే ముంచెను.**

**వివరము :-** శ్వాసకు రూపములేదు కావున 'కాళ్ళు చేతులు లేనివాడని' చెప్పినారు. శ్వాస ముక్కు రంధ్రములలో ఒక దానియందు ఎక్కువ ఒక దానియందు తక్కువ లోపలికి బయటికి చలించుచున్నది, ఎక్కువ శ్వాసను కడవ అని, తక్కువ శ్వాసను ముంతని పోల్చి చెప్పారు. కావున 'కడవ ముంత చేతపట్టి' అని చెప్పారు. శరీరములోని తలంపులన్ని శ్వాస ఒక్కటి నిలుపడము వల్ల నిలిచి పోవుచున్నవి. కావున 'బావి నీళ్ళన్నీ ఒక్కడే ముంచెను' అని చెప్పడమైనది. శరీరమును బావిగా పోల్చడమైనది.

**4) ఏటి మీద స్వాతి కొంగ వేటలాడుచురాగ**
**చాటునున్న మీనుపిల్ల అట్లే మ్రింగెను.**

**వివరము :-** శ్వాస శరీరములో నిలిచిపోయిన దానివలన ఊపిరితిత్తులు తర్వాత నరములు, ఆ తర్వాత సూర్యచంద్ర నాడులు, షట్ చక్రములు ఒకదాని తర్వాత ఒకటి తమ తమ చైతన్యమును కోల్పోవుచున్నవి. కావున 'ఏటి మీద స్వాతి కొంగ వేటలాడుచురాగ' అని చెప్పడమైనది. ఒకదాని తర్వాత ఒకటి తమ చైతన్యములను కోల్పోయినను, ఆఖరున గల ఏడవ కేంద్రము శ్వాస నిరోధమువల్ల తన శక్తిని కోల్పోక నిలిచిన దానివలన, అన్నిటియొక్క చైతన్యములను నిలిపివేసిన శ్వాస ఏడవ కేంద్రము వద్దకు వచ్చి తనశక్తి చాలక నిలిచిపోయిన దానివలన, 'చాటునున్న చేప పిల్ల కొంగను మ్రింగెను' అని చెప్పడమైనది. ఇటువంటి తత్త్వములు ప్రాణా యామమును గురించి ఎన్నియో పెద్దలు చెప్పియున్నారు. కానీ నేటి ప్రజలు వాటికి సరియైన అర్థము తెలుసుకొనలేక జన్మను వ్యర్థము చేసుకొను చున్నారు.

ఇలాంటి సూక్ష్మజ్ఞానమునే **వేమనయోగి** తన పద్యములయందు ఎలా అర్థము కాకుండా వ్రాశాడో చూడండి. వీరు దేవుడు అనుసరించిన మార్గమునే అనుసరించి దేవుడు చెప్పినట్లే తాము చెప్పు జ్ఞానమును సూక్ష్మముగా చెప్పారు. ఒకమారు వేమనయోగి పద్యమును ఒక దానిని చూస్తాము.

**ఇనుమున జేసిన మైనపు కడ్డీ**
**ముంటి మొనను నల్బావుల దొడ్డీ**
**కూర్చుండి మేసిన కుందనపు గడ్డీ**
**విప్పి చెప్పరా వేమారెడ్డీ.**

**భావము :-** మన శరీరములోని మనస్సు అన్ని భాగములకంటే ముఖ్యమైనది. మనస్సు చలించక నిలిచిపోయిన వానికి **ఆత్మదర్శనము** సులభముగా అగును.

వశమైన మనస్సు ఆత్మదర్శనమునకు కారణమగుచున్నది. కావున అది మిత్రునితో సమానముగా చెప్పబడుచున్నది. వశముకాక చలించుచు ప్రపంచ విషయములనే ప్రేరణ చేయుచు ఆత్మదర్శనమునకు ఆటంకపరుచు మనస్సును శత్రువుగా చెప్పబడుచున్నది. ఒక మనస్సే చలించిన ఎడల శత్రువుగా, చలించక నిలిచిపోయిన ఎడల మిత్రునిగా ఉన్నది. కావున మనస్సును ఒకే కడ్డీగ పోల్చి ఆ కడ్డీ ఇనుముగా, మైనముగా రెండు విధములుగా ఉన్నదని వేమన తెల్పుచున్నాడు. చలించు మనస్సు మైనము కడ్డీతో సమానము, ఇష్టమొచ్చినట్లు వంగి పోవుచుండును. చలించక ఏకాగ్రతగ నిలిచిన మనస్సు ఇనుపకడ్డీతో సమానము. అది ప్రక్కకు వంగక భద్రముగా నిలిచి ఉండును.

బయటనున్న జ్ఞానేంద్రియముల ద్వారా వచ్చు విషయములు అన్నియూ మొదట మనస్సుకు చేరును. అట్లు చేరిన విషయములను మనస్సు గ్రహించి ఆ విషయములను లోపల ఉన్న బుద్ధి, చిత్తము, జీవునికి తెలియజేయును. బుద్ధి, చిత్తము చెప్పిన తిరుగు జవాబులను మనస్సు గ్రహించి బయటనున్న కర్మేంద్రియములకు, బాహ్యేంద్రియములకు మనస్సు మధ్యవర్తిగా ఉన్నది. మనస్సు బ్రహ్మనాడి కుండలీశక్తి ప్రారంభమగు భ్రూమధ్య స్థానమునకు ప్రక్కనున్న సూర్యచంద్రనాడుల మీద ఉన్నది. కావున 'ముంటిమొన' అని అన్నారు. అన్ని విషయములు నరాల ద్వారా మనస్సుకు చేరుచున్నవి. అందువలన విషయములను ఆవులుగా పోల్చి అవి అన్నియూ చేరు స్థలమైన మనస్సును 'దొడ్డిగ' పోల్చినారు.

మనస్సు బయటి విషయములను సేకరించి లోపలికి, లోపలి విషయములను సేకరించి బయటకు పంపడమేకాక అన్ని విషయములను జ్ఞాపకము పెట్టుకొను శక్తికల్గి ఉన్నది. అంతేకాక క్రొత్త విషయములను

కూడా జ్ఞాపకము చేయు శక్తి కలదిగా ఉన్నది. ముందు ఒక విషయమును జ్ఞాపకము తెచ్చును. వెంటనే దానిని వదలి ముందు దానికి అనుబంధమైన వేరొక విషయమును తెచ్చును. దానిని వదలి దానికి అనుబంధమైన వేరొక విషయమును తెచ్చును. దానిని వదలి దానికి అనుబంధమైన ఇంకొక విషయమును తెచ్చును. ఈ విధముగా అది ఒకదానికొకటి అనుబంధ విషయములనే జ్ఞాపకము చేయుచూ, చివరికి ఏ విషయమునో తెచ్చి పెట్టును. మొదటి విషయమునకు, చివరి విషయమునకు చూచిన సంబంధములేక ఉండును. మొదలైనది ఒక విషయము, చివరికి నిలిచినది మరొక విషయముండును. మనస్సు విషయ ప్రేరణ చేసిన ఎడల ఎడతెగని విషయములను తెచ్చి పెట్టుచుండును.

కుందనపుగడ్డి పైకి గడ్డిగ కనిపించిన లోపల వేర్లు ఒకదానితో ఒకటి కలిసి ఉండును. కుందనపుగడ్డి వేర్లు కూడా ఎడతెగనివై మనస్సు మాదిరే ఉన్నవి. కనుక 'కుందనపు గడ్డిగ' పోల్చినారు. మనస్సును వదలి పెట్టిన ఎడతెగని చింతనలు చేయుచుండును. కాబట్టి 'కూర్చుండి మేపిన కుందనపు గడ్డి' అని అన్నారు.

పై తత్త్వములో వీరబ్రహ్మముగారు శ్వాసను గురించి నిగూఢముగా వ్రాయగా, క్రింది పద్యములో వేమనయోగిగారు మనస్సును గురించి నిగూఢముగా వ్రాయడమైనది. వీరు వ్రాసిన విషయములను స్థూలముగా పైకి అర్థము చేసుకొంటే ఏమీ అర్థము కాదు. అదే సూక్ష్మముగా అర్థము చేసుకొంటే వారు చెప్పు విషయము సులభముగా అర్థము కాగలదు. దేవుడు కూడా తన జ్ఞానమును ఎక్కువగా సూక్ష్మరూపములోనే చెప్పాడు. దేవుడు సూక్ష్మమైనవాడు గనుక తన జ్ఞానము కూడా సూక్ష్మముగా యుండునట్లు చెప్పాడు. మనము సూక్ష్మముగా ఆలోచిస్తే దేవుడే దానికి

అర్థమును అంతరంగములో తెలియజేయును. ఉదాహరణకు మేము ఒక తత్త్వమును, ఒక పద్యమును చూపి దానికి అర్థమగులాగున వివరమును వ్రాశాము. అర్థము కాని ఆ పద్యమునకు, తత్త్వమునకు దేవుడే నాకు భావమును అందించాడని ధైర్యముగా చెప్పగలము.

అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో చాలా వరకు సూక్ష్మజ్ఞానముతో కూడుకొన్న ముతషాబిహాత్ వాక్యములు గలవు. వాటిని తెలియుటకు అమితమైన శ్రద్ధ, తీక్షణమైన బుద్ధి అవసరము. ఆ రెండు నాకు దేవుడే ఇచ్చాడు. కావున కష్టతరమైన సూక్ష్మతతో కూడుకొన్న 110 వేమన పద్యములకు సులభముగా వివరమును వ్రాయగలిగాను. అట్లే వీరబ్రహ్మము గారి పన్నెండు కఠినమైన తత్త్వములకు వివరమును వ్రాశాము. ఇప్పుడు దేవుడు అంతిమ దైవగ్రంథమును గీటురాయిగా చేసి మనుషులు అర్థము చేసుకొన్న విషయములలో సత్యాసత్యమును తేల్చి చెప్పినట్లు చేశాడు. ఇది దైవకార్యమేగానీ నా కార్యము ఎంతమాత్రము కాదు. ఇదే విధానములో **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"** అని ఒక గ్రంథమును వ్రాశాము. ఇప్పుడు అదే పేరుమీద రెండవ భాగమును కూడా వ్రాయ దలచాము. ఇది దేవుని ప్రేరణ అయినందున అంతిమ దైవగ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథములోని అనేక సూక్ష్మ జ్ఞాన విషయములు విశధముగా తెలియబడగలవని అనుకొంటున్నాను. ఇంతవరకు రంజాన్, రోజా దేవుని ఆరాధనలో భాగముగానే ఇప్పుడు కనిపించినా, ఖురాన్ గ్రంథములో అలాగే కనిపించినా, ఇది పూర్వము మనుషుల మధ్యలో ఇంకొక రూపములో ఇంకొక అర్థముతో యుండేవని తెలిసినది. అప్పటి కాలములోని విషయములను తెలుపువారు ఎవరూ లేకున్నా, ఇప్పుడు దేవుడే ఆ విషయములను మనకు అందివ్వడము జరిగినది. దానిప్రకారము రంజాన్

గురించి, రోజాను గురించి తెలుసుకొన్నాము. పూర్వము ఉన్న ఆచరణ ప్రకారము వీటిని అర్థము చేసుకొని అలాగే ఆచరించితే నేడు అల్లాహ్ చెప్పిన వాక్యములకు కూడా భావము సరిపోవునని తెలియుచున్నది. అట్లుకాని యెడల తప్పు భావములతో దేవుడు చెప్పినది అర్థముకాక తప్పుదారిలో పోవుటకు అవకాశము గలదు. అందువలన దేవుడు పూర్వము చెప్పిన విధానమునే అనుసరిద్దాము.

## తౌరాత్ - తౌహీద్

**'అల్లాహ్'** అను పదము కూడా సృష్టి ఆదిలోనిదే. ఏ విధముగా **'నమాజ్, రంజాన్, రోజా, జకాత్, హజ్'** అను పదములు ఈనాటివి కావో, అలాగే 'అల్లాహ్' అను పదము కూడా ఈ మధ్యకాలములో వచ్చినది కాదు. ఈ పదములన్నియూ సృష్ట్యాదినుండి ఉన్నాయి. అయినా ఎవరికీ తెలియవు. అంతేకాక ఈ పదములన్నియూ ఆనాడున్న తెలుగు భాషలోనివే అయినా, ఆ విషయము ఈనాడు ఏమాత్రము ఎవరికీ తెలియదు. 'అల్లాహ్' అనునది దేవుని పేరు కాదు. ఆయనకున్న బిరుదుయని చెప్పవచ్చును. 'బిరుదు' అంటే ఒక మనిషిలో యున్న గొప్పతనమునకు లేక ప్రతిభకు పెట్టే గుర్తింపుయని తెలియవలెను. 'అల్లాహ్' అనడములో దేవుని యొక్క ప్రతిభ ఏమిటో తెలియగలదు. ఆయన గొప్పతనము ఏమిటో తెలియగలదు. **అల్లాహ్ అంటే హద్దులు లేనివాడు, ఎల్లలు లేనివాడని అర్థము.** ఇట్లు అల్లాహ్ పేరు కాదనీ, దేవున్ని గౌరవముగా పిలిచే బిరుదుయని చెప్పవచ్చును. అలాగే **'దేవుడు' అనగా దేవులాడబడేవాడు, వెతకబడేవాడు అని భావము.** ఆయన ఎవరికీ దొరకడు, కనిపించడు కావున ఆ బిరుదును ఉంచి 'దేవుడు' అన్నాము. అట్లే పరమాత్మయని దేవున్ని ఉచ్ఛరించినా ఆత్మకంటే

వేరుగాయున్నవాడను అర్థమేగానీ, అది ప్రత్యేకించి మనుషులకు పెట్టిన పేరులాంటిది కాదు. **'పురుషోత్తమ'** అనగా **'పురుషులలో ఉత్తమ పురుషుడు'** అని చెప్పడము తప్ప అది పేరుకాదు. ఈ విధముగా దేవున్ని భావముతో కూడిన పదములతోనే, ఆయన ప్రతిభకు తగిన బిరుదులతోనే గౌరవముగా పిలుస్తున్నాము. దీనివలన దేవుడు పేరు లేనివాడని చెప్పవచ్చును. ఇంతవరకు చెప్పిన బిరుదులన్నీ తెలుగు భాషలో గలవే. కృత యుగములో మొదట పుట్టిన భాష తెలుగు. అందువలన నేడు దేవున్ని పిలుచు పదములన్నీ తెలుగు పదములుగానే యున్నవి.

మొట్టమొదట భూమి మీది మనుషులకు జ్ఞానమును చేర్చినవాడు సూర్యుడు. భూమిమీదికి వచ్చి జ్ఞానమును తెలియజేయు శక్తి ఒక్క సూర్యగ్రహమునకు తప్ప ఎవరికీ లేదు. అందువలన మొదట భూమిమీదికి ఖగోళమునుండి స్థూలముగా కాకుండా సూక్ష్మముగా వచ్చి జ్ఞానమును చెప్పినవాడు సూర్యుడే. అదే సూర్యుడే కలియుగములో 'జిబ్రయేల్' అను పేరుతో అప్పుడప్పుడు భూమిమీదికి వచ్చి 23 సంవత్సరములు కొద్దికొద్దిగా ముహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానమును చెప్పాడు. కృతయుగములోనూ, కలియుగములోనూ జ్ఞానమును చెప్పినవాడు ఒక్క సూర్యుడే అయినందున అప్పుడు పూర్వము దేవున్ని గురించి ఉపయోగించిన పదములను, ఆయన ఆరాధన పదములను అప్పటి వాటినే ఇప్పుడు కూడా చెప్పడమైనది. ఇప్పుడు ఖుర్ఆన్ గ్రంథములో గల దేవున్ని, దేవుని ఆరాధనను గురించి చెప్పిన పదములు అరబ్బీ భాషవని అందరూ అనుకోవడము జరిగినది. అయితే సృష్ట్యాదిలో కృతయుగమందే ఆ పదములు ఉండేవని నేడు ఎవరికీ తెలియదు. దేవుని ఆధ్యాత్మిక భావమునకు సరిపోవు అర్థముతో కూడిన తెలుగు భాషలోని పదములే నేడు గలవు. నేడుగల దేవునికి, దేవుని ఆరాధనకు

సంబంధించిన పదములకు అరబ్బీ భాషలో ఆధ్యాత్మికమునకు సరిపోవు అర్థములు తెలుగు భాషలోయున్నట్లు లేవు. నేడు కొందరు అరబ్బీ భాషలో కొన్ని పదములకు అర్థములు చెప్పినా అవి ఆధ్యాత్మిక భావమునకు పూర్తి దగ్గరగాయుండవు. ఉండినా తెలుగు భాషలో యున్నంత దగ్గర పదములుగా ఉండవు. నేడు అరబ్బీ భాషలో కొన్ని పదములున్నా అవి తెలుగు భాషకు దగ్గర సంబంధముగా యున్నట్లు కనిపించుచున్నవి.

నేడు అటువంటి అరబ్బీ పదములను చెప్పుకొంటే అనగా ఆధ్యాత్మికమునకు సంబంధించిన పదములను గురించి చెప్పుకొంటే ముఖ్యముగా **తౌరాత్, తౌహీద్** అను రెండు పదములు గలవు. తెలుగులో **"జ"** అను అక్షరము పుట్టుకకు సంబంధించిన అర్థమును తెలుగు భాషలో తెలియజేస్తున్నదని చెప్పుకొన్నాము. ఉదాహరణకు **'జాతకము'** అనగా పుట్టినప్పుడు నిర్ణయించబడిన కర్మఫలము అని అర్థము. దానిని పూర్వము **'జాఫతకము'** అని అనెడివారు. అయితే కాలక్రమమున జాఫతకములో **'ఫ'** అను అక్షరము పోయి జాతకము అని అసంపూర్ణముగా మిగిలిపోయినది. ఏది ఏమైనా ఆ పదములో **'జ'** అనునది జన్మకు సంబంధించిన భావమును తెలియజేయునదియని చెప్పుచున్నాము. అదే 'జ' అను శబ్దముతో కలిసిన దేవుని ఆరాధనకు ఆధ్యాత్మికమునకు దగ్గర సంబంధమున్న "జ" కారముతో కూడుకొన్న పదములను చూస్తే చాలా కనిపించుచున్నవి. అవి వరుసగా **నమాజ్, జకాత్, రోజా, హజ్, రంజాన్.** అట్లే తౌరాత్, తౌహీద్ అను పదములు 'త్రి' అను శబ్దముతో ముడిబడి యున్నవి. త్రైత సిద్ధాంతమునకు తగులుకొన్న పదములుగా కనిపించుచున్నవి. అంతేకాక తెలుగు భాషలోని భావములకు దగ్గర అర్థముతో కూడుకొని యున్నవి. వీటిని ఆధ్యాత్మిక భావముతో చూడవలెనుగానీ కేవలము భాషా పరిధిలో చూడకూడదు.

'తౌ' అనగా తెలుగు భాషలో మూడుయని అర్థము. ఆధ్యాత్మిక పరిభాషలో మూడు అనునది ఎంతో ముఖ్యమైనది. అరబ్బీ భాషలో ఖుర్ఆన్ గ్రంథమందు 'తౌరాతు', 'తౌహీద్' అను పదములు గలవు. **'తౌరాతు'** యనగా అల్లాహ్ మూసా ప్రవక్తకు ఇచ్చిన గ్రంథమని చెప్పుచుందురు. అట్లే **'తౌహీద్'** యనగా ముస్లీమ్ పెద్దలు ఈ విధముగా చెప్పుచున్నారు. **'ఏక దైవారాధన లేక ఏకేశ్వరోపాసన'**యని చెప్పుచున్నారు. వారు చెప్పునది వాస్తవమే. ఏకేశ్వరోపాసన యనగా! అస్తిత్వమురీత్యాగానీ, ఆరాధన హక్కు విషయములోగానీ, నామాలు, గుణాల విషయములోగానీ దేవుడు ఒక్కడేయని మనసా, వాచా, కర్మణా నమ్మటము అని చెప్పుచుందురు. తౌరాతు అనగా దేవుడిచ్చిన గ్రంథమనీ, తౌహీద్యనగా ఏకేశ్వరోపాసన యని చెప్పుచుందురు. ఈ పదముల గురించి తెలుగు భాషలో నాకు తెలిసిన అర్థమును నేను చెప్పాను. తౌరాత్యనగా మూడు రాత్రులని నేను చెప్పడమైనది. అట్లే తౌహీద్యనగా మూడు ఆత్మలని చెప్పాము. తౌరాత్కు, తౌహీద్కు నేను చెప్పిన అర్థములు అందరికీ క్రొత్తగానేయున్నా ఆధ్యాత్మిక భావములో చాలా దగ్గరైనవి. నిజ భావమును తెల్పునవి. ఏ పదమునకైనా నిజార్థము తెలిసినప్పుడు ఆ పదములోని జ్ఞానమూ, జ్ఞానము యొక్క సాంద్రత తెలియును. తౌరాతు, తౌహీదు రెండు ముస్లీమ్ల భావములో వేరు అర్థములు కల్గియున్నవని చెప్పుచుండినా నా భావములో రెండు ఒకే భావమును, ఒకే జ్ఞానమును తెలియజేస్తున్నవని చెప్పుచున్నాము. ముస్లీమ్ ఒక మతముగా యున్నప్పుడు వారు మతమునకు సరిపోవునట్లు, మతమునకు దగ్గరగాయున్నట్లు వేరువేరు అర్థములతో చెప్పుచుందురు. తౌరాత్ గ్రంథముగా, తౌహీద్ దేవుని ఆరాధనగా చెప్పుచుందురు. మేము మాత్రము దేవున్ని ఔన్నత్యమును, దేవుని స్థిరత్వమును, దేవుని విభాగములను తెల్పు పదములే తౌరాతు, తౌహీద్ అని చెప్పుచున్నాము.

**ప్రశ్న :- ముస్లీమ్‌లు తౌరాతును దేవుని గ్రంథముగా, తౌహీద్‌ను దేవుని ఆరాధనగా చెప్పుచున్నారు వాస్తవమే. అయితే తౌరాతు గ్రంథమును అల్లాహ్ మూసా ప్రవక్తకు ఇచ్చాడు అంటున్నారు. తౌరాత్ గ్రంథమునుండి మూసా తౌహీద్‌ను గురించి చెప్పియుండవచ్చును. మూసాకు అల్లాహ్ తౌరాత్ గ్రంథమును ఇచ్చాడు అనుట వాస్తవమా? అల్లాహ్ (దేవుడు) కనిపించడు, మాట్లాడడు అని మీరే అన్నారు. ఖుర్ఆన్ గ్రంథములో 42వ సూరా 51వ ఆయత్‌లో దేవుడు నేరుగా ఏ మానవునితోనూ మాట్లాడడు అని చెప్పియున్నారని కూడా మీరే చెప్పారు. అటువంటప్పుడు మనిషియైన మూసాకు దేవుడు ఎలా తౌరాతు గ్రంథమును ఇచ్చాడు? దీనికి జవాబు చెప్పండి.**

**జవాబు :-** మూసా ప్రవక్తగారికి తౌరాతు గ్రంథమును దేవుడే ఇచ్చినట్లు సూరా ఆరులో, ఆయత్ 91లో చెప్పడమైనది. మిగతా చోట సూరా 2 ఆయత్ 53లో కూడా మూసాకు తౌరాతు గ్రంథమును ఇచ్చాను అని చెప్పాడు. **(2-53) "ఇంకా అప్పుడు మేము మూసాకు గ్రంథము (తౌరాతును) ఇచ్చాము. అది సత్యాసత్యముల విచక్షణా రేఖ (గీటురాయి) మీరు సన్మార్గముపై నడుస్తారని ఇదంతా చేశాము"** ఇంకా మరికొన్నిచోట్ల కూడా మూసాకు దేవుడు తౌరాతు గ్రంథమును ఇచ్చినట్లు కలదు. అయితే దేవుడు తన గ్రంథమందు నేను ఏ మానవునికీ కనిపించను, వినిపించను, వినిపించునట్లు మాట్లాడను అని చెప్పినప్పుడు తౌరాతు గ్రంథమును ఎలా ఇచ్చాడు? అను ప్రశ్న రావడము సహజమే! ఆ ప్రశ్నను ఇప్పుడు అడగడము మంచిదయినది. నా తర్వాత దీనికి జవాబు ఎవ్వరూ చెప్పలేరు. ఎందుకనగా! తౌరాతు గ్రంథమును మూసాకు

ఇచ్చిన రహస్యము నాకు మాత్రము తెలుసు. మిగతావారికి ఎవరికీ తెలియదు. ఇప్పుడు నేను చెప్పు విషయమును జాగ్రత్తగా విన్నప్పుడే ఈ విషయము అర్థమవుతుంది. ప్రపంచములో జరగలేనిది స్వప్నములో జరుగుచుండును. దేవుడు నేరుగా ప్రత్యక్షముగా కనపడడు. అయితే స్వప్నములో కూడా దేవుడు కనిపించడు గానీ, దేవుని అవతారమయిన భగవంతుడు కనిపించవచ్చును. మూసాకు ఒక దినము స్వప్నములో భగవంతుడు కనిపించి తౌరాతు గ్రంథమును ఇవ్వడము జరిగినది. మూసా అని ఖురాన్ గ్రంథములో చెప్పిన వ్యక్తి బైబిలు గ్రంథములో మోషేగా చెప్పబడినాడు. మూసా మోషే ఇద్దరు ఒకటేయను విషయము చాలామందికి తెలియదు. మూసా అనబడు వ్యక్తినే మోషేగా చెప్పబడునప్పుడు తౌరాతు గ్రంథము ఆయనకు ఎలా వచ్చినది **"కృష్ణమూసా"** గ్రంథములో వ్రాసిన కొంత సమాచారమును క్రింద చూస్తాము.

మోషేకు ఇరువది (20) సంవత్సరముల వయస్సులో ఒక శుభ దినము ఏర్పడినది. అప్పటినుండి మోషే అప్పుడప్పుడు కొంత జ్ఞానమును చెప్పుచూ మంచి వక్తగా మారిపోయాడు. తర్వాత ఆయనను ప్రవక్త అని అందరూ అన్నారు. 20 సంవత్సరములనుండి ఆయన జీవితములో ఒక క్రొత్త వెలుగు వచ్చినది. 92వ సంవత్సరములో కృష్ణునిలో కూడా ఒక తృప్తి ఏర్పడినది. అప్పుడు జరిగిన విశేషము ఏమి అనగా! మోషేకు 20 సంవత్సరములు గడచు కాలమున ఒక దినము ఆదివారము రాత్రి నడిరేయి గడచిన సమయములో స్వప్నము రావడము జరిగినది. ఆ స్వప్నములో కృష్ణుడు కనిపించి గ్రంథమైన తన భగవద్గీతను మోషేకు ఇవ్వడము జరిగినది. మోషే తన స్వప్నములో కృష్ణున్ని చూచినా కృష్ణుడు ఎవరో తనకు తెలియదు. అయితే స్వప్నములో కనపడిన కృష్ణుడు ఎంతో తేజస్సు

కల్గియుండడమును చూచిన మోషే అతను నిజముగా దేవుడని నమ్మాడు. తేజస్సుతో కనిపించిన కృష్ణుడు మోషేకు భగవద్గీతా గ్రంథమును ఇచ్చి ఇది తౌరాత్ గ్రంథమని చెప్పడమైనది. మోషే స్వప్నములో గ్రంథమును తీసుకొని గుండెలకు హత్తుకున్నాడు. అంతే! అతని మెదడులో మెరుపు మెరిసినట్లయినది. మోషేకు ఒక్కమారుగా మెలుకువ వచ్చినది. మెలుకువ వచ్చిన తర్వాత కూడా గుండె వేగముగా కొట్టుకొనుచుండగా, తలలో ఏదో క్రొత్త అనుభూతిని పొందిన సంతోషము కల్గినది. జరిగినది ఏమిటి? అని కళ్ళు తెరచి చూడగా తన చేతులలో గ్రంథము కనిపించినది. అదియే తౌరాత్ గ్రంథము. దానిమీద అప్పటి భాషలో **'తౌరాత్'** యని ఉండడమును మోషే చూచాడు. ఆ విధముగా మోషేకు తౌరాత్ గ్రంథము లభించినది. అక్కడి తౌరాత్ గ్రంథమే ఇక్కడి భగవద్గీత.

తౌరాత్ యనగా మూడు చీకటి రాత్రులని అర్థము. మూడు కనిపించని ఆత్మల యొక్క జ్ఞానముండుట వలన, మూడు ఆత్మల జ్ఞానము రహస్యమైనదయినందున, మూడు ఆత్మలనుద్దేశించి తౌరాత్‌యని భగవద్గీతకు కృష్ణుడే పేరు పెట్టాడని తెలియుచున్నది. ఇదంతా చదివే వారికి ఒక కథలాగ యున్నా, నమ్మశక్యముగానిదైయున్నా ఇది నూటికి నూరు పాళ్ళు జరిగిన సత్యము. నమ్మమని ఎవరినీ బలవంతము చేయడము లేదు. సత్యమును చెప్పక తప్పదు, కావున సమయము ఆసన్నమైనప్పుడు చెప్పక తప్పలేదు. అట్లని పైకి కనిపించు నన్ను ఈ విషయమునకు బాధ్యున్ని చేయవద్దండి. నిజముగా మీకు ఎంత తెలుసో నాకు అంతే తెలుసు. ఇప్పుడిది మీకే కాదు, నాకు కూడా క్రొత్త విషయమే. ఇలా మనకు తెలియని ఎన్నో క్రొత్త విషయములు ఆత్మకు తెలుసు. ఆత్మ అందించితేనే ఇప్పుడు మనకు తెలియుచున్నది.

తౌరాత్ గ్రంథము మోషేకు లభించినదని తెలిసినది కదా! ఇక్కడే ఇంకొక క్రొత్త రహస్యము కలదు. అదేమనగా! తౌరాత్ గ్రంథమును మోషే తప్ప ఎవరూ చూడలేదు. తౌరాత్ గ్రంథము మోషేకు మాత్రమే కనిపించేది, ఇతరులకు కనిపించేది కాదు. ఆ విధముగా తౌరాత్ (భగవద్గీత) గ్రంథము అక్కడి మనుషులకు రహస్య గ్రంథమయినది. ఆ విషయము మోషేకు కూడా అర్థమయినది. గ్రంథములోని జ్ఞానమును రాత్రిపూట చదువుకొని పగలు ఇతరులకు చెప్పెడివాడు. చెప్పేది భగవద్గీతలోని జ్ఞానమయిన దానివలన శాస్త్రబద్ధముగా యుండెను. జ్ఞానమునకు గీటురాయిగా (సానరాయిగా) ఉండెను. తౌరాత్ జ్ఞానము వలన ఏది జ్ఞానమో ఏది అజ్ఞానమో తేల్చి చెప్పుటకు వీలయ్యేది. అందువలన తౌరాత్ గ్రంథమునకు **గీటురాయి** అను పేరు సార్థకమయినది. అదే గీటురాయియే మనవద్ద గల భగవద్గీత. ఆ దినములలో మోషేకు మాత్రము కనిపించి ఇతరులకు కనిపించని భగవద్గీత నేడు మనముందు జ్ఞానులకు, అజ్ఞానులకు కనిపించుచున్నది. నేడు గ్రంథము కనిపించినా అందులోని జ్ఞానము చాలా మందికి కనిపించడము లేదు. అనగా అర్థము కావడము లేదు.

దేవుడు కనిపించకుండా ఎక్కడోయున్న భగవంతుని వేషములో స్వప్నములో కనిపించి తౌరాతు గ్రంథమును నేరుగా ఇచ్చాడు. మొదటనే తన జ్ఞానమును మూసాకు ఇవ్వలేదు. తన గ్రంథమయిన తౌరాతు గ్రంథమును ఇచ్చాడు. తర్వాత తౌరాతు గ్రంథములోని జ్ఞానమును మోషే (మూసా) తెలుసుకొని ఇతరులకు తెలిపాడు. దేవుడు తన ధర్మము ప్రకారము మనుషులకు జ్ఞానమును ఎలా అందించాలో అలాగే అందిస్తాడు. మూసాకు స్వప్నములో ఇచ్చిన గ్రంథమును ఆయన తప్ప ఇతరులు ఎవరూ తౌరాతును చూడలేదు అంటే అదే గ్రంథమే పేరు మార్పుతో మనవద్దయుండడము మన అదృష్టము కాదా?

**ప్రశ్న :- తౌరాతు గ్రంథము, మనవద్దయున్న భగవద్గీత గ్రంథము రెండూ ఒక్కటే అని మీరు అంటే ప్రజలు నమ్ముతారా?**

**జవాబు :-** ప్రజలు నమ్ముతారా నమ్మరాయనునది దేవుని అనుగ్రహము ప్రజల మీద ఉండే దానినిబట్టి యుంటుంది. ప్రజల శ్రద్ధనుబట్టి దేవుడు ఏ విధముగానయినా చేయవచ్చును. ప్రజలు నమ్మాలి అనినా నమ్మకూడదు అనినా అది దేవుని ఇచ్ఛనుబట్టి జరుగును. నేను దేవుని సేవ చేయు నిమిత్తము నా కర్తవ్యమును నేను చేశాను. ఇతరులను నమ్మించాలనునది నా ఇష్టము కాదు. అది దేవుని ఇష్టమునుబట్టి మనుషుల భక్తి, శ్రద్ధలనుబట్టియుండును. స్వచ్ఛమయిన దైవజ్ఞానమునకు అందరూ అర్హులు కాదు. ఎవరు అర్హులో వారికే తెలియుటకు అవకాశము గలదు. ఈ విషయములో నా పాత్ర ఏమీ ఉండదు.

**ప్రశ్న :- తౌరాత్ అనగా దైవగ్రంథమని తెలిసిపోయినది. తౌహీద్ అనగా ఏకేశ్వరోపాసనయని అందరూ అంటున్నారు. అది నిజమేనా?**

**జవాబు :-** ఏకేశ్వరోపాసన అన్నదే ప్రపంచములో అతి గొప్ప ఆరాధన, నిజమైన దైవజ్ఞానముగా లెక్కించవచ్చును. **ఏక దైవ ఆరాధనకంటే ముఖ్యమైనది ఏదీ లేదు. తౌ** అంటే **మూడు** అనీ, తౌరాత్ అంటే మూడు చీకటి రాత్రులు అని చెప్పుకొన్నాము. ఇప్పుడు **తౌహీద్** అనడములో **ఏకేశ్వరోపాసన** అనడములో తప్పులేదుగానీ తౌరాత్ అని చెప్పినప్పుడు తౌ అంటే మూడు అనీ, రాత్ అంటే రాత్రులని చెప్పాము. అదే విధానము ప్రకారము చెప్పితే తౌ అంటే మూడు అని చెప్పవలసియుంటుంది. తౌహీద్ అనగా మూడు కనిపించనివి అనియూ, మూడు ఆత్మలు అనియూ చెప్పవచ్చును. తౌరాత్ అనగా మూడు రాత్రులు అని చెప్పుకొన్నాము.

దాదాపు తౌరాత్ అర్థమునే తౌహీద్ చెప్పుచున్నది. మూడు కనిపించనివి ఆత్మలేయని చెప్పవచ్చును. తౌరాత్ అనగా మూడు రాత్రులు అని చెప్పాము కదా! తౌహీద్ అనగా మూడు కనిపించనివని చెప్పునప్పుడు, కనిపించనివి మూడు ఏవి? అను ప్రశ్న రాగలదు. తౌహీద్‌కంటే ముందు తౌరాతు విషయమును తెలుసుకొంటే తర్వాత తౌహీద్ విషయము తెలియగలదు. ఆధ్యాత్మిక విషయమును బయట ప్రపంచముతో పోల్చుకోకూడదని మరువ కూడదు. అందులో దాగియున్న నిగూఢ విషయములను తెలియవలెను.

రాత్రులు అన్నీ చీకటితో కూడుకొనియుండునవే అయినా **కొన్ని రాత్రులు నిద్రరాక మెలుకువతో కూడుకొనియుండును. కొన్ని రాత్రులు స్వప్నముతో కూడుకొని నిద్రకాక మెలుకువకాక యుండును. కొన్ని రాత్రులు పూర్తి నిద్రతో కూడుకొనియుండును.** ఈ విధముగా మూడు విధముల రాత్రులు గలవు. మెలుకువతో కూడుకొన్న రాత్రి **జీవాత్మకు** గుర్తుగా యున్నదని తలచవలెను. అట్లే స్వప్నముతో కూడుకొన్న రాత్రి **ఆత్మకు** గుర్తుగా యున్నది. పూర్తి నిద్రతో కూడుకొన్న రాత్రి **పరమాత్మకు** గుర్తుగాయున్నదని చెప్పవచ్చును. మూడు చీకటి రాత్రులే అయిన దానివలన మూడు రాత్రులు మూడు ఆత్మలకు గుర్తుగా చెప్పడమైనది. మూడు చీకటి రాత్రులలో ఏమీ కనిపించదు, కావున మూడు రాత్రులను మూడు కనిపించని (తెలియని) ఆత్మలుగా చెప్పాము. మూడు ఆత్మలు ఒక్కటే కాకుండా **మూడు ఆత్మలలో కర్మను అనుభవించు జీవాత్మను మెలుకువ రాత్రిగా చెప్పాము. అట్లే కర్మను అనుభవింపజేయు ఆత్మను మధ్యాత్మగా చెప్పుచూ స్వప్న రాత్రితో పోల్చి చెప్పాము. అనుభవించే జీవాత్మకంటే, అనుభవింపజేసే ఆత్మకంటే వేరుగా యుండి చూస్తూ సాక్షిగాయున్న పరమాత్మను (దేవున్ని) పూర్తి నిద్రతో నిండిన రాత్రిగా చెప్పాము.** మూడు రాత్రులలోనూ తేడా

యున్నట్లే, మూడు ఆత్మలలోనూ తేడా గలదు. మధ్యలో స్వప్నము నిజము కాదు, అబద్ధము కాదు అన్నట్లుండును. స్వప్నమును నిజమని నిరూపించ లేరు. అట్లే అబద్ధమని కూడా నిరూపించలేరు. అట్లే ఆత్మను ఎటూ తేల్చి చెప్పలేము. ఆత్మ కొందరికి తెలిసినట్లే యుంటుంది, ఏమాత్రము తెలిసి యుండదు. అట్లే ఏమాత్రము తెలియనట్లే యుంటుంది, వాస్తవానికి తెలిసేయుంటుంది. అయినా ఎవరూ ఎటూ తేల్చి చెప్పుటకు వీలులేదు.

జీవాత్మ కర్మను అనుభవించడమే తన ధ్యేయముగా యున్నది. కర్మనుండి తప్పించుకొను ప్రయత్నము ఏమాత్రము చేయక, కర్మను తప్పించుకొను అవకాశమున్నా, ఆ అవకాశమును వినియోగించుకోక అనుభవములలోనే చిక్కుకొని యున్నది. అందువలన జీవాత్మను మెలుకువ రాత్రిగా చెప్పాము. మెలుకువ రాత్రిలో అనగా నిద్రరాని రాత్రిలో నిద్రపోవుటకు అవకాశమున్నది. ఎలా అనగా నిద్ర వచ్చుటకు కావలసిన నిద్రమందు యున్నది. కొందరు నిద్రమందు వాడి మెలుకువ రాత్రిలో కూడా నిద్రపోవువారు గలరు. మెలుకువ రాత్రి కర్మ అనుభవమునకు గుర్తుగా, కర్మను అనుభవించు జీవునికి గుర్తుగా యున్నది. జ్ఞానము అను నిద్రమందును సంపాదించుకొన్నవారు మెలుకువగాయుండి కర్మను అనుభవించక తప్పించుకొనుటకు అవకాశము గలదు. అట్లు తప్పించుకొను వారు కూడా గలరు. జ్ఞానము వలన కర్మనుండి తప్పించుకోవచ్చని దేవుడే తన బోధయందు చెప్పియున్నాడు. అయినా అటువైపు మనిషి తన ధ్యాసను పెట్టలేదు. తన కర్మను తాను కొనసాగించుచున్నాడు. తాను కర్మను అనుభవిస్తున్నానను ధ్యాస కూడా మనిషికి లేదు. నేను జీవున్నని కూడా తనకు తెలియని స్థితిలో మనిషి బ్రతుకుచున్నాడు. మెలుకువలో మనిషి ప్రపంచ విషయముల జ్ఞాపకములోయుండునట్లు మనిషి ప్రకృతి సంబంధ

ఆలోచనలు తప్ప పరమాత్మ సంబంధ ఆలోచనలు చేయడము లేదు. అందువలన ప్రపంచ ధ్యాసలలోయున్న మనిషిని మెలుకువ రాత్రితో సమానముగా పోల్చి చెప్పడమైనది.

జీవాత్మకు పరమాత్మకు మధ్యలో ఆత్మ కలదు. జీవాత్మ పూర్తి మెలుకువ రాత్రిగా పోల్చబడితే పరమాత్మ పూర్తి నిద్ర రాత్రిగా పోల్చి చెప్పడమైనది. జీవునకు పూర్తి వ్యతిరేఖ దిశలో దేవుడున్నాడు. దేవునికి అన్నీ చేయగల స్థోమతయుండినా ఆయన ధర్మము ప్రకారము ఆయన ఏమీ చేయడు. జీవుడు చేస్తూయుండగా, ఆత్మ చేయిస్తూయుండగా, పరమాత్మ రెండిటికీ వేరుగా చూస్తూయున్నాడు. జీవుడు ఊరకయుండక ఏదో ఒకటి అనుభవిస్తున్నాడు. దేవుడు ఏమీ అనుభవించకయున్నాడు. జీవునికి దేవునికి మధ్యలోని ఆత్మ తాను ఒక్క క్షణము కూడా ఊరకయుండక తన దృష్ఠిని జీవుని కర్మమీద పెట్టి, క్షణ క్షణము కర్మను అమలు చేయుచూ జీవున్ని ప్రతి క్షణము కర్మను అనుభవింపజేయుచున్నాడు. శరీరమున కంతా పెద్దగా యుండి ప్రతి అవయవమునకు శక్తినిచ్చి కదలించు చైతన్యముగా యున్నాడు. ఆత్మను నిజమని చెప్పదలిస్తే అబద్ధముగా కనిపిస్తాడు. అబద్ధమని చెప్పదలిస్తే నిజముగా కనిపిస్తాడు. ఆత్మను శరీరములో ఉందని చెప్పుటకు ఎన్ని ఆధారములు గలవో, శరీరములో లేదని చెప్పుటకు అన్ని ఆధారములు గలవు. అందువలన ఆత్మ విషయములో అందరూ వెనుకడుగు వేస్తున్నారు.

శరీరములోయున్న ఆత్మను సత్యమనిగానీ, అసత్యమనిగానీ చెప్పుటకు వీలులేనట్లుండుట వలన ఆత్మను స్వప్నముల రాత్రిగా పోల్చి చెప్పడము జరిగినది. స్వప్నవిషయములో భయపడినవాడు మేల్కొనినా ఆ భయము పోలేదు. కావున భయపడిన సంఘటన వాస్తవమే అయినా

మెలుకువలోనికి వచ్చే సమయానికి భయపడిన సంఘటన యొక్క పరిస్థితి అక్కడ లేదు. ఉదాహరణకు ఇంటిలో దొంగలు పడి దోచుకొంటున్నారు. ఆ సమయములో మెలుకువ వచ్చి చూచి దొంగలుయని గట్టిగా అరవగా దొంగ దాడిచేసి కత్తితో పొడిచాడు అప్పుడు భయపడినందున వెంటనే మెలుకువలోనికి రావడము జరిగినది. మెలుకువలోనికి వచ్చిన తర్వాత కూడా పది నిమిషములు భయము పోలేదు. సంఘటన వల్లనే భయముండుట వలన అది జరిగినది అనుటకు ఆధారము గలదు. మెలుకువలోనికి వచ్చిన తర్వాత దొంగలేడు, దొంగతనము జరుగలేదు. దొంగతనము జరిగిన ఆనవాళ్ళు లేవు. అందువలన దొంగతనము జరుగ లేదుయని చెప్పవచ్చును. జ్ఞాపకము వచ్చిన తర్వాత కూడా భయము ఉండుట వలన దొంగతనము వాస్తవమే అన్నట్లుండినా, దాని ఆనవాళ్ళు ఏమాత్రము లేని దానివలన దొంగతనము వాస్తవము కాదు అని చెప్పవచ్చును. ఈ విధముగా స్వప్నము ఒకవైపు సత్యమును, మరొకవైపు అసత్యమును కల్గియుండును. మన శరీరములోని మధ్యాత్మ కూడా స్వప్నమువలె అన్ని పనులు తానే చేయుచున్నా ఏమాత్రము చేయనిదానివలె యున్నది. ఒకవైపు శరీరములో ఆత్మ అన్నీ దేవుడే చేస్తున్నాడని చెప్పును. మరియొకమారు అన్ని పనులు నేనే చేయుచున్నాను అని చెప్పును. ఇంకొకమారు జీవుడే చేశాడని చెప్పును. ఏదీ ఒక నిర్ధారణ లేని విధముగా ఆత్మయుండుట వలన ఆత్మను సత్యాసత్యములకు దొరకని స్వప్నముగా చెప్పుచున్నాము.

ఈ విధముగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మ మూడు ఆత్మలను మూడు రాత్రులుగా పోల్చి చెప్పారు. మూడు ఆత్మల జ్ఞానమున్న గ్రంథము భగవద్గీత. భగవద్గీత మొదట తయారయిన దైవగ్రంథము. అయినా భగవద్గీతయను

పేరును మనుషులు దానికి పెట్టారు. ఆ పేరు గ్రంథములోని జ్ఞానమునకు తగినట్లు లేదు. భగవంతుడు చెప్పినదని వ్యాసుడు గ్రంథములో **'భగవాను వాచ'** అని గ్రంథములో వ్రాసినా వ్యాసునికి కృష్ణుడు భగవంతుడను నమ్మకము లేదు. అయినా భగవద్గీతయను పేరు ఆయన (కృష్ణుడు) బయటికి చెప్పదలచుకోలేదు. భగవద్గీతలో మూడు ఆత్మల జ్ఞానముండుట వలన భగవద్గీతను తౌరాత్ గ్రంథమని చెప్పి కృష్ణుడు మూసాకు ఇచ్చాడు. మూసాకు (మోషేకు) ఇచ్చిన వాడు కృష్ణుడు అనిగానీ, భగవంతుడని గానీ ఏమాత్రము తెలియదు. ఇవ్వబడిన గ్రంథము భగవద్గీతయనిగానీ మూసాకు తెలియదు. మూసాకు కృష్ణుడు భగవద్గీతను తౌరాతుయని పేరు పెట్టి ఇచ్చాడని మిగతా మనుషులకు కూడా తెలియదు.

మూసాకు అల్లాహ్ (దేవుడు) జ్ఞానమును స్వయముగా ఇవ్వలేదు. దేవుడు అప్పుడు మనిషి రూపములో యుండుట వలన స్వప్నములో తౌరాతు గ్రంథమును ఇచ్చుటకు సాధ్యపడినది. స్వప్నము సత్య అసత్యముల కలయిక కావున ఇచ్చినది తౌరాతే అయినా అది మూసాకు ఒక్కనికే కనిపించేది. అప్పటి ప్రజలకు గానీ, ఇప్పటి మనుషులకుగానీ మూసాకు ఇవ్వబడినది భగవద్గీతేయని, దానిని తౌరాత్ పేరుతో కృష్ణుడే ఇచ్చాడని నమ్ముట ఇప్పుడు అవసరము లేదుగానీ, అది దేవుని తర్వాత జన్మ అయిన ఏసు జీవితములో ఇది తెలియుట అవసరము. జరిగిపోయిన విషయము తెలియుట వలన అప్పటి జ్ఞానమునకు సాక్ష్యము దొరుకును. అందువలన ఆ విషయమును ఇప్పుడే చెప్పాము. మూడు ఆత్మల జ్ఞానచిహ్నామని తెలుపు నిమిత్తము మూసాకు ఇవ్వబడిన గ్రంథము పేరు తౌరాతు అని చెప్పారు. మూడు ఆత్మలలో జీవాత్మ నుండి పరమాత్మ వరకు ఎంతో తేడాయుండడము వలన మూడు ఆత్మలను మూడు విభిన్నమైన రాత్రులతో పోల్చడమైనది. మెలుకువ

రాత్రి, స్వప్నము రాత్రి, నిద్ర రాత్రికి ఎంత తేడాలున్నాయో అంతే తేడాలు మూడు ఆత్మలలో యున్నట్లు ఇంతకుముందే తెలియగలిగాము. ఇది తౌరాతు పేరు యొక్క విశేషముకాగా, దీనిని అనుసరించి 'తౌహీద్' పదము కూడా పుట్టుకొచ్చినది.

తౌహీద్ అనగా ముస్లీమ్‌లందరికీ తెలిసిన వివరము ప్రకారము ఏకేశ్వరోపాసనను తౌహీద్ అని అనుచుందురు. ఏక దైవ అరాధన అనునది వాస్తవమే అయినా, ఆ పేరులో ఏ విధముగా ఆ అర్థము వచ్చినదో వివరించి చూసుకోవలసిన అవసరమున్నది. కేవలము అర్థము తెలియుటకంటే అర్థము వెనుక దాగియున్న వివరమును తెలియగలిగితే అర్థమునకు విలువ పెరుగును. అందువలన తౌహీద్ పదము యొక్క అర్థము ఏకేశ్వరోపాసన లేక ఒకే దేవుని ఆరాధన అనియుండుటను చూస్తే ఈ విధముగా ఆ అర్థము పుట్టుకొచ్చినదని అనుకొంటాను. తౌరాత్ పదములో **తౌ** అనగా మూడు అని అర్థమున్నట్లు తౌహీద్ పదములో కూడా తౌ అనగా మూడు అనియే అర్థము. తౌహీద్‌లో తౌ+హీద్ అను రెండు శబ్దములు గలవు. మొదటి అక్షరమునకు అర్థము మూడు అని చెప్పబడినది. తర్వాత గల 'హీద్' అను శబ్దములో 'హి' అనునది అర్థముతో కూడుకొన్న శబ్దముకాగా 'ద్' అను శబ్దము విలువలేనిది. ముగింపునకు ఏ శబ్దమునయినా ఉంచు కోవచ్చును. తౌహీద్‌లో 'తౌహి' అను రెండు అక్షరములకే విలువ అర్థము గలదు. హి లేక హిద్ అను శబ్దమునకు **'శక్తి'** అని అర్థము గలదు. 'హి' అను అక్షరము శక్తికి గుర్తు. హిద్ అనగా శక్తులు అని చెప్పవచ్చును. **తౌహీద్ అనగా మూడు శక్తులు** అని అర్థము. శక్తి కనిపించదు కావున కనిపించని శక్తులని చెప్పారు. తౌహీద్‌లో మూడు కనిపించని శక్తులు గలవు. శక్తికి మారుపేరుగా పురుషుడు అని కూడా చెప్పవచ్చును. తౌహీద్

అనగా మూడు శక్తులు లేక ముగ్గురు పురుషులని చెప్పవచ్చును. మూడు కనిపించని శక్తులనే ముగ్గురు కనిపించని పురుషులుగా చెప్పుచున్నాము. ముగ్గురు పురుషులనే మూడు ఆత్మలని అంటున్నాము. **తౌహీద్ అనగా మూడు శక్తులనీ, మూడు ఆత్మలనీ, ముగ్గురు పురుషులనీ** చెప్పవచ్చును. ఆ ముగ్గురి పురుషులలో ఎవరు గొప్ప, ఎవరు తక్కువయని తేల్చి చెప్పుటకు గీటురాయి అవసరమైనది.

మూసాకు అల్లాహ్ ఇచ్చిన గీటురాయి ప్రకారము చూస్తే మూసా గ్రంథములో (భగవద్గీతలో) పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయమును చూస్తే అందులో 16వ శ్లోకమందు, 17వ శ్లోకమందు ఇలా చెప్పాడు చూడండి.

శ్లో॥ 16. ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ॥

**భావము :-** "లోకములో యున్న పురుషులలో (ఆత్మలలో) రెండు రకముల వారు గలరు. ఒకని పేరు క్షరుడని చెప్పుచుందురు. ఇంకొకని పేరు అక్షరుడని చెప్పవచ్చును. క్షరుడు అనగా నాశనమగువాడు అని అర్థము. అక్షరుడు అనగా నాశనము లేనివాడని అర్థము. క్షరుడు సర్వ జీవులయందు గలడు. అక్షరుడు క్షరునితోపాటు శరీరములోనేయుండును."

శ్లో॥ 17. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

**భావము :-** "ఇద్దరి పురుషులకంటే వేరు ఇంకొక ఉత్తమ పురుషుడు గలడు. వానినే పరమాత్మ యని అనుచున్నాము. అతడు ముల్లోకములను ఆవహించి నాశనములేని దేవుడై, అధిపతియై విశ్వమునంతటిని భరించు చున్నాడు."

భగవద్గీతలో చెప్పిన ముగ్గురు పురుషులలో ఒకడు క్షరుడు, రెండవ వాడు అక్షరుడు, మూడవ వాడు పురుషోత్తముడు. మొదటి పురుషుడు జీవుడు. జీవుడు నాశనమయ్యే వాడయినందున అతనిని **'క్షరుడు'** అని అంటున్నాము. రెండవ పురుషుని పేరు ఆత్మ. ఆత్మ నాశనము కానివాడు అయినందున **అక్షరుడు** అని ఆత్మను అంటున్నాము. క్షర పురుషునికంటే, అక్షర పురుషునికంటే **ఉత్తమ పురుషుడు** మూడవ వాడు గలడు. వానినే దేవుడు లేక పరమాత్మయని, అల్లాహ్‌యని వేరువేరు విధములుగా పిలుస్తున్నాము. ముగ్గురు అనగా మూడు ఆత్మలు ఒకే విధముగా లేకుండా ఒకటి గొప్ప మరొకటి ఇంకా గొప్ప అన్నట్లు గలవు. అందువలన వాటి మధ్యలో గల తారతమ్యములను తెలుపు నిమిత్తము భగవద్గీత, పురుషోత్తమ ప్రాప్తి యోగములో ముగ్గురు పురుషులుగా విభజించి చెప్పారు. ఆ ముగ్గురు పురుషులనే 'తౌహీద్' అని కూడా అన్నారు. ముగ్గురు పురుషులను అర్థము చేసుకొనుటకు బయట ప్రపంచములో కనిపించు వారితో పోల్చి చెప్పారు. తౌరాతుకు మూడు రాత్రులని చెప్పి మూడు రకముల రాత్రులను వివరించి మెలుకువ రాత్రి, స్వప్నము రాత్రి, నిద్ర రాత్రియని వివరించి చెప్పినట్లు, ఇప్పుడు 'తౌహీద్' అను పదమునకు మూడు కనిపించని శక్తులని, వాటినే మూడు ఆత్మలని అంటున్నామని చెప్పుచున్నాము. మూడు ఆత్మలను దగ్గరగా అర్థము చేసుకొనుటకు పైకి కనిపించు మనుషులనే చూపి ఉదహరించుచున్నారు. మనుషులలో నపుంసకుడు, స్త్రీ, పురుషుడు అని మూడు రకముల శరీరములున్నవారు గలరు. నపుంసకుడు మగ శరీరము ధరించి మగవారికున్న అవయవములతోనే యుండును. పురుషునివలె శరీరమున్నా వాని శరీరములో పురుషత్వము ఉండదు. మొదటివాడు నపుంసకుడు కాగా, మూడవవాడు పురుష శరీరముతో పురుషావయవ

ములతోనే యుండును. మూడవ వానికి పురుష శరీరముండడమే కాక వాని శరీరములో పురుషత్వము ఉండును. మొదటి వానిది మూడవ వానిది రెండూ పురుషావయవములు గల శరీరమే అయినా మొదటి వానిలో పురుషత్వము లేదు, మూడవ వానిలో పురుషత్వము గలదు. ఈ రెండు శరీరములు కాక మధ్యలో రెండవ శరీరము మొదటి దానికంటే మూడవ దానికంటే భిన్నముగా ఉన్నది. ఈ రెండవ శరీరములో పురుషుడు అను గుర్తు పట్టుటకు వీలు లేకుండా స్త్రీ అవయవములుగల శరీరముగా యున్నది. శరీరము స్త్రీ శరీరమే అయినా అందులో స్త్రీ స్వభావము లేదు. పురుష స్వభావమున్నది. దానివలన ఆమెను ఒక విధముగా పురుషుడని చెప్పవచ్చును. ఆమె ఆకారములో స్త్రీ అయినా, లక్షణములలో పురుషునిగా యున్నది. మొదటివాని శరీరము పురుషుడయినా ఆత్మ లక్షణములు గలవాడుగా యున్నాడు.

ఈ విధముగా రెండు శరీరములు పురుషులవి, ఒక శరీరము స్త్రీది అయినా పురుష లక్షణములు కలదిగా యున్నది. మధ్యవాడు చిన్నప్పటినుండి పురుషుల దుస్తులు ధరించుచుండెను. అప్పుడు ముగ్గురు పురుషులుగానే కనిపించుచుండిరి గానీ అందులో మధ్యలోవాడు స్త్రీగా యున్నాడు. మధ్య వానిని వేసుకొన్న దుస్తులనుబట్టి పురుషుడని చెప్పినా లోపలి శరీరమునుబట్టి ఆడ అని చెప్పవచ్చును. మధ్య వానిని ఎటూ చెప్పుటకు వీలు లేకుండా పోయినది. మూడు రాత్రులలో మధ్య స్వప్న రాత్రిని స్వప్నము నిజమని చెప్పుటకు ఒకవైపు ఆధారమున్నా, అసత్యమని చెప్పుటకు కూడా ఆధారమున్నట్లు, తౌహీద్‌లో వర్ణించిన ముగ్గురు వ్యక్తులను చూస్తే మగవారుగా యున్నా మధ్యవానిని మగవానిగా నిరూపించలేము. ఎటు తిరిగి మధ్యరాత్రి, మధ్య మనిషిని నిర్ణయించలేనట్లు సర్వ జీవరాసుల

శరీరములో గల మూడు ఆత్మలలో మధ్య ఆత్మను ఎటూ నిర్ణయించబడనిదిగా యున్నది. ఎవరి బుద్ధికి అర్థము కానిది, ఎవరి అంచనాకు దొరకనిది మధ్య ఆత్మ. మధ్య ఆత్మయే మొదటి జీవాత్మకు ఆదేశములను ఇచ్చి నడుపుచుండును. శరీరములో మధ్యాత్మ సర్వకార్యములను చేయునదై యున్నా తనను ఏమాత్రము గొప్పగా చెప్పుకోదు. పరమాత్మగా యున్న మూడవ ఆత్మనే గొప్పగా చెప్పుచుండును. తాను చేయుచున్న అన్ని కార్యములను తనమీద పెట్టుకోక పరమాత్మ చేసినట్లు చెప్పుచుండును. ఆత్మ చేసిన పనులను జీవాత్మ అహము చేత తానే చేశానని చెప్పుచుండును. అయితే ఆత్మ జీవాత్మ మాటను ఏమాత్రము ఖండించదు. వాస్తవముగా చేసినది ఆత్మే అయినా ఈ పని చేసినది ఎవరు? అని ఆత్మను అడిగితే ఆత్మ పరమాత్మ మీద చెప్పును. జీవాత్మ చేయకున్నా తనను కర్తగా చెప్పితే ఆత్మ తాను చేసినా తనను కర్తగా చెప్పక దేవున్నే కర్తగా చెప్పును.

దైవజ్ఞానము తెలియని శరీరములో జీవుడు తనను చేయని అన్ని పనులకు కర్తగా చెప్పుకొనుచుండును. అయితే ఆత్మ జీవాత్మ చెప్పిన దానిని ఖండించకున్నా తాను చెప్పునప్పుడు మాత్రము దేవున్నే గొప్పగా చెప్పుచుండును. కొంతకాలము తర్వాత జీవుడు దైవజ్ఞానము తెలియ గలిగితే అప్పుడు ఆత్మ చేయు పనులను ఆత్మే చేసినాడని తెలియక దేవుడు చేశాడని చెప్పుచుండును. ఆత్మ అట్లే చెప్పగా జీవాత్మ కూడా పనులను దేవుని మీదనే చెప్పుచుండును. అట్లు కొంత కాలము గడువగా జీవుడు కొన్ని జన్మల తర్వాత సంపూర్ణ జ్ఞానమును తెలియగలిగి అప్పుడు శరీరములో జరిగే పనులను ఆత్మే చేయుచున్నదని తెలియగల్గును. అప్పుడు పరమాత్మ అన్నిటికీ అతీతుడనీ, అవ్యయుడనీ, అధిపతియనీ తెలియగల్గును. అన్ని విధముల పరమాత్మయే గొప్పయని జీవుడు తెలియగలిగినప్పుడు జీవుడు

పరమాత్మ ఒక్కనినే ఆరాధించను మొదలుపెట్టును. అప్పుడు ఇతర దేవతలను వదలి అందరికీ ఒక్క పరమాత్మే దేవుడుగాయున్నాడని తెలిసి ఒక్క దేవున్నే గౌరవముగా ఆరాధించను మొదలు పెట్టును. అప్పుడు జీవుడు **"ఏకేశ్వరోపాసన"** చేసినట్లగును. జీవుడు తెలియు జ్ఞానమును బట్టి జీవునకున్న శ్రద్ధనుబట్టి దేవుని మీదనే ధ్యాస యుండునట్లు చేసి దేవున్నే ఆరాధించునట్లు చేయుచున్నది ఆత్మ. జీవుడు భావములు కలవాడేగానీ కార్యములను చేయు స్థోమత లేనివాడు, వాస్తవముగా చేతకానివాడు. అటువంటి జీవుని భావమునుబట్టి, ఆత్మ తానే దేవున్ని ఆరాధించుచూ, ఆరాధన కార్యములను చేయుచూ అంతవరకు ఎప్పుడూ చెప్పని విధముగా తాను చేయు పనులు అనగా ఆరాధనలు జీవాత్మ చేసినదని చెప్పును. జీవాత్మ జ్ఞానమును సంపూర్ణముగా తెలియనంతవరకు మధ్యాత్మ తాను చేయు పనులన్నియూ దేవుని మీద చెప్పుచుండును. అయితే జీవుడు జ్ఞానమును తెలిసిన తర్వాత దేవుని మీద చెప్పక జీవుని మీద చెప్పును.

దేవుని ఆరాధనలుగానీ, అన్యదేవుళ్ళ ఆరాధనలుగానీ చేయునది మధ్యాత్మయే. అయితే ఎన్నడుగానీ తాను చేసిన పనులను తన మీద చెప్పుకోలేదు. దేవుడు తన ధర్మము ప్రకారము ఏమీ చేయనివాడుగా యున్నాడు. అయితే మనుషులకు సంతతి కలుగజేయువాడు ఆత్మయే. అయినా ఆ విషయము ఎవరికీ తెలియదు. వాస్తవముగా సర్వజీవులకు తండ్రి మధ్యాత్మయే. అయినా ఆ విషయము ఎవరికీ తెలియకుండా దాచి వేసినది ఆత్మయే. జీవున్ని అజ్ఞాన మార్గములోనికి గానీ, జ్ఞాన మార్గము లోనికిగానీ పంపువాడు ఆత్మయే. అయితే అందరు దానిని చేయువాడు దేవుడేయన్నట్లు నమ్మించినవాడు ఆత్మయే. దేవుడు ఎప్పుడూ ఏమీ చేయలేదు, చేయడు. సృష్టికంటే పూర్వము సర్వ సృష్టిని సృష్టించినవాడు

దేవుడే. అదే ఆయనకు మొదటి పని, ఆఖరి పని. సృష్ఠి తర్వాత ఆయన ఏ పనిని చేయనివాడుగా యున్నాడు. సృష్ఠి తర్వాత అన్ని కార్యములకు పెద్ద, కర్త ఆత్మే. ఆత్మ దేవునివలె పని చేస్తూ దేవుడే అన్నీ చేయుచున్నాడని నమ్మించుచున్నది. మనిషికి తనమీద దృష్ఠి లేకుండా చేయుచున్నది. అందువలన నేటివరకు సృష్ట్యాదినుండి ఆత్మంటే ఎవరో ఎవరికీ తెలియదు. కొంత జ్ఞానము తెలిసినవారికి జీవుడు, దేవుడు వరకు తెలియునుగానీ ఆత్మ వరకు తెలియదు. సర్వులకు తండ్రి దేవుడు కాదు నీలోవుండు ఆత్మయే. సర్వులను అజ్ఞానములో ముంచినవాడు దేవుడు కాదు నీ ఆత్మయే. సర్వులను జ్ఞానమువైపు పంపువాడు దేవుడు కాదు ఆత్మయే. తనను తాను ఇతరులకు తెలుపువాడు ఆత్మయే. తాను ఇతరులకు తెలియకుండా శరీరములో అణిగియున్నవాడు ఆత్మయే. బయటికి కనిపించు పనులను చేయునది ఆత్మయే. అయినా బయట ఎవరికీ తెలియకుండా జగత్తునంతటినీ ఆట ఆడించునది ఆత్మయే. నీకు జ్ఞానము కావాలంటే నీవు జ్ఞానివి కావాలంటే దేవున్ని వదలి ఆత్మను తెలుసుకో, ఆత్మే దేవున్ని తెలుపుతుంది.

## ఆత్మే అన్నింటినీ తేల్చి చెప్పే గీటురాయి.

## సమాప్తము

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

---

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# గీటు రాయి

గీటు రాయి

గీటు రాయి

గీటు రాయి

గీటు రాయి

గీటు రాయి

గీటు రాయి

| గీటు | రాయి |
|---|---|
| జ్ఞానము | అజ్ఞానము |
| సత్యము | అసత్యము |
| దేవుడు | మాయ |


Author :

The Only Guru of Three Religions

The Spiritual Emperor, Thraitha Theorem Originator

Sri Acharya Prabodhananda Yogeeshwarulu


www.thraithashakam.org